అపరాధ పరిశోధన అనుబంధం—103

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నొక్కుల జుత్తు
రచన : వసుంధర

## యావజ్జీవాశ్రమం
రచన : సికిందర్

## కోటి సారంగాలు
రచన : మోహన్

## యాభై వజ్రాలు
రచన : టెంపోరావ్

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 103
జూలై, 1982
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# నొక్కుల జుత్తు

## వసుంధర

"భాస్కర్రావు గారిల్లి దేనాండీ?" అన్నాడతను.

భాస్కర్రావు అతడివంక పరీక్షగా చూశాడు. అతడికి పొతికేళ్ళుంటాయి. మనిషి ఆకర్షణీయంగా వున్నాడు. ముఖ్యంగా నొక్కుల జుత్తు అతడి ముఖానికి బాగా అందాన్నిచ్చింది. అలాంటి జుత్తు అంటే భాస్కర్రావుకు బాగా యిష్టం.

"నేనే భాస్కర్రావును — " అన్నాడు భాస్కర్రావు.

"హమ్మయ్య—చాలా కష్టపడాలా మోననుకున్నాను. ఇల్లు సులభంగా నే దొరికింది-" అన్నాడతను నిట్టూర్పుతూ.

"నువ్వెవరో నాకు తెలియను—" అన్నాడు భాస్కర్రావు.

"నా పేరు రాజారావండి—" అన్నాడతను.

"ఇప్పటికి పేరు మాత్రం తెలిసింది—" అన్నాడు భాస్కర్రావు.

4

"నన్ను సంతోష రావుగారు పరపారండి!"

ఉలిక్కిపడ్డాడు భాస్కరరావు. అయ్యో—అతడికి నొక్కుల జుత్తు లేకుండా వుంటే బాగుండునే అని అప్రయత్నంగా అతననుకున్నాడు.

"అలాగా—ఉత్తరమేదైనా ఇచ్చారా?" అన్నాడు భాస్కరరావు. రాజారావు తన భుజానికి వ్రేలాడుతున్న సంచీలోంచి ఓ కవరుతీసి భాస్కరరావుకి అందించాడు.

భాస్కరరావు కవరు చించాడు. అందులో పదివేల రూపాయలకు ఒక డ్రాఫ్టు వుంది. అది తీసి జేబులో పెట్టుకున్నాడు. డ్రాఫ్టుకాక వేరే కాగితం ఒకటి వుంది. అందులో తేదీకానీ, సంతకం కానీ ఏమీ లేకుండా ఒకే ఒక వాక్యం వుంది. అది చదువుకుని మడిచి జేబులో పెట్టుకున్నాడు. భాస్కరరావు ఉత్తరంలోని వాక్యాన్ని మరోసారి మననం చేసుకున్నాడు.

అతనే ఇతను!

ఇదీ ఆ ఉత్తరంలోని వాక్యం! భాస్కరరావు మరొక్కసారి రాజారావుని పరీక్షగా చూసి—"నీకు నొక్కులజుత్తు లేకుండా ఉంటే ఎంత బాగుండేది?" అని అతడికి వినబడేలాగునే అన్నాడు.

"కానీ అది నా ముఖానికి అందాన్నిచ్చిందని అంతా అంటారు—" అన్నాడు రాజారావు ఆశ్చర్యపడుతూ.

"అందుకే మరి!" అనుకున్నాడు భాస్కరరావు. అతడి మనసులో మాత్రం ఉత్తరంలోని వాక్యం మెదుల్తూనే వుంది.

"అతనే ఇతను!"

# 2

"నాకు మనస్కరించడంలేదు—" అన్నాడు భాస్కరరావు.

"అయితే ఏంచేస్తామంటారు?" అంది జమున.

"సంతోషరావుగారు తన నెందుకు పంపారో ఆ అమాయకుడికి తెలియదు. అతడి నొక్కుల జుత్తు చూస్తూంటే నాకేమీ చేయాలనిపించడంలేదు. అయితే సంతోషరావు డ్రాఫ్టు కూడా పంపేశాడు. డ్రాఫ్టు వెనక్కు పంపేయనా అని ఆలోచిస్తున్నాను—" అన్నాడు భాస్కరరావు.

"అందువల్ల ప్రమాదమేమో ఆలోచించండి—" అంది జమున.

సంతోషరావు అప్పగించిన పని కాదనడం ప్రమాదమేనని భాస్కరరావుకు తెలుసు. అయితే పదిహేనేళ్ళ క్రితం భాస్కరరావు తమ్ముడు కారు యాక్సిడెంటులో మరణించాడు. అప్పుడతడి వయస్సు పాతికేళ్ళు. అతడిది అందమైన నొక్కులజుత్తు. తమ్ముడంటే భాస్కరరావుకు చాలా ఇష్టం. అతడు చనిపోయిన రోజునుంచీ నొక్కుల జుత్తువారెవరు కనిపించినా భాస్కరరావుకు తమ్ముడే గుర్తుకు వస్తూంటాడు. అలాంటివారికి అపకారం చేయడం అతడికిష్టముండదు. కానీ ఇప్పుడు తప్పేలా లేదు. తానొక మనిషిని చంపవలసి ఉన్నదనీ త్వరలోనే అతడిని భాస్కరరావు వద్దకు పంపుతాననీ సంతోషరావు భాస్కరరావుకు చెప్పాడు. ప్రతిఫలంగా పదివేలిస్తానని కూడా ఆయన చెప్పాడు. ఇప్పుడు అతనే ఇతనని చీటీ పంపాడు. తానిప్పుడు రాజారావును చంపాలి. అందులోనూ అతడు వెతుక్కుంటూ వచ్చాడు చావడం కోసం.

"ప్రమాదమైనా సరే-అతడిని చంపలేను—" అన్నాడు భాస్కర్రావు.

జమున భర్తకళ్ళలోకి జాలిగా చూసింది. అతడి బాధను తాను అర్ధం చేసుకోగలదు. కానీ రాజారావును చంపకపోవడంవల్ల కలిగే ప్రమాదం ఇంతా అంతా కాదు. భాస్కర్రావు ప్రాణాలకే ప్రమాదం.

సంతోషరావు గురించి జమునకు బాగా తెలుసును. ఆయన పనుపున వచ్చి తను భాస్కర్రావును వలలో వేసుకున్నదామె. ఆమె కారణంగా అతడు సంతోషరావు అనుచరుడు అయ్యాడు.

భాస్కర్రావు దుర్మార్గుడు కాడు. కానీ అతడిలో ఒక మనిషిపట్ల ద్వేషం రగులుకున్నదంటే హత్యలు అవలీలగా చేయగలడు. అతడిలోని బలహీనతను ఎలా కనిపెట్టాడో సంతోషరావు కనిపెట్టాడు. అతడిపై జమునను ప్రయోగించాడు. భాస్కర్రావును రెచ్చగొట్టడం జమున అభ్యసించింది. హత్య చేసేటప్పుడు భాస్కర్రావు చాలా తెలివిగా వ్యవహరిస్తాడు. అతడి బుర్రలో ఎన్నో పథకాలున్నాయి. అవి ఆవేశంలోనే బయటకు వస్తాయి. అతడు చేసే ప్రతి హత్యనూ సంతోషరావు కూడా రహస్యంగా వుంచడానికి శ్రమపడేవాడు.

మూడు నాలుగు హత్యలు చేసి తప్పించుకున్నాక భాస్కర్రావు రాటుదేలాడు. జమున ప్రోద్బలం అవసరం లేకుండానే సంతోషరావు దగ్గర్నుంచి డబ్బు తీసుకుని హత్యలు చేయడం అలవర్చుకున్నాడు.

చాలాకాలం తర్వాత ఇన్నాళ్ళకు భాస్కర్రావు మనసు హత్యలకు వ్యతిరేకంగా పనిచేస్తోంది. అందుకు కారణం రాజారావు నొక్కుల జుత్తు!

"అతడిని చంపకపోతే—మీరు చస్తారు—" అంది జమున.

"సంతోషరావు అంత సులభంగా నన్ను వదులు తుంటాడని అనుకోను—" అన్నాడు భాస్కర్రావు నమ్మకంగా.

"సంతోషరావితణ్ని ఎందుకు చంపించాలనుకున్నాడో ఏమో—అంతా దానిమీద ఆధారపడి ఉంటుంది—" అంది జమున సాలోచనగా.

"మంచి పాయింటే చెప్పావు. అసలు రాజారావేం తప్పుచేశాడో కనుక్కొని వస్తాను. -సంతోషరావుని విషయం కనుక్కొని వస్తాను-" అన్నాడు భాస్కర్రావు. అతడి గొంతులో దృఢ నిశ్చయం ధ్వనిస్తోంది.

"అలా వెళ్ళడాన్ని సంతోషరావు హర్షిస్తా డంటారా?" అంది జమున అనుమానంగా.

"చూడు జమునా! ప్రభుత్వానికి ఉరితీసేవాడొక డుంటాడు. వాడిని హేంగ్‌మన్ అంటారు. ఈ దేశంలో హత్యచేసే అధికారం ఆ హేంగ్‌మన్‌కొక్కడికే వుంది. ఏదో ఒకరోజున నేనూ ఆ హేంగ్‌మన్ వద్దకు వెళ్ళ వలసి ఉంటుంది. సంతోషరావుకోసం అలాంటి నేరాలు చేస్తున్నాను నేను. అతడికి హేంగ్‌మన్‌గా పని చేస్తున్నాను. పనిచేస్తూ ప్రతిఫలం తీసుకుంటున్నాను. అతడికి నేనెందుకు భయపడాలి? నాకూ ఒక మనసుంది. ఆ మనసు గురించి అప్పుడప్పుడైనా ఆయనకూ తెలియాలి కదా! రాజారావును చంపడం నావల్ల ఎందుకవదో ఆయనకు వివరిస్తాను. రాజారావును చంపవలసిన అవసర మేమిటో ఆయన నాకు చెబుతాడు. ఎవరి పాయింటు బలంగా వుంటే వాళ్ళమాట నెగ్గుతుంది!" అన్నాడతను

గంభీరంగా.

"అయితే రాజారావును కొన్నాళ్ళపాటు మనింట్లో ఉంచుకోవాలంటారా?" అంది జమున.

"నేను తిరిగి వచ్చేదాకా అతడు మనింట్లోనే ఉంటాడు. నేనెక్కడికి వెడుతున్నానో, ఎందుకు వెడుతున్నానో, అతడికి తెలియకూడదు—" అన్నాడు భాస్కర్రావు.

"సరే—అతడికిప్పుడే ఈ విషయం చెబుదాం—" అంటూ లేచింది జమున. భార్యాభర్తలిద్దరూ అతడు పడుకుని ఉన్న గదిలోనికి వచ్చారు. అయితే అతడు మెలకువగా లేడు. ఆదమరచి గుండెలపైన చేయివేసుకుని హాయిగా నిద్రపోతున్నాడు. తనను చంపాలా, వద్దా అన్న విషయమై ఒక పెద్ద చర్చ జరిగిన విషయం అతడికి తెలిసివుంటే అతడలా ఆదమరిచి నిద్రపోగలిగేవాడా?

జమున అతడివంక అదోలా చూసింది.

## 3

"ఈ యింట్లో మూడు రోజులుండాలా?" అనుకున్నాడు రాజారావు విసుగ్గా.

ఆ యింట్లో ప్రస్తుతం ఉన్నది ఒకే ఒక్క మనిషి— జమున! ఆమె వయసు నలభైలో ఉంటుంది. చూపులు తనవంక ప్రసన్నంగా ఉండవు. ఇంట్లో పుస్తకాలేమీ లేవు. ఊళ్ళో తిరుగుదామంటే తనకీ ఊరు కొత్త. స్నేహితులెవ్వరూ లేరు. వూళ్ళో చూడ్డానికి విశేషాలు లేవు. ఊరికంటే ఇల్లే బాగుంటుంది. వూరితో పోలిస్తే బాగుంటుందేమో కానీ లేకపోతే ఇల్లూ బాగుండదు.

ఏంచేయాలా అని మధనపడుతున్నాడు రాజారావు. అయితే భాస్కర్రావు వచ్చేవరకూ తానిక్కడ ఉండక

తప్పను. మూడురోజుల్లో తప్పక రాగలనని అతనన్నాడు.

ఊళ్ళో ఒకే ఒక్క సినిమా థియేటరు ఉంది. అందులో మహా దరిద్రపు సినిమా ఆడుతోంది. పోనీ దానికే వెడదామా అని అతడి మనసు ఊగిసలాడు తూండగా జమున అతడివద్దకు వచ్చి—"నేను బయటకు వెడుతున్నాను. రెండు గంటల్లో వచ్చేస్తాను. అంతవరకూ ఇంట్లో వుండగలవా?" అనడిగింది.

తనూ బయటకుపోదామా అనుకున్నాడు రాజారావు. అయితే జమున లేకపోతే యింట్లో బాగానే ఉంటుం దేమోనని అతడికి స్ఫురించింది. జమున లేకుండా ఆ యింట్లో ఉంటే ఎలాగుంటుందో చూడాలని కూడా అతడికి అనిపించింది. అందుకే ఒంటరిగా ఇంట్లో ఉండ డానికి సిద్ధపడ్డాడు.

జమున వెళ్ళిపోయింది. రాజారావు తలుపులు వేసుకుని మంచంమీద పడుకుని భావి జీవితం గురించి ఆలోచి స్తున్నాడు. తిరిగిరాగానే సంతోషరావు తనకు మంచి ఉద్యోగం ఇప్పిస్తానన్నాడు. నెలకు పన్నెండువందలు జీతం. దాంతో తన జాతకమే మారిపోతుంది.

భావి జీవితం గురించి ఆలోచిస్తూంటే గతం కూడా గుర్తొచ్చిందతడికి. భావి జీవితానికి మించి తియ్యగా ఉన్న ఆ గతం గురించి అత డెక్కువగా ఆలోచించే లోగానే వీధి తలుపు తట్టిన చప్పుడయింది.

"అప్పుడే వచ్చేసిందీ?" అనుకున్నాడతను. ఆమెలో ఏం విశేషముందోకానీ ఇంట్లో తనుండగా తనకు మంచి ఆలోచనలు కూడా రావడంలేదు. నిద్రపట్టడమే ఒక పెద్ద విశేషం!

రాజారావు లైటు మాసుకున్నాడు. జమున వెళ్ళి

అరగంట దాటింది-అంతే! అతను విసుక్కుంటూనే వెళ్ళి తలుపులు తీశాడు.

గుమ్మం దగ్గర మెరుపు మెరిసింది.

పదహారేళ్ళ అందమైన యువతి మందహాసం చేస్తూ నిలబడి ఉన్నదక్కడ. ఆమెను చూస్తూనే తెల్లబోయాడు రాజారావు.

"ఎవరు నువ్వు?" అందా యువతి ఆశ్చర్యంగా.

"నా పేరు రాజారావు—" అన్నాడతను.

"ఇప్పటికి పేరుమాత్రం తెలిసింది—" అన్నదామె.

"భాస్కరరావుగారూ ఇలాగే అన్నారు. నువ్వాయనకు దగ్గర బంధువై వుండాలి—" అన్నాడు రాజారావు.

"దగ్గర బంధువేమిటి? ఆయన మా నాన్నగారు—" అందామె.

"బావ్ రే!" అనుకున్నాడు రాజారావు. ఇప్పుడతను తలుపు తీయడంలో తను ఎంత ఆలస్యం చేశానా అని మథనపడిపోతున్నాడు.

"నువ్వెవరో చెప్పలేదు—" అందామె.

రాజారావు క్లుప్తంగా తన గురించి చెప్పి—"నువ్వు నీ పేరు చెప్పలేదు—" అన్నాడు.

"నా పేరు రాధామణి. నాన్నగారి స్నేహితుడొకాయన ఊరికి వెడితే వాళ్ళింట్లో సాయం పడుకుందుకు వెళ్ళాను. నాన్నగారూరికి వెళ్ళారని ఇప్పుడే అమ్మ వచ్చి చెప్పింది. అందుకని ఇంటికి వచ్చాను—" అందామె.

ఇద్దరూ కాసేపు కబుర్లు చెప్పుకున్నారు. జమున వెంటనే రాకపోతే బాగుండునని రాజారావు అనుకున్నాడు. అతడి కోరిక తీరుస్తూ జమున చాలా ఆలస్యం

చేసింది. దాంతో అతడికామెపై ఉన్న దురభిప్రాయా లన్నీ పోయాయి. రాధామణి సమక్షంలో ఎంతసేపైనా సైము తెలియడంలేదు.

ఇద్దరూ చదువుల గురించీ, కాలేజీల గురించీ, సినిమాల గురించీ చర్చలు జరిపారు. చర్చలంటే పెద్ద విశేషమేమీ లేదు. రాధామణి ఏమి చెబితే అది అవుననేవాడు రాజరావు. రాధామణివంటి అందమైన చలాకీ యువతిని కన్న కారణంగా జమున చాలా గొప్ప స్త్రీ అని అతడు భావించదలిచాడు.

ఉదయం పదకొండింటికి ఇల్లు వదిలిన జమున సాయంత్రం నాలుగింటికి తిరిగివచ్చింది. ఆ క్షణంలో రాజారావుకు జమున ఓ అపురూప యువతిగా గోచరించింది.

## 4

"నీకు బాత్తిగా కాలక్షేపం అవుతున్నట్లు లేదు. మీరిద్దరూ పేకాటుకుంటూ కూర్చోండి. నేను వంట చేస్తాను——" అంది జమున.

అప్పటికి సాయంత్రం అయిదయింది. టిఫేను, కాఫీలు పూర్తయ్యాయి. జమున ఈ మాటలనడం రాజారావుకు ఆమెపై మరింత గౌరవాన్ని పెంచింది. ఇద్దరూ పేకాట మొదలెట్టారు.

"నా కంపెనీ నీకు బోరుగా లేదుకదా!" అన్నాడు రాజారావు.

"ఎందుకని?" అంది రాధామణి.

"ఊరికే అడిగాను——" అన్నాడు రాజారావు.

"నా మాట కాదనని వాళ్ళంటే నాకెంతో ఇష్టం. నువ్వు నాకు నచ్చావు...." అంది రాధామణి.

నచ్చావు—అన్నమాట రాజారావు గుండెల్లో వేయి వీణలు పలికించింది—"నచ్చావు అంటావేమిటి? ఇదేమైనా వధూవరుల ఎన్నికనుకున్నావా?" అన్నాడు రాజారావు.

"ఒకవిధంగా అలాంటిదే—" అంది రాధామణి ఏమాత్రమూ సిగ్గుపడకుండా—"నాకు పెళ్ళిచేయాలని మా నాన్న అనుకుంటున్నాడు. ఆయనకు కులమతాల పట్టింపులు లేవు. పెళ్ళాన్ని పోషించుకోగలవాడైతే ఫరవాలేదు. నీకు మంచి ఉద్యోగముంటే నేను నిన్ను పెళ్ళి చేసుకుంటాను—"

ఆ మాటలకు రాజారావు తెల్లబోయినా—"అంతా నీ యిష్టమేనా—నువ్వు నాకు నచ్చొద్దూ—" అన్నాడు.

"ష్" అంటూ రాధామణి తన ముక్కాలు క్రింద పెట్టి "ఇప్పుడన్నమాట మళ్ళీ అను!" అంది.

రాజారావు ఆమె ముక్కాలు చూడకుండా పేక కలిపేసి ఆమెవైపే చూడసాగాడు. ఎలా అనగలిగాడు తనామాట?....నువ్వు నాకు నచ్చొద్దూ అని ఏ మగాడైనా ఆమెని అడగగలడా? అయితే....?

రాజారావు ఎక్కువ ఆలోచించదల్చుకోలేదు. ఆలోచిస్తే అతడి మనసులోకి భావి, గతం ప్రవేశిస్తాయి. రాధామణి ఎదుట వుండగా వర్తమానం గురించి తప్ప అతడాలోచించదల్చుకోలేదు.

"అయామ్ సారీ!" అన్నాడతను.

"అంటే?"

"నువ్వు నాకు నచ్చావు...." అన్నాడు రాజారావు.

"అయితే ఇంకేం?" అని నవ్వింది రాధామణి—"మనం పెళ్ళిచేసుకోవచ్చు. అంతేనా?"

రాధామణితో పెళ్ళి అనగానే రాజారావుకి ఏదోలా

వుంది—"అంతే? రేపే మీ అమ్మగారికి చెబుదాం—" అన్నాడతను.

"రేపా? ఈ రోజు చెప్పకూడదా?" అంది రాధామణి.

"ఎందుకు చెప్పకూడదు?" అన్నాడు రాజారావు.

"ఎందుకు చెప్పకూడదంటే నువ్వు నాకు నచ్చలేదు కాబట్టి!" అంది రాధామణి. అప్పుడతనివైపు చూస్తూ— "అరే అలాగ పోతూ వేమిటి?" అంటూ నవ్వసాగింది.

"ఇప్పుడేగా—నేను నచ్చానని అన్నావు—" అన్నాడు రాజారావు.

"పెళ్ళంటే వంకాయలు కొనుక్కోవడమనుకున్నావా కూడగానే నచ్చిపోవడానికి. నీ గురించి నాకేం తెలుసునని నేను నిన్ను ప్రేమిస్తాననుకున్నావ్? అసలు నువ్వెవరివో, మీ అమ్మా నాన్నా ఎవరో, అసలు నీకు పెళ్ళి అయిపోయిందేమో, నా ఈడు పిల్లలు కూడా వున్నారేమో...."

ఆమె మాటలు మధ్యలో ఆపి—"నా వయసు పాతికేళ్లే! మనిషిని చూస్తే తెలియటంలా—" అన్నాడతను.

"నా వయసు పదహారని నన్ను చూసిన వాళ్ళంతా అంటారు. మా అమ్మా నాన్నా కూడా అలాగే చెబుతారు — అందరికీ. నా వయసు ఇరవై అని నాకు మాత్రమే తెలుసు!" అని మళ్ళీ నవ్వసాగింది రాధామణి.

ఆమె తనను ఆట పట్టిస్తోందని అర్థమయింది రాజారావుకి. అందమైన ఆడపిల్ల ఏంచేసినా స్పోర్టివ్ గా తీసుకోవాలి. కాబట్టి—"నువ్వు నన్నెంత వేళాకోళం చేసినా ఫరవాలేదు అలాగే నవ్వుతూ వుండు—" అన్నా

డతను.

ఈ మంత్రం బాగా పనిచేసింది. అతడి మాటలకు ఆమె సిగ్గుపడింది. అప్పుడే బహుశా ఆమె మనసులో అతడికంటూ ఒక స్థానం ఏర్పడిందనడానికి సూచనగా ఆమె చూపులు మారాయి.

## 5

రాజారావుకి ఆ రాత్రంతా నిద్రపట్టలేదు. అతడి ఆలోచనల్లో ఎక్కువగా రాధామణి తిరిగింది. కలలోకి కూడా వచ్చింది.

మర్నాడతను పెందరాళే లేచిపోయాడు. రోజంతా రాధామణితో కాలక్షేపం చేయాలన్నది అతడి అభిలాష. అయితే ఉదయం కాఫీల సమయందాకా అతడికి రాధామణి దర్శనం కాలేదు. తీరా ఆమె దర్శనమై నపుడు ఆమె పక్కన జమున కూడా వుంది.

"నీ గురించి నాకు బొత్తిగా తెలియదు. కాసిని వివరాలు చెబుతావా?" అంది జమున.

ఆమె అలా ఎందుకడిగిందో రాజారావు ఊహించ గలిగాడు. రాధామణి బహుశా తన గురించి తల్లికి చెప్పి వుంటుంది. పెళ్ళికొడుకుగా తానెంతవరకూ పనికొస్తాడో అంచనా వేయాలని జమున అనుకుంటోంది.

"అమ్మా నాన్నా లేరు నాకు-నేను ఇంటర్మీడియేట్ చదువుతూండగా నాన్న పోయాడు. సంతోషరావు నన్ను ఆదరించాడు. ఆయన నాకు గురువు. దేవుడు. ఆయన మాట నాకు వేదం" అన్నాడు రాజారావు.

"అలాగే!" అంది జమున—"సంతోషరావు నాకూ తెలుసు. ఆయన ఎంత మంచివాడో అంత ప్రమాదకారి. ఆయన సేవ కత్తిమీద సాములాంటిది. నువ్వాయన దగ్గర

ఏ తప్పూ చేయలేదు కదా!"

"అలా అడుగుతున్నారేం?" అన్నాడు రాజారావు.

"నాకు నీ ఆయుష్యు తెలుసుకోవాలని వుంది. సంతోషరావు దగ్గర ఏదైనా తప్పుచేస్తే నీ ఆయువు మూడినట్లే—అందుకని!" అంది జమున.

ఈ ప్రశ్నలోని అంతరార్థం కూడా రాజారావుకు అర్థమైంది. సాధారణంగా కూతుర్నివ్వదల్చుకున్నవాళ్ళు జాతకాలు చూస్తారు. ఈమె తన అసలు జాతకాన్ని తెలుసుకుందుకు ప్రయత్నిస్తోంది. అయితే ఆ విషయం డైరెక్టుగా చెప్పొచ్చుగా? ఈ డొంక తిరుగుడంతా దేనికి? అందుకే అతడు — ఏమీ అర్థంకానివాడిలా—

"ఈ ప్రశ్నకు మీకు జవాబు చెప్పడంవల్ల నాకు కలిగే ప్రయోజనమేమిటి? నిజంగా నాకు ఆయువు మూడితే మీరు రక్షించగలరా?" అనడిగాడు.

"ఏమో — ఎవరు చెప్పగలరు?" అన్యోలా అంది జమున — "అయితే ఒక్క విషయం గుర్తుంచుకో— తప్పుచేసిన ప్రతివాడికీ భగవంతుడో అవకాశమిస్తాడు. అది వుపయోగించుకోవడంలోనే వుంటుంది మనిషి తెలివి!"

"వేదాంతం చెబుతోంది!" అనుకున్నాడతను. ఆమె వెళ్ళినాక ఈ మాటే రాధామణితో అన్నాడు కూడా.

"అది వేదాంతం కాదు. చాలా గొప్ప జీవిత సత్యం. తప్పు మళ్ళీ చెయ్యకూడదు—" అంది రాధామణి.

రాజారావు ఆలోచనలు పరిపరివిధాలపోయాయి. గతం అతడి కళ్ళముందు మెదుల్తోంది. దాన్నుంచి తప్పించుకోవడం అతడికి చాలా కష్టంగా వుంది—"ఈ రోజు మన ప్రోగ్రాం యేమిటి? పేకాట బోరుగా వుంది!"

అన్నాడతను.

"పక్కింటికి వెడదామా?" అంది రాధామణి.

అతడికి వేరే ఎక్కడికీ వెళ్ళడం ఇష్టంలేదు. నిన్నటిలా ఈ రోజు కూడా జమున బయటకు వెడితే — తనూ, రాధామణీ ఒంటరిగా వుంటే ఏమో — యెలాంటి అవకాశం వస్తుందో ఎవరు చెప్పగలరు?—అందుకనే— "వద్దు—" అన్నాడు.

"పక్కింట్లో మంజరి వుంది!" అంది రాధామణి.

రాజారావు ఉలిక్కిపడి-"మంజరి ఎవరు?" అన్నాడు.

"మంజరి నా వయసుదే! కానీ దురదృష్టవంతురాలు. పెళ్ళయిన ఆర్నెల్లకే భర్త పోయాడు...." అంది రాధామణి.

"ఇంకెవరున్నారు పక్కింట్లో?" అన్నాడు రాజారావు.

"ఇంకెవరూ లేరు. అదొక్కర్తే వుంది. వాళ్ళ వాళ్ళంతా తిరుపతి వెళ్ళారు. ఇంకో రెండ్రోజులదాకా రారు. మొగుడుపోయి రెండేళ్ళయింది. దాన్ని బయటకు తిరగనివ్వరు. దాన్ని మగాళ్ళవైపుకి రానివ్వరు. మగాళ్ళతో మాట్లాడనివ్వరు. దానికి మగాళ్ళతో మాట్లాడాలని ఎంతో సరదా — వెడదామంటే మీరు రానంటున్నారు" అంది రాధామణి.

"అయ్యో—పాపం—ఈ కథంతా నాకు తెలియదు కదా! అలాగే వెడదాం—" అన్నాడు రాజారావు. అతడికి మంజరిమీద జాలివేస్తోంది.

జమున ఇంట్లోంచి దొడ్డిగుమ్మందారి వుంది పక్కింటికి. ఆ దారిలో బయల్దేరి వెళ్ళారు రాధామణి, రాజారావు. అతను మంజరిని చూసి అవాక్కయిపోయాడు.

రాధామణికంటె అందంగా, బింకంగా వున్నదామె.

ముగ్గురూ ఓ గదిలోచేరి పేకాట మొదలుపెట్టారు. రెండు నిముషాలైనా ఆడకుండా—"నాకు ఆడాలని లేదు — ఏదైనా పుస్తకమివ్వు. చదువుకుంటాను—" అంటూ లేచింది రాధామణి.

"దీనికి పుస్తకాల పిచ్చి. వాళ్ళింట్లో పుస్తకాలు కొనరు. చదవనివ్వరు. అందుకే ఏదో వంక పెట్టుకుని ఇక్కడకు వస్తుంది...." అంటూ మంజరి లేచి ఓ పెద్ద నవల రాధామణికి అందించింది. రాధామణి నవలా పఠనంలో పడిపోతే మంజరి, రాజారావు పేకాట ఆడుతున్నారు. పేకాటలో మంజరి మరీ చిన్నపిల్లలా గారాం చేస్తోంది. మంచి ముక్క వస్తే అరుస్తోంది. చెడ్డముక్క వస్తే ఏడుపు మొహం పెట్టేస్తోంది.

"అబ్బా — నాకిక్కడైతే పుస్తకం ఎక్కడంలేదు. పక్క గదిలోకి పోతాను—" అంటూ విసుగ్గా పక్క గదిలోకి వెళ్ళిపోయింది రాధామణి.

రాజారావు మనసులో సంతోషించినా ముఖం ఇబ్బందిగా పెట్టాడు.

"ముక్క వేయ్!" అంది మంజరి.

అప్పుడతను ఆమె ముఖంలోకి చూశాడు. మంజరి ఇప్పుడతడివంక చిన్నపిల్లలా చూడడంలేదు. అతను చూస్తూండగా ఆమె పైట జారింది. అతనలా చూస్తూ వుండిపోయాడు. మంజరీ అతడివంక చూస్తోంది. ఆమె చూపులు రాధామణి చూపులకు భిన్నంగా వున్నాయి.

మంజరి ఇంకా పైట వేసుకోలేదు. గుసగుసలాడుతున్నట్లు—"నేను బాగున్నానా?" అనడిగింది.

"ఊఁ" అన్నాడు రాజారావు. అతడి వళ్ళు వేడెక్కింది.

"రాధామణి ఆ నవలయ్యేదాకా ఇక్కడికి రాదు-" ఏదో సందేశం ఇస్తున్నట్లుగా అంది మంజరి.

"ఊఁ" అన్నాడు రాజారావు.

మంజరి పైటవేసుకుని — "ముక్క వేయ్!" అంది. అతను ముక్క వేశాడు. ఏం ముక్క వేశాడో కూడా అతడికి తెలియదు.

"ఫో!" అంది మంజరి ముక్కలన్నీ కిందపడవేస్తూ.

అతడామె ముక్కల్ని చూడలేదు. మళ్ళీ పైట జారితే....

ఆమె పైట జారలేదు. కానీ అతడి ఊహలో పైట జారింది. అంతేకాదు. ఒకటొక్కటిగా ఆమె వంటిమీది బట్టలు తొలగిపోతున్నాయి.

రాజారావు కళ్ళు సులుముకున్నాడు.

మంజరి మామూలుగానే వుంది. కానీ ఆమె చూపులు మామూలుగా లేవు. అతను చటుక్కున చేయిజాపి ఆమె చేయి పట్టుకున్నాడు.

"నేను బాగున్నానా?" అంది మంజరి.

జవాబుగా అతడామెను దగ్గరగా లాక్కున్నాడు. పేకముక్కలు కొన్ని వారి మధ్య నలిగాయి.

మంజరి అతణ్ని విదిలించింది. రాజారావు చప్పబడి పోయాడు.

"ఇష్—అదేం పని?" అంది మంజరి.

"బాగున్నావా అని అడిగావు కదా అని జవాబు చెప్పాను—"

అతడి జవాబు మంజరికి నచ్చింది-"తెలివైనవాడివే-"

అని మెచ్చుకుని — "రాత్రి రాధామణి మా యింటికి వచ్చి నీ గురించి చెప్పింది. నీమీద నా అభిప్రాయం కూడా చెప్పమంది. అది నిన్ను పెళ్ళిచేసుకుందామనుకుంటోంది—" అంది.

"నామీద నీ అభిప్రాయ మేమిటి?" అన్నాడు రాజారావు.

"నాకైతే నిన్నే పెళ్ళి చేసుకోవాలని వుంది—" అంది మంజరి.

రాజారా వాశ్చర్యపడ్డాడు.

"ముఖం చూసి మనిషిని అంచనావేయగలను నేను. మా యింట్లో అందరికీ చాదస్తం. రెండో పెళ్ళికి ఒప్పుకోరు. కానీ నువ్వు ఒప్పుకుంటే నీతో వచ్చేస్తాను."

రాజారావు క్షణం ఆలోచించి — "పెళ్ళికి ముందు నేను నిన్ను బాగా అర్థంచేసుకోవాలి. అందుకు ఇద్దరూ కాసేపు ఏకాంతంగా గడపాలి. ఆ ఏకాంతంలో నువ్వూ నేనూ కలిసి సుఖపడగలమని తోస్తే—జీవితాంతం నీకు దాసుడిగా వుంటాను—" అన్నాడు.

"అందుకే నాకేమీ అభ్యంతరంలేదు—" అంది మంజరి—"అయితే నువ్వు బాగా ఆలోచించుకో. నాతో ఏకాంతంగా గడిపావంటే ఇంక నీకు రాధామణిని పెళ్ళి చేసుకునే అవకాశముండదు. అది మాగాడిలో స్వచ్ఛతను కోరుతుంది—"

రాజారావు ఆలోచించనైనా ఆలోచించలేదు— "నాకు నువ్వే కావాలి!" అన్నాడు.

"బాగా ఆలోచించుకో! రాధామణి కన్నెపిల్ల. నేను ఆర్నెల్లు భర్తతో కాపురంచేసిన విధవరాల్ని. నీతో వివాహం నా అదృష్టమే! కానీ నీ సంగతే నువ్వు

చూసుకోవాలి!"

"నీలాంటి అభాగ్యురాలిని—నాలాటివాడే ముందుకు వచ్చి చేపట్టాలి. అయినా ఈ విషయాలన్నీ మనం ఏకాంతంలో మాట్లాడుకోవాలి!"

"ఏకాంతం వద్దు. రాధామణిని పిలుస్తాను—" అంది మంజరి.

"ఏం?" అన్నాడు రాజారావు.

"ఏకాంతంలో మన ఆలోచనలు తప్పుదార్లు తొక్క వచ్చు. నేను నిన్ను అనుమానించడంలేదు. నేనే నిన్ను ప్రోత్సహిస్తానేమోనని భయం. అందుకని...."

ఆమెను మధ్యలోనే ఆపి—"అయితేనేం? కాబోయే దంపతులం. అందులో ప్రమాదమేమీ లేదుకదా!" అన్నాడు రాజారావు.

"నువ్వు మగవాడివి. ఇప్పుడు నీ ఆలోచనలు సక్రమంగానే వుండివుండవచ్చు. కానీ మన ఏకాంతం తర్వాత నీ ఆలోచనలు మరోకలా మారిపోవచ్చు. అందుకే వివాహం అయేదాకా ప్రతి ఆడదీ మగవాడితో యేకాంతం తప్పించుకోవాలి...."

"నువ్వు నన్ను అనుమానిస్తున్నావు...."

"అందులో అన్యాయంలేదు. నేను నిన్ను మోసం చేసే నీకు జరిగే నష్టం తక్కువ. కానీ నువ్వు నన్ను మోసంచేస్తే నేను ఆత్మహత్య చేసుకోవాలి—" అంది మంజరి.

"ఆత్మహత్యా—ఎందుకు?"

"మగాడు మోసగించాక ఆడదానికి బ్రతకడం కష్టం—" అంది మంజరి. ఆడదానికి శీలం ప్రాముఖ్యత గురించీ—శీలానికి తానిచ్చే ప్రాధాన్యత గురించీ ఆమె

అతడికి చెప్పింది. అది వింటూ రాజారావు కాస్త భయ పడ్డాడు.

అతడు ఆలోచనలో పడడం గమనించి మంజరి నెమ్మదిగా—"నీకు నా మీద జాలి వుందన్నావు కాబట్టి చెబుతున్నాను. రాధామణికంటే నావల్లనే ఎక్కువ సుఖపడతావు నువ్వు. ఒకసారి పెళ్ళయింది కాబట్టి శీలంపట్ల నా ఆలోచనలు కాస్త మారాయి. నేను శీల వతిగా వున్నప్పటికీ మగాడి గురించి కాస్త చూసీచూడ నట్లు వూరుకోగలను. కానీ రాధామణి అలాకాదు. భర్త తనచుట్టూ మాత్రమే తిరగాలని అనుకుంటుంది అది—" అంది.

"ఆడవాళ్ళంతా అలాగే అనుకుంటారు. అది సహజం. కానీ నీ విషయమే నేను నమ్మలేకపోతున్నాను—" అన్నాడు రాజారావు.

"నేను అబద్ధం చెప్పడంలేదు. కానీ ఋజువు చేసు కోవడం ఎలా?"

రాజారావు స్వరం తగ్గించి — "అందుకు మార్గం వుంది. నేను నిన్నే పెళ్ళిచేసుకుంటాను. భర్తను అను మానించని భార్య మగాడికి వరంలాంటిది. అందువల్ల నాకు నువ్వు నచ్చావు. జీవితంలో నేను నీకు రెండో మగవాడిని. అలాగే నువ్వూ నాకు రెండో ఆడదానివి అయితే యిద్దరికీ ఒక రకమైన తృప్తి వుంటుంది. అందుకు నువ్వే సహకరిస్తే నీ మాటలు ఋజువుచేసుకున్నట్లవు తుంది—" అన్నాడు. ఆమె యేం బదిలిస్తుందోనని అతడికి చాలా కుతూహలంగా వుంది.

"ఋజువు చేసుకుంటాను. కానీ ఎలా?" అందామె.

"రాధామణిని ఒక్కసారి.... నాకు...." అన్నాడు

రాజారావు.

మంజరి (భ్రమ) ప్రాన్పడిపోయింది.

# 6

రాధామణి నవల చదవడం పదిన్నరకల్లా అయిపోయింది. అప్పుడు ఆమె, రాజారావు కలిసి మళ్ళీ ఇంటికి వెళ్లారు.

"మంజరిని చూస్తే నీకేమనిపించింది?" అంది రాధామణి.

"జాలి...." అన్నాడు రాజారావు.

"జాలిపడే మగాళ్ళు చాలామంది వుంటారు...." అంది రాధామణి.

"మరింకేం చేయాలి?" అన్నాడు రాజారావు.

"పెళ్ళి!" అంది రాధామణి—"మా అమ్మకు ఎంతకాలం మంజరి గురించే ఆలోచన. సరైన వరుడుంటే బాగుండునని ఆలోచిస్తోంది. అయినా మంజరికేం తక్కువ? ఆమెకు ఒకసారి పెళ్ళయిన విషయం దాచిపెడితే ఇట్టే సంబంధం కుదిరిపోతుంది. అయితే అమ్మకు మోసం చేయడం ఇష్టముండదు. చేసిన మోసం ఈ లోకంలో బయటపడకపోయినా ఆ లోకంలో జవాబు చెప్పకోక తప్పదంటుంది అమ్మ—"

రాజారావు కళ్ళముందు మళ్ళీ గతం మెదిలింది. అతను కలవరపడుతూ—"ఆ లోకం గురించి మనకేం తెలియదు. దాని గురించిన భయం అనవసరం—" అన్నాడు.

"ఇప్పుడీ లోకాల చర్చ ఎందుకు? మంజరికో మంచి వరుణ్ణి సూచించగలవేమో చెప్పు!" అంది రాధామణి.

"నాకెవరూ తెలియదు. ఈ సమస్యకు పరిష్కారం చూపక తప్పదనుకుంటే నేనే ఆమెను పెళ్ళిచేసు

కోవాలి—" అన్నాడు రాజారావు.

రాధామణి వులిక్కిపడి — "నువ్వు మంజరిని పెళ్ళి చేసుకుంటావా?" అనడిగింది.

"నీకోసం ఏమైనా చేస్తాను? నువ్వు చెబితే మంజరినేం కర్మ — దారినిపోయే దానమ్మను కూడా పెళ్ళిచేసుకుంటాను. నీ మనసు తృప్తిగా వుండడమే నాక్కావలసింది—" అన్నాడు రాజారావు.

రాధామణి అప్పటికేమీ మాట్లాడలేదు. భోజనాలైపోయాక ఆమె అతడివద్దకు వచ్చి — "నువ్వు మంజరిని పెళ్ళిచేసుకుందుకు వీల్లేదు—" అంది.

"సరే—" అన్నాడు రాజారావు.

"అసలు నువ్వు మంజరి గురించి ఆలోచించడానికూడా వీల్లేదు—" అంది రాధామణి మళ్ళీ.

"అలాగే!" అన్నాడు రాజారావు.

"అన్నింటికీ సరేనంటున్నావు. నిన్నసలు నమ్మొచ్చా?"

రాజారావు దీనంగా ముఖంపెట్టి—"నువ్వన్నదానికి కాదనలేను. అది నా బలహీనత — యేం చేయను?" అన్నాడు.

"ఇలాంటి బలహీనత వున్నవాడినే నేను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను—" అంది రాధామణి.

రాజారావు మాట్లాడలేదు. ప్రస్తుతం అతడి మనసు మంజరిచుట్టూ పరిభ్రమిస్తున్నది. ఆమె తనకోసం రాధామణిని ఒప్పించగలదా?

మధ్యాహ్నం జమున పెత్తనాలకు వెళ్ళింది. అప్పుడు మంజరి దొడ్డిదారిన ఆ యింటికి వచ్చింది.

రాజారావు వేరే గదిలో వున్నాడు. మంజరి రాధా

మణి గదిలోకి వెళ్ళింది. ఆమెను కబుర్లలో పెట్టింది. యేదో ఆట అంది. రాధామణికి రెండు కాళ్ళూ రెండు చేతులూ కట్టి నోట్లో గుడ్డలు కుక్కింది. రాధామణి స్నేహితురాలిని అనుమానించలేదు. మంజరి అక్కడి నుండి తిన్నగా రాజారావు గదిలోకి వెళ్ళింది.

ఆమెను చూస్తూనే రాజారావు లేచి నిలబడ్డాడు.

"నీకోసం నన్ను నమ్మిన స్నేహితురాలిని మోసం చేశాను. అయినా నాకు బాధగా లేదు. సంతోషంగా వుంది. అవతల గదిలో వుందామె. నిన్ను ప్రతిఘటించలేదు. యేమిచేసినా కేకలు కూడా వేయలేదు. ఆమెకు కాళ్లూ చేతులూ కట్టి నోట్లో గుడ్డలు కుక్కాను. అదంతా ఆట అని ఆమె భావిస్తోంది..." అని మంజరి ఒక్క క్షణం ఆగి—"నీకోసం ఇదంతా చేశాను. అయితే ఒక ఆడదాన్ని ఇలా అనుభవించాలనుకోవడం క్రూరాతి క్రూరం. ఘోరాతిఘోరం. అమానుషం. అందువల్ల నిజాయితీని గుర్తించి నువ్వామెను వదిలిపెడితే సంతోషిస్తాను. నీ శీలం గురించి నాకు బెంగలేదు. నువ్వు దుర్మార్గుడివి కాకూడదన్నది నా కోరిక. ఆపైన నీ యిష్టం—" అంది.

రాజారావు అక్కడ్నించి కదిలాడు. రాధామణి వున్న గదిలో ప్రవేశించాడు. ఆమె అసహాయస్థితి చూశాడు. అతడి శరీరంలో ఉత్సాహం పొంగింది. అతను చటుక్కున గది తలుపులు వేశాడు.

రాధామణి అతడ్ని చూసింది. ఆమె చూపుల్లో భయంలేదు. కానీ అతడు తలుపులు వేయగానే ఆ కళ్ళలో అనుమానం కనబడింది. ఆ తర్వాత అతడామెను సమీపించి తాకాడు. ఆ స్పర్శలో అతడి భావమామెకు

అర్థమైంది. అప్పుడామె కళ్ళల్లో భయం కనిపించింది. అతనామె కళ్ళల్లోకి చూశాడు. భయం అర్థింపుగా మారింది. కానీ అతడి కళ్ళల్లోని రాక్షసత్వం ఆమెకు జరుగబోయేది చెప్పింది. ఆమె కదలడానికి ప్రయత్నించింది.

అతను కాంక్షగా ఆమెను తాకుతున్నాడు. ఆమెకు ఒళ్ళంతా తేళ్ళూ జెర్రులూ పాకినట్లుంది.

అతడామె నోట్లో గుడ్డలు తీస్తూ—"మనం సుఖంగా గడుపుదాం—కేకలు వేయవు కదూ—" అన్నాడు.

అప్పుడు రాధామణి శక్తినంతా కూడగట్టుకుని కవ్వుమని కేక వేయబోయింది. ఆమె అభిప్రాయం తెలిసినవాడిలాగా అతడు చటుక్కున ఆమె నోరుమూసి మళ్ళీ నోటిలో గుడ్డలు కుక్కాడు.

## 7

"అప్పగించిన పని చేశావా?" అన్నాడు సంతోషరావు.

భాస్కర్రావు జేబులోంచి డ్రాఫ్టు కాగితం తీసి సంతోషరావుకి అందించాడు. బదులుగా మాట్లాడలేదు.

"పని చేయలేదన్నమాట — కారణం?" అన్నాడు సంతోషరావు.

"అతడ్ని చూస్తూంటే నాకు నా తమ్ముడు గుర్తొస్తున్నాడు. చంపాలనిపించడంలేదు—" అన్నాడు భాస్కర్రావు దీనంగా.

"ఇంతవరకూ యెప్పుడూ ఇలాగనలేదు నువ్వు?" సంతోషరావులో చిరాకు కనబడింది.

"అవును. అనలేదు. కానీ ఈ రోజు అంటున్నాను. కడిని మీ రెందుకు చంపాలనుకుంటున్నారో చెబితే—

చంపడం యెంతవరకూ సబబో నేను తేల్చుదామనుకుం దామనుకుంటున్నాను—" అన్నాడు భాస్కర్రావు.

"నా నిర్ణయానికి నువ్వు న్యాయాధికారివవుదామనుకుంటున్నావా?" అన్నాడు సంతోషరావు కోపంగా.

"లేదు సార్! ఇంతవరకూ ఎంతోమందిని మీ మాట మీద చంపాను. అయితే ఒక్కడిని కూడా సంస్కరించే అవకాశం ఇవ్వలేదు మీరు నాకు. మనుషుల్ని చంపడమే కాదు—సంస్కరించే తెలివి కూడా నాకు వున్నదని ఋజువు చేసుకోవాలని నాకుంది. రాజారావుని చంపాలని నాకు అనిపించడంలేదు. ఇతడి విషయంలో నాకొక్క అవకాశం ఇప్పించండి —" అన్నాడు భాస్కర్రావు.

"మనుషుల్ని చంపాలనే నిర్ణయం తీసుకోవడం నేను ఎప్పట్నించి ప్రారంభించానో నీకు తెలియదుకదూ?" అన్నాడు సంతోషరావు.

భాస్కర్రావుకు నిజంగానే అది తెలియదు. అయితే సంతోషరావు చేస్తున్నది మంచి పని అని మాత్రం అతడికి తెలుసును.

సంతోషరావు చెప్పడం ప్రారంభించాడు.

* * *

సంతోషరావు తండ్రి ఒక అనాధశరణాలయానికి భూరివిరాళాలిచ్చేవాడు. శరణాలయం ఎంతో చక్కగా నడుపబడుతున్నదని చెప్పుకునే వారు. శరణాలయంలో పెరిగే పిల్లలందరూ చూడటానికి ఎంతో గొప్పగా అందంగా ఉండేవారు. వారిని పెద్దిళ్ళవాళ్ళు తీసుకుని వెళ్ళి పెంచుకోవడం కూడా ఎన్నో పర్యాయా జరిగింది.

అనాథ శరణాలయం వ్యవహారాలన్నీ చూసే మేనేజరు పేరు ముకుందం. ఆయనకు అటు డబ్బూ, ఇటు పలుకుబడీ కూడా బాగా ఉండేది.

సంతోషరావు తండ్రి అనుకోకుండా శరణాలయం గురించి ఒక గొప్ప రహస్యం తెలుసుకున్నాడు. శరణాలయం నిజంగా అనాథశరణాలయం కాదు. దౌర్భాగ్యులకు, దిక్కులేనివారికి అందులో స్థానం లభించడం లేదు. శరణాలయం కోసం ప్రత్యేకంగా పిల్లలు ఎత్తుకుని తీసుకురాబడుతున్నారు. ఆ పిల్లలతో ముకుందం వ్యాపార చేస్తున్నాడు.

చిన్నతనంలోనే అందమైన గొప్పింటి పిల్లలను ఎత్తుకుని వచ్చి శరణాలయంలో ఉంచుతున్నారు. పిల్లల శోభ కారణంగా శరణాలయానికి మంచి పేరు వచ్చేది. అయిదారేళ్ళకే పిల్లలు లేనివాళ్ళు మగపిల్లల్ని తీసుకుని వెళ్ళి దత్తత చేసుకునేవారు. యేడెనిమిదేళ్ళ వయసులోనే ఆడపిల్లలను వేశ్యాగృహాలకు అమ్మడం జరిగేది. శరణాలయంలో పెరిగిన పిల్లల ప్రవర్తన బాగుంటుందన్న పేరు వచ్చింది. పిల్లల్ని పెంచుకోవాలనే వారు సాధారణంగా ఈ శరణాలయానికే రావడం రివాజయింది.

సంతోషరావు తండ్రి ఈ విషయం తెలియగానే ఓ పర్యాయం శరణాలయానికి వెళ్ళి విషయం తెలిసినట్లు బయటపడకుండా ఓ చెకింగు చేశాడు. కొంతమంది పనివాళ్ళను నయానాభయానా అడిగి నిజాలు రాబట్టాడు. తన విరాళాలతో వర్ధిల్లుతున్న శరణాలయం అన్యాయానికి నిలయంగా వుండడం ఆయనకు బాధ కలిగించింది. ఆయన ముకుందాన్ని ఇంటికి పిలిచి సంజాయిషీ అడిగాడు.

విషయం ఆయనదాకా వెళ్ళిందని తెలియగానే ముకుందం వణికిపోయాడు. నోటివెంట మాట రావ డానికే చాలా సేపు పట్టింది.

"తప్పు చేసినపుడు లేని భయం ఇప్పుడెందుకు?" అన్నాడు సంతోషరావు తండ్రి-"అనాధ శరణాలయం స్థాపించినది కొత్తగా అనాథలని సృష్టించమని కాదు. సృష్టిలో అనాథులుగా వున్నవారిని ఆదరించమని!"

ముకుందం ఇంకా వణుకుతూనే వుంటే ఆయన గద్దిస్తూ — "ఈ భయం తప్పుచేసేటప్పుడు లేదా?" అన్నాడు.

"నా భయం అది కాదండి-" అన్నాడు ముకుందం.

"మరేమిటి?"

"మీకు కేశయ్యగారు తెలుసుకదండీ...."

"అవును — ఆయనపోయి నాలుగు నెలలు కావ స్తోంది...."

"రేపు పోతారనగా ఆయన నన్ను పిలిచి ఇలాగే మందలించారండి...." అన్నాడు ముకుందం వినయంగా.

సంతోషరావు తండ్రి భృకుటి ముడతలు పడింది— "నీ మాటలకు అర్థమేమిటి? నన్ను బెదిరిస్తున్నావా?"

ఆ ప్రశ్నకు సూటిగా బదులివ్వకుండా — "ఏడాది క్రితం పోయిన జనార్దనంగారు కూడా పోయే ముందు రోజున నన్నిదే ప్రశ్న వేశారు. ఇదంతా తలుచుకుంటే నాకు భయంగా ఉందండి—" అన్నాడు.

"నీకు ఇంతే తెలుసా? ఇంకా ఏమైనా తెలుసా?" సంతోషరావు తండ్రి గంభీరంగా అడిగాడు.

"ఇంకేమీ తెలియదండి—" అన్నాడు ముకుందం.

"సరే—వెళ్ళు—ఓ వారం రోజుల్లో ఇంకా చాలా

తెలుసుకుందువుగాని—" అన్నాడు సంతోషరావు తండ్రి.

అయితే ఆ రోజు రాత్రే ఆయన చనిపోయాడు.

ముకుందానికీ తండ్రికీ జరిగిన సంభాషణ సంతోషరావు కూడా విన్నాడు. అప్పుడతనికి ఇరవై ఏళ్ళు. జరిగిందతను తల్లికి చెప్పాడు. తొందరపడితే కొడుకు ప్రాణాలకూడా మోసం వస్తుందని భయపడి ముకుందంతో ఈ విషయమై మాట్లాడనని అతడివద్దనుంచి వాగ్దానం తీసుకున్నదామె.

తండ్రి విషప్రయోగంవల్ల చనిపోయాడు. అది హత్య కాదనీ కాకతాళీయమనీ పోలీసులు నిర్ణయించారు. సంతోషరావు మనసు మాత్రం ఉడికిపోతోంది. నిక్షేపంలా వున్న తండ్రిని తనకు కాకుండా చేసిన ఆ దుర్మార్గుల అంతు చూడాలని అతను నిర్ణయించుకున్నాడు. ముకుందం గురించి పూర్తిగా ఆరాలుతీశాడు. అతడు చేస్తున్న ఘోరం గ్రహించాడు. శ్రద్ధగా అతడి కార్యక్రమాలు పరిశీలించాడు. అతడిమీద కలపన్నాడు.

ఒకరోజున ముకుందం మనుషులు హాస్పిటల్నించి పిల్లల్ని ఎత్తుకుని వస్తూ పట్టుబడి — మొత్తం కథనంతా పోలీసులకు తెలియజెప్పారు. ఒక్కసారిగా శరణాలయానికి చెడ్డపేరు వచ్చింది. ముకుందం అరెస్టయ్యాడు. అయితే ముకుందం ఆ మనుషులెవరో తనకు తెలియదనీ ఎవరో శరణాలయాన్ని చూసి కన్నుకుట్టి ఇలా చేస్తున్నారనీ గోలపెట్టాడు. కేసు కోర్టుకెక్కింది.

ముకుందం నిర్దోషి అని ఋజువు కావడమే కాదు, మచ్చలేని శరణాలయం విషయమై ఎందరో అనూయాపరులు బయల్దేరాని కూడా జనం చెప్పుకోసాగారు.

మొత్తం సాక్ష్యాలన్నీ ముకుందానికి అనుకూలంగా మారి పోయాయి.

అప్పుడు గ్రహించాడు సంతోషరావు. ముకుందం ఈ కేసులో నిమిత్తమాత్రుడు. అతన్ని ఆడిస్తున్న అదృశ్య శక్తి వేరే వున్నది.

ఈ అనుమానం వచ్చేక అసలు వ్యక్తి ఎవరో గ్రహించడం కష్టంకాలేదు సంతోషరావుకి. ముకుందాన్ని ఆడిస్తున్న అదృశ్య శక్తి పేరు వీరమల్లయ్య! అతడు చాలా గొప్పవాడు. డబ్బులోనూ, పలుకుబడిలోనూ అతడికి సంతోషరావు ఏ విధంగానూ చాలడు.

ఒక సంవత్సరంపాటు సంతోషరావు పరోక్షంగా చాలా ప్రయత్నాలు చేశాడు. తనూ అదృశ్యంగా వుండి ఆయన్ను బయటపెట్టే తంత్రాలు చాలా చేశాడు. కానీ వీరమల్లయ్య అవలీలగా ఆ ఇబ్బందుల నెదుర్కొన్నాడు.

సంతోషరావుకి ఈ ప్రయత్నాలలో ఒక నిజం తెలిసింది. దోషి ఎవరో ప్రభుత్వానికి, ప్రభుత్వాధికారులకి, పోలీసులకి, ప్రజలకి — అందరికీ తెలుసు. కానీ ఎవరూ పట్టనట్టూరుకుంటున్నారు. అందుక్కారణం అధికారుల అవినీతి, ప్రజల నిర్లిప్తత! అయితే ఆ దోషివల్ల బాధలు పడుతున్నది ప్రజలు మాత్రమే!

అభాగ్యుల కుపయోగపడుతుందనుకున్న అనాథశరణాలయం దారుణాలయంగా మారిపోయి ఎందుకూ పనికి రాకుండా పోవడమేకాక ఎందరో అదృష్టవంతులను దురదృష్టవంతులుగా మార్చుతోంది.

ఇందుకు తానేం చేయాలి?

ఆ సమయంలో సంతోషరావుకు భాస్కర్రావు దొరికాడు. అతడి ప్రవర్తనలో ఆయనకు సమాధానం

దొరికింది.

భాస్కర్రావుచేత సంతోషరావు ద్వారా చంపబడిన మొదటి వ్యక్తి ముకుందం. నాలుగో వ్యక్తి వీరమల్లయ్య!

* * *

"ఇంక రాజారావు సంగతి విను. అతడు పట్నంలో పరువుగా బ్రతుకుతున్న నా కూతురిమీదకే వలవిసిరాడు" అంటూ ప్రారంభించాడు సంతోషరావు.

సంతోషరావు కూతురి పేరు వల్లి. రాజారావామెను బీచిలో కలుసుకున్నాడు. తన ప్రవర్తనతో ఆమె అభిమానం సంపాదించాడు. ఆమెలో కమ్యూనిస్టు భావాలు నాటాడు. అకడి కోసం తండ్రిని కూడా ఎదిరించే స్థాయికి ఆమె మనసును మార్చాడు. ఆమె ఒక శుభ ముహూర్తాన తండ్రికి తమ ప్రేమ గురించి చెప్పింది.

సంతోషరావు వెంటనే రాజారావు గురించి ఆరా తీశాడు.

మంచివాళ్ళకు సాయపడుతూ, చెడ్డవాళ్ళను శిక్షించే ఆయన ఏర్పరచిన గూఢచారి శాఖ చాలా పటిష్టమైనది. వాళ్ళు అతడి జాతకమంతా ఆయనముందు పెట్టటానికి నాలుగురోజుల వ్యవధి సరిపోయింది.

రాజారావుది కాకినాడ. అక్కడ్నించి ఓ అమ్మాయిని లేవదీసుకుని వచ్చి ఆమె మెడలోని నగలన్నీ అమ్ముకుని ఆమెను వేశ్యాగృహానికి అమ్మేశాడు. ఈ వూళ్ళో వల్లితో ప్రేమ ప్రారంభించి ఆమెలో కమ్యూనిస్టు భావాలు నాటుతూనే మరో పేదరాలితో ప్రేమ వ్యవహారం నడుపుతూ ఆమెను లక్షల కధిపతిని చేస్తానని అంటున్నాను. ఇటు వల్లి అటు పేదరాలు కూడా అతడ్ని మనసారా నమ్ముతున్నారు. ఈలోగా మరో

వేశ్యాగృహానికి అతను త్వరలోనే ఓ పిల్లను అమ్మబోతానని వాగ్దానం చేశాడు. బహుశా ఆ పేదరాలినే అమ్మాలని అతడి అభిప్రాయమయుండవచ్చు.

ఈ వివరాలన్నీ తెలుసుకున్నాక సంతోషరావు కూతుర్ని ప్రత్యేకంగా తన గదిలోకి పిలిచి-"రాజారావు విషయమై నీ అభిప్రాయం ఏమిటమ్మా?" అనడిగాడు.

"అ చెప్పుడో మీకు చెప్పాను—" అంది వల్లి.

"అవును—అందుకే అతడి గురించి వాకబు చేశాను."

వల్లి సంతోషరావును మాట్లాడనివ్వలేదు...."నాకు తెలుసు. మనదగ్గర డబ్బుంది కాబట్టి మనకు డబ్బు లేనివాళ్ళెవ్వరూ మనుషులుగా కనబడరు. ఈ పెళ్ళి మీకిష్టం వుండదని ఆ రోజు మీ ముఖం చూడగానే గ్రహించాను. తెలివైనవారు కాబట్టి వెంటనే బయట పడకూడదనుకున్నారు మీరు. అతడి గురించి తెలుసు కోవడం కోసమే వ్యవధి కావాలన్నట్లు ఈ నాలుగు రోజులు ఆగారు. ఇప్పుడతని గురించి ఏం చెప్పబో తున్నారో కూడా నేను చెప్పగలను...."

కూతురంత తీవ్రంగా తిరగబడుతుందని సంతోషరావు ఊహించలేదు. అయితే ఆమె ధోరణి ఆయనకు నచ్చనూ లేదు—"నేనేం చెప్పబోతున్నానో చెప్పగలిగితే నువ్వేం కోరితే అది చేస్తాను" — అన్నాడాయన. కూతురు రాజారావు గురించి తను తెలుసుకున్న నిజం ఊహించ లేదని ఆయన నమ్మకం.

"అతనెక్కడ్నించో ఎవరో పిల్లను లేవదీసుకుని వచ్చి వేశ్యా గృహానికమ్మాడంటారు. ఈ ఊళ్ళోనే మరో అమ్మాయిని ప్రేమిస్తున్నాడంటారు. బుజువుగా ఫోటోలు కూడా చూపిస్తానంటారు. ఆ అమ్మాయిని

కూడా ఏ వేశ్యాగృహానికో అమ్మడానికి బేరం పెట్టాడని కూడా చెప్పగలరు....."

సంతోషరావుకు కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు- "ఇదంతా నీకెలా తెలుసు?"

"జీవితంలో ఎంతో అనుభవం గాచి వడబోసిన రాజారావు ముందే ఇలాంటివన్నీ ఊహించి చెప్పాడు-" అంది వల్లి.

సంతోషరావు ఆశ్చర్యపోతూడు. ముందరి కాళ్ళకు బంధం వేయడమంటే ఇదే? ఇప్పుడు తానిది చెబితే మాత్రం కూతురు నమ్ముతుందా? రాజారావు చాలా తెలివైనవాడు. ఆ తెలివితేటల్ని స్వార్థానికి చక్కగా ఉపయోగించుకుంటున్నాడు.

రాజారావు వల్లికే కాదు — ఎందరో ఆడపిల్లలకు ప్రమాదకరమైన మనిషి. అందుకే ఆయన కూతురు దగ్గర ప్లేటు మార్చి — "నువ్వు పూర్తిగా పొరబడ్డావు. నేను మనస్ఫూర్తిగా నిన్నతడికిచ్చి వివాహం చేయాలనుకుంటున్నాను—" అన్నాడు.

వల్లి ఈ మాట విని ఆశ్చర్యపడింది. రాజారావు తన తండ్రి గురించి తప్పు అంచనా వేశాడని గర్వపడింది.

సంతోషరావు రాజారావును రహస్యంగా పిలిచి— తనకొక ముఖ్యమైన పని చేసిపెట్టాలనీ తిరిగిరాగానే ఉద్యోగం ఇస్తాననీ చెప్పాడు. అతడు బయల్దేరేముందు "నీ గతం గురించి నేను మంచిగా ఊహిస్తున్నాను. అది అబద్ధమైతే మాత్రం నీకు చాలా ప్రమాదం—" అని కూడా హెచ్చరించాడు.

రాజారావు నాయన భాస్కర్రావు దగ్గరకు

పంపాడు.

"ఇప్పుడు చెప్పు—రాజారావు ఉండడం ఈ ప్రపంచానికి మంచిదంటావా?" అన్నాడు సంతోషరావు.

"మీరు తీసుకున్న నిర్ణయం సరైనదే — కాదనను. కానీ అతడివల్ల మీ అమ్మాయికిగానీ వేరే ఇతర ఆడపిల్లలకుగానీ ప్రమాదం రాకుండా చూస్తాను. అతడ్ని పూర్తిగా మార్చుతాను. నాకో అవకాశమిస్తారా?" అనడిగాడు భాస్కర్రావు.

సంతోషరావు తన చేతిలోని డ్రాఫ్టును మడిచి జేబులో పెట్టుకుంటూ — "నీ మాట కాదనలేకపోతున్నాను. కానీ నువ్వు మళ్ళీ ఈ డ్రాఫ్టు కోసం వస్తేనే నేను ఎక్కువ సంతోషిస్తాను—" అన్నాడు.

## 8

భాస్కర్రావు ఆలోచిస్తూనే తలుపు తట్టాడు.

రాజారావు దుష్టుడు. అతడి ఉనికి ప్రపంచానికి ప్రమాదం. కానీ అతడలా ఎందుకు తయారయ్యాడు? అతడు మారడా? అతడ్ని చంపడంకంటె మార్చడంలోనే ఎక్కువ ఆనందం వుంటుందేమో!

నొక్కుల జుత్తు! అదొక్కటే తనను బాగా ఆకర్షిస్తోంది!

తలుపులు తెరుచుకున్నాయి.

ఎదురుగా జమున ఉంది. అతడ్ని చూస్తూనే-"మీరు వచ్చేశారా? మీ కోసమే ఎదురుచూస్తున్నాను ..." అందామె.

"విశేషాలేమిటి?"

"ఆ రాజారావు-పాపం-మనింటికొచ్చిన ఆ చలంగారమ్మాయి రాధామణిని నేను లేకుండా చూసి బలవంతం

చేయబోయాడండీ. సమయానికి మంజరి వచ్చి రక్షించక పోతే ఆ పిల్ల బ్రతుకు అన్యాయమైపోయుండేది?" అంది జమున.

భాస్కర్రావు కళ్ళు ఎర్రబడ్డాయి-"ఎక్కడున్నాడు వాడు?"

జమున మౌనంగా ఓ గదివైపు చూపించింది. ఆ గది తలుపులు బయట గొళ్ళెం పెట్టబడి వున్నాయి. అతడటు నడుస్తూంటే జమున ఆలోచిస్తోంది.

రాధామణిని కన్న కూతురికంటె ఎక్కువగా అభిమానిస్తున్నాడు భర్త. ఆమెకు అన్యాయం తలపెట్టినవాడ్ని క్షమించలేదు భర్త! సంతోషరావు మాట కాదంటే భర్తకు ప్రమాదమని తాను రాధామణి మంజరిలతో నాటకం ఆడింది. రాధామణి కట్లు వదులుగా ఉన్నాయనీ అతడికి మత్తు కలిగించే సిరంజి ఆమె వద్ద సిద్ధంగా వున్నదనీ అతడికి తెలియదు. తన పథకం ప్రకారంకాక అతడు మంచిగా ప్రవర్తించి వుంటే తన ప్రాణాలు రక్షించుకోగలిగి ఉండేవాడేమో? అతడు నిజంగా క్రూరుడు. రాధామణిని క్రూరంగా అనుభవించాలని చూశాడు. సంతోషరావు మంచి పనే చేశాడు.

అయితే భాస్కర్రావు గది గుమ్మంవద్దకు వెళ్ళగానే మనసు బలహీనమైపోయింది. అందమైన రాజారావు నొక్కుల జుత్తు అతడి కళ్ళముందు మెదిలింది. గొళ్ళెం మీద చేయి వేస్తూంటే — "నీ తమ్ముణ్నే నువ్వు చంపుతావా?" అని ఎవరో నిలదీస్తున్నట్లనిపించింది. అతడు గొళ్ళెంతీసి తలుపులు తెరిచాడు.

లోపలవున్న మనిషిని చూసి అతడికు కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు. నున్నటి బోడిగుండుతో వున్న ఆ

మనిషిని రాజారావుగా గుర్తుపట్టడం కూడా అతడికి కష్టమయింది.

"ఏమిటిది?" అన్నమాట అప్రయత్నంగా అతడి నోటివెంట వెలువడింది. అప్పటికి జమున అతడ్ని సమీపించింది.

"రాధామణిని బలవంతం చేసినందుకు- నేను విధించిన శిక్ష అది-" అంది జమున.

"రాధామణిని బలవంతం చేశాడా?" ఆవేశంగా అరిచాడు భాస్కర్రావు. అతడి ఆవేశాన్నాపే నోక్కుల జాతును రాజారావు తన దుష్ప్రవర్తనతో పోగొట్టుకున్నాడు....

మర్నాడు భాస్కర్రావు డ్రాఫ్టు తెచ్చుకోవడం కోసం సంతోషరావు దగ్గరకు ప్రయాణమయ్యాడు.

—:ఐ పో యిం ది:—

# యావజ్జీవశ్రమం

సికిందర్

లాల్ విసుగ్గా గడియారం వంక చూసి, భారంగా నిట్టూరుస్తూ, జాన్ వైపు తిరిగి అన్నాడు. "పార్ట్‌నర్, వస్తానన్న పార్టీ పది నిమిషాలు లేటు. ఆఫీసు కట్టేసి బీటు కెళ్దామా?"

జాన్ వెంటనే అడ్డంగా తలూపాడు. "నో, పార్ట్‌నర్."

"ఎందుకు నో?"

"ఆ పార్టీ వస్తుంది."

"ఏమిటి నమ్మకం?"

"ఆ పార్టీ అవసరం."

"అవసరం నీకు చెప్పలేదే?"

"నేనూహించగలను."

"వెల్, వూహించు."

"ఒక ఆడమనిషి — యువతి అంటాను — తనకు ఎదురైన కష్టాన్ని తన వాళ్ళకి, స్నేహితులకి, ఎవరికీ

చెప్పుకోకుండా—బయటి సహాయాన్ని-మన డిటెక్టివ్ లకి చెప్పుకోవలసి వచ్చిందంటే—అది చాలా పెద్ద సమస్యే అయివుండాలి. ఎవరి పరిష్కారానికి అందని, ఎవరూ తోడ్పడలేని వ్యక్తిగత సమస్య అయివుండాలి."

"ఏమిటది?"

"ప్రతిష్టకు భంగమో, ప్రాణాపాయమో, ఇంకేదో పర్సనల్ భయమో...."

తలుపు దగ్గర అడుగులు విన్పించాయి.

ఇద్దరూ అటువైపు చూశారు.

ఒక పాతికేళ్ళ యువతి లోనికొస్తూ అంది. "క్షమించండి, ఆలస్యమైపోయింది ... నేనెంత త్వరగా రావా లనుకున్నా...."

లాల్ నవ్వాడు మధ్యలో. "నెవర్ మైండ్. కూర్చోండి శశిప్రియ...."

"శశికళ."

"శశికళ. ఓ.కే, కూర్చోండి, శశికళ. మీ కోసమే ఎదురు చూస్తున్నాం. మీరు ఫోన్ లో విషయం ఏమిటో చెప్పలేదు. జాగ్రత్తపడ్డారా?"

"అవును. ఫోన్లు కూడా అడ్డమార్గాల్లో పని చేస్తూంటాయి."

"ఎక్కడ విన్నారు?"

"చదివాను."

"వెల్, మీ ఫోన్ ని ఎవరైనా టాప్ చేసి వుంటే, మీరిక్కడున్నారన్న సంగతి వాళ్ళకిప్పుడు తెలుసని మరువకండి."

"మరువను. అతనిక్కడికి వస్తాడనుకోను. పట్టపగలు ఇలా మీముందు నామీద దాడిచేస్తాడనుకోను."

"అత నెవరు?"

"నా భర్త."

"మీ భర్తా? వెల్, చెప్పండి, చెప్పండి...."

"అతను తాగుబోతు. తిరుగుబోతు. జూదరి. సోమరి. ఓ పనీపాటా లేదు. దమ్మిడీ సంపాదన లేదు. అతన్ని నాన్న నాకు కట్టబెట్టాడు. ఆయనకు ఇల్లరికపుటల్లుడు కావాలి. ఆయనకు నేనొక్కదాన్నే సంతానం. ఆయన కళ్ళముందుండాలి. ఆయన వున్నంతవరకూ ఇతను బాగానే వున్నాడు. ఆయనతో వెళ్ళి వ్యాపారం చూసేవాడు. ఆయన పోయి రెండేళ్ళయింది. అంతే, అతని ఆగడాలకి అంతులేకుండా పోయింది."

"ఏం చేస్తుంటాడు?"

"డబ్బు కోసం వేధిస్తుంటాడు. నాన్న ఆస్తీ, వ్యాపారమూ నా పేరు మీదే వుంచారు. అతనిప్పుడు వ్యాపారం చేయనంటాడు. ఊరికే డబ్బు కావాలంటాడు. ఇల్లూ, ఇంట్లో ఒక మనిషి వున్న సంగతీ పట్టదు. బయట సువాలక్షు వ్యవహారాలు, వ్యసనాలు. డబ్బు నాశనమవుతోంది. నేనివ్వనంటే పోట్లాడతాడు. నన్ను కొడతాడు. అప్పటికీ సాధ్యంగాకపోతే కత్తితో బెదిరిస్తాడు...."

"మీకింకెవరూ లేరా?"

"లేరు. అతనికీ లేరు. అతని ఫ్రెండ్సంతా అతని జాతివాళ్ళే. నా ఫ్రెండ్స్‌కి నా ఇబ్బందులు చెప్పుకోను."

"ఇప్పుడేం జరిగింది?"

"రాత్రి మళ్ళీ కావాలన్నాడు డబ్బు. ఇవ్వనన్నాను. కాసేపు పోట్లాడి వూరుకున్నాడు. తర్వాత నేను

నిద్రలో వుండగా....దగ్గరగా గుప్పున వాసనవేస్తే లేచి కూర్చున్నాను. అతను నామీదికి వంగి కత్తితో....ఓహ్! కొద్దిలో అది నా గుండెకి గుచ్చుకునేదే! అతడెంత క్రూరంగా చూశాడనుకున్నారు!"

"అప్పుడేం చేశారు?"

"అతన్ని నెట్టేసి పారిపోయాను. గది తలుపు లాగేసి బయట గొళ్ళెం పెట్టేశాను. బాగా తాగివున్నాడేమో.. చాలాసేపు ఏదేదో తిడుతూ వుండిపోయాడు. ఉదయం తలుపుతీసి చూస్తే నేలమీద పడుకుని వున్నాడు."

"ఇంట్లో ఇంకెవరూ వుండరా?"

"పనిమనిషి పగలు వచ్చి వెళ్ళిపోతుంది. డిటెక్టివ్ గారూ, మీరితన్నుంచి నన్ను...." ఆగిపోయిందామె చటుక్కున.

వెనుకేదో అలికిడైంది. అందరూ తలుపుకేసిచూశారు.

ఆ మనిషి నవ్వి, "నువ్విక్కడ చేరావా, శశీ?" అన్నాడు.

## 2

ఆమె చటుక్కున లేచి, టేబులు చుట్టూ తిరిగి లాల్ పక్కకు వచ్చింది.

లాల్ సిగరెట్ తాగుతూ ఆ మనిషిని గమనిస్తు న్నాడు.

జాన్ నిదానంగా లేచి నిలబడ్డాడు.

ఆ మనిషికి ముప్ఫై అయిదేళ్ళుంటాయి. లావుగా, బలంగా వున్నాడు. అతని కళ్ళు ఎర్రబడి, జుట్టు చిందర వందరగా వుంది. అతని తెల్లషర్టు, బ్లూ కలర్ ప్యాంట్ మాసి వున్నాయి. కాళ్ళకి మామూలు చెప్పులున్నాయి.

అతను లోపలికొచ్చి చెయ్యి చాపాడు, "వచ్చేంయ్,

శశి."

"రాను."

"మంచిదానివి, వచ్చేయ్, శశి."

"రాను, నేను రాను."

"రావా? నువ్వు రావా? అయితే నేనే వస్తాను..."

అతను టేబులు వెనుకకు వెళ్ళబోయాడు.

లాల్ ఆపాడు. "ఇటు ప్రవేశం లేదు, అక్కడ కూర్చోండి. మీ పేరు?"

"జనార్దన్."

"ఐసీ....ఏం చేస్తుంటారు?"

"తిరుగుతుంటాను."

"ఎగ్జిక్యూటివా?"

"అలాంటిదే!"

"ఇక్కడేం పని?"

"నాకు శశితో పనుంది."

"శశికి మాతో పనుంది. మీరు వెళ్ళి బయట కూర్చోండి."

"శశితో అర్జంటు పనుంది...."

"ఏమిటా పని?"

అతను జేబులోంచి రుమాలు తీశాడు. అందులో చుట్టివున్న కత్తితీసి చూపిస్తూ, "పొడుస్తాను" అన్నాడు.

"ఎందుకూ?" లాల్ దీర్ఘం తీశాడు.

"పొడిచి చంపుతాను."

"అదే, ఎందుకూ?"

అతను పక్పికిలించి, "సరదాకి!" అన్నాడు.

"సరదాకి భార్యని చంపుతారా?"

"నా భార్యని నేనెందుకైనా చంపుకుంటాను."

"చంపే హక్కు నీకు లేదు. ప్రేమించే హక్కు మాత్రమే వుంది."

"ప్రేమించే వాడికి ఏదైనా చేసుకునే హక్కుంది."

"మీరు ప్రేమిస్తారా?"

"అడగండి శశికి. చెప్పు శశి."

"నువ్వంటే అసహ్యం!"

"చూశారా, మీరంటే అసహ్యం."

"కాదు. మీ ముందు చులకనవుతానని అలా అంటోంది. నాతో ఎన్నిసార్లు చెప్పలేదు ప్రేమిస్తున్నానని? ఎన్నిసార్లు మెచ్చుకోలేదు నా ప్రేమ గొప్పదని?"

"అప్పుడు నీకు భయపడి అనేదాన్ని."

"ఇప్పుడీ పత్తేదార్ల అండ దొరికిందా?"

"మిస్టర్ జనార్ధన్, మీరు తక్షణం బయటకు నడవండి!"

"ఎందుకు నడవాలి?"

"ఐ హేట్ యువర్ బిహేవియర్."

"అయితే నా పని పూర్తిచేసుకుని పోతాను."

"నేనిప్పుడే పోలీసుల్ని పిలుస్తాను!"

అతను కత్తి టేబులుమీద పడేశాడు — "ముట్టుకోకండి" అన్నాడు. కుర్చీలో కూర్చున్నాడు—"పిలవండి పోలీసుల్ని" అన్నాడు.

జాన్ ఫోన్ ఎత్తి గబగబా డయల్ చేయసాగాడు.

శశికి చెమటలు పడుతున్నాయి. ఆమె భయం భయంగా చూస్తోంది.

లాల్ సిగరెట్ తాగుతూ అతన్ని పరిశీలిస్తున్నాడు.

అతను ధీమాగా కూర్చుని అందరి చర్యలు గమనిస్తున్నాడు.

పావుగంట నిశ్శబ్దంగా గడిచింది. అప్పుడొచ్చాడు ఇన్స్పెక్టర్ బాలకృష్ణన్. అతని వెనుక సార్జెంట్, ముగ్గురు కానిస్టేబుల్స్ వున్నారు.

కృష్ణన్ దగ్గరకొచ్చి, "వాట్ హేపెండ్?" అన్నాడు.

లాల్ అన్నాడు. "ఇతను భార్యమీద హత్యా ప్రయత్నం చేస్తున్నాడు, ఇన్స్పెక్టర్. ఇతని సాడిస్టిక్ ప్లెజర్ కాస్త తీర్చండి...."

కృష్ణన్ టేబులుమీద కత్తి అందుకుని, ఆ మనిషిని ఎగాదిగా చూశాడు.

"మిస్టర్, యూ ఆర్ అండర్ అరెస్టు!"

కృష్ణన్ ఒక్కటే మాటన్నాడు.

ఆ మనిషి లేచి నిల్చున్నాడు. "అలాగే, ఇన్స్పెక్టర్. నన్ను అరెస్టు చెయ్యండి. జైల్లో పెట్టండి. శశిని చంపే సరయిన ఉద్రేకం, ఆవేశం రావడంలేదు నాకిప్పుడు. కొన్నాళ్లు జైల్లో కటకటాలు లెక్కెడుతూ పళ్ళు నూరడం నేర్చుకుంటాను. కారాలు మిరియాలు నూరుతాను. నరాలు పొంగించుకుంటాను. అప్పుడు శశి మీద పగ ద్వేషం బాగా రగిలిపోతాయి. అలా రగిలి నాకు కళ్ళు మండిందంటే, ప్రపంచంలో ఏ శక్తీ నన్నాపలేదు! వస్తాను, శశీ! పదండి, ఇన్స్పెక్టర్—"

అతనే వాళ్ళని తీసుకుని బయిల్దేరాడు.

## 3

లాల్ అన్నాడు నిదానంగా డ్రైవ్ చేస్తూ, "ఇప్పుడేం చేస్తారు? అతన్ని జైలుకి పంపడం మీకిష్టమేనా?"

ఆమె తేరుకుని చూసింది. కారు ట్రాఫిక్‌లో కలిసి నిశ్శబ్దంగా సాగిపోతోంది.

"నేననుకో లేదు.... ఇలా జరుగుతుందనుకోలేదు" అంటూ ఆమె ఆందోళనగా.

"అనుకోకుండా జరిగేవే ఇరకాటంలో పెడతాయి... మీరిప్పుడేం చేస్తారు? అతను జైల్లో వుంటే అతడన్నట్లే పగ పెరుగుతుంది. విడుదలై వస్తే మీకు ప్రమాదం హెచ్చుతుంది."

"అతన్ని రాకుండా చెయ్యండి!"

"హత్యాప్రయత్నానికి యావజ్జీవ శిక్షేమీ పడదు."

"ఇంకేదైనా చెయ్యండి! అతను తిరిగిరాకుండా చూడండి!"

"సాధ్యంకాదు. చట్టపరంగా అటువంటి అవకాశం లేదు, మీరు విడాకులిస్తే తప్ప. అప్పటికీ మీ దగ్గరికి రాకుండా ఆపలేం."

"డిటెక్టివ్ గారూ, మిమ్మల్నే నమ్ముకున్నాను. మీరే పోలీసుల్ని పిల్చారు. మీరే అతన్ని అరెస్టు చేయించారు. ఇప్పుడే మీరే నన్ను కాపాడాలి!"

"వెల్, ఒక్కటే దారివుంది" లాల్ భుజాలెగరేశాడు.

"ఏమిటది?"

"అతను బెదురుతాడని నేను పోలీసుల్ని పిలుస్తానన్నాను. బెదరలేదు. పోలీసులొచ్చారు. అప్పటికీ గొడవ చెయ్యకుండా వాళ్ళతో వెళ్ళిపోయాడు. అప్పుడు మీమీద క్రోధం ప్రదర్శించాడా? నిప్పులు కురిపించాడా? ఆవేశం కావాలిట మిమ్మల్ని చంపడానికి! అది జైల్లో ఛార్జ్ చేసుకుని వస్తాడట — బ్యాటరీ ఛార్జింగ్ లా! కాబట్టి అంతవరకూ వెళ్ళకముందే, ఇప్పుడే ఈ క్షణంలోనే, వెళ్ళి మీరు క్షమాపణ చెప్పుకుని విడిపించుకు

రండి."

"వచ్చి—?"

"అతనితో మంచిగా వుండండి. మార్చడానికి ప్రయత్నించండి. భర్తలిలాగే వేషాలేస్తుంటారు. భార్యలు సహనంతో మెలగాలి."

"అది అసంభవం! అతని స్వభావం మారదు! అప్పుడు నేనింకా లోకువవుతాను!"

"అయితే ఏం చేస్తారు?"

"అది మీరే ఆలోచించండి? మీరే నన్నిరికించారు!"

"వెల్, గట్టెక్కితే చప్పట్లు. లేకపోతే చివాట్లు—అంతే కదూ?"

ఆమె మాట్లాడలేదు.

లాల్ అన్నాడు మళ్ళీ, "ఇన్స్పెక్టర్ ఫోన్ చేసి పిలిస్తే మీరు వెళ్ళి స్టేట్‌మెంట్ ఇస్తారా?"

"ఇచ్చి—"

"అతన్ని మాయించండి."

"అప్పుడు—?"

"విడాకులు కోరండి. మీమీద ఈ హత్యా ప్రయత్నం మంచి ప్రూఫ్. అతని క్యారెక్టర్ కూడా కోర్టు ముందుంచండి. జడ్జి సానుభూతి మీకుంటుంది. సులభంగా విడాకులు మంజూరవుతాయి. ఆస్తిని కలిగి వున్న భార్యకు ఇలాటి భర్తనుంచి ఎప్పటికైనా అపాయమే...."

"అప్పుడేం చేయమంటారు?"

"అప్పటివరకూ కాదు—ఈలోపే ఇక్కడ మీరంతా డిస్పోజ్ చేసేసి డబ్బుతో వెళ్ళి ఎక్కడన్నా స్థిర పడండి. అతను జైలునుంచి ఛార్జి అయి వచ్చేటప్పటికి

మీ యింటి గోడలే కన్పిస్తాయి. వాటికి థపా థపా తల బాదుకుని, అంబోతులా కుమ్మి, కూల్చేసి వెళ్ళిపోతాడు."

లాల్ కారాపాడు. ఆమె దిగివెళ్ళి గేటుతీసింది. లాల్ కూడా దిగి ఆమెతో లోపలికెళ్ళాడు. ఆమె గబగబా ఇంట్లోకి దారితీసింది. డ్రాయింగ్ రూంలో పనిమనిషి ఎదురైంది. ఆమెను కాఫీలకు పురమాయించింది.

లాల్ అన్నాడు కూర్చుంటూ. "కాఫీ వద్దు, ఏమీ వద్దు. మీరలా కూర్చుని అంతా చకచకా చెప్పండి."

"ఏం చెప్పాలి?"

"మీ బిజినెస్ గురించి. ఇప్పుడెవరు చూస్తున్నారు? ఏం బిజినెస్ అది?"

"నాన్న పోయాక ఇతను పట్టించుకోకపోతే—మా నాన్న స్నేహితుల్లో ఒకాయన-ఆయనా బట్టలవ్యాపారే-మా షాపులో పెట్టుబడి పెట్టి నన్ను పార్ట్‌నర్‌గా చేసుకుని, తనే షాపు నడుపుతానని ముందుకొచ్చాడు."

"అప్పుడు—?"

"నేనాలోచించి సరేనన్నాను. ఈ రెండేళ్ళలో బాగానే లాభాలొచ్చాయి. అప్పుడు మా వాటా రెండున్నర లక్షలుండేది. ఇప్పుడది మూడుంపాతిక అయింది. అతనికి మూడున్నర. నాకు షాపు వ్యవహారాలతో సంబంధంలేదు. అంతా ఆయనే చూసుకుంటున్నాడు. చాలా నమ్మకస్తుడు. నెలా నెలా నాకు ఖర్చులకు రెండువేలు ఇస్తున్నాడు."

"అతని పేరు?"

"కాంతారావు."

"అతనికి మీ భర్త సంగతి తెలుసా?"

"తెలుసు. కానీ దూరంగా వుంటాడు. జాగ్రత్త మనిషి. ఇతరుల గొడవలు పట్టించుకోడు. చాలా భయసుడు."

"వెల్, వ్యాపారసులు భయసులుగానే వుంటారు. మీ భర్త ఫ్రెండ్స్ ఎవరైనా ఇక్కడకొస్తుంటారా?"

"రారు. కానీ వాళ్ళెవరో ఎక్కడుంటారో నాకు తెలుసు?"

"మీరు మా ఆఫీసుకొచ్చినట్లు మీ భర్తకెలా తెలిసింది?"

"వెంటాడినట్లున్నాడు. నేను ఫోన్ చేసినప్పుడు ఇంట్లోనే వున్నాడు. ఆ తర్వాత బయటికెళ్ళాడు. అతని వెనుక నేను వెళ్ళాను. ఫోన్‌లో మాటలు విని నా వెనుక వచ్చి వుంటాడు. డిటెక్టివ్ గారూ...."

"యస్?"

"పరిసితి ఇలా పోలీసుల వరకూ వెళుతుందనుకోలేదు. ఈ విడాకులూ, ఆస్తి అమ్ముకుని పలాయనమూ.... ఇదంతా నాకవమానకరంగా వుంది!"

"వెళ్ళి క్షమాపణ చెప్పుకుని తీసుకురండి."

"ఊహుం—లోకువవుతాను."

"మరి ఏం చేస్తారు? మీ ఆలోచనేమిటో చెప్పరేమిటి?"

"అతనితో నేను విసిగిపోయాను. అతని అవసరం నాకు లేదు. మగవాడి అండలేకుండా బ్రతగ్గలను. అతను కొన్నాళ్ళు జైల్లోనే వుండి...."

"జైల్లోనే వుండి—?"

"విడుదలై వస్తున్నప్పుడు ఏదైనా యాక్సిడెంట్ జరిగితే ఎంత బాగుంటుంది...."

లాల్ తలెత్తి ఆమె ముఖంలోకి చూశాడు కొన్ని క్షణాలు.

"చేయి సే ఎంత బాగుంటుందనండి!" అన్నాడతను.

"అదే, అదే, అదెలా జరుగుతుంది? చెప్పండి, మీరు అనుభవజ్ఞులు."

"నా ఫీజు?"

"మీరు కోరినంత!"

"ఎప్పుడు కోరమంటారు?"

"మీ ఇష్టం. ఇప్పుడే నా కోరవచ్చు...."

"పనయ్యాక కోరుతాను. అప్పుడెంతడిగినా మీరిచ్చు కోవాలి."

"అలాగే, ఇచ్చుకుంటాను. ఇది మనిద్దరిమధ్య రహస్యం. ఎవరికీ చెప్పకూడదు సుమా! ఆ పని మీ రొక్కరే చెయ్యాలి.... సరేనా?"

"చూడండి, మిసెస్ శశికళ...."

"ఏమిటి డిటెక్టివ్ గారూ?"

"మీరు నాతో పదండి!"

"ఎక్కడికి?"

"ఎర్రగడ్డ హాస్పిటల్ కి. మిమ్మల్ని అక్కడ చేర్పిస్తాను."

"ఏమిటీ!"

"మీ భర్తకు జైలు ప్రాప్తిస్తే, మీకు పిచ్చాసుపత్రి."

ఆమె ఉలిక్కి-పడి చూసింది. ఆమె ముఖం కోపంతో, అవమానంతో ఎర్రనయింది.

లాల్ సిగరెట్ తాగుతూ ఆమెనే చూస్తున్నాడు. కొన్ని క్షణాల తర్వాత ఫోన్ మోగింది. ఆమె కదల్లేదు.

అదే కోపంతో చూస్తోంది.

"ఇన్స్పెక్టరయి వుంటాడు, మీ కోసం" లాల్ అన్నాడు.

అయినా ఆమె పలకలేదు. లేవలేదు.

లాల్ లేచివెళ్ళి రిసీవరెత్తాడు.

"హలో కృష్ణన్, మీరు——"

అతను ఆగిపోయి ఫోన్ని తిప్పి తిప్పి చూశాడు. భుజాలెగరేసి, దాన్ని పెట్టేసి వెనక్కి తిరిగాడు.

"రాంగ్ నెంబర్ అయుంటుంది. అయినా సారీ చెప్పుకోవాలిగా? అతడెవరో మాట్లాడకుండా పెట్టేశాడు."

ఆమె తేరుకుని కంగారుపడి చూసింది.

లాల్ దగ్గరకి వెళ్ళి అడిగాడు, "మీ బాయ్ ఫ్రెండ్ కావచ్చా?"

"నోరు ముయ్యండి!"

"ఓ.హ్, మీకు ఆటంకంగా వున్నానేమో...."

"నోరు ముయ్యండి ముందు! బైటకు నడవండి వెంటనే!"

"ఓహ్, తీరిందా నా అవసరం?"

"దయచేసి మీరు వెళ్ళిపోతారా?"

"ఆల్ రైట్! మనసులో భావాలుంటే వాటిని పారేసుకునే పద్ధతి ఒకటుంటుంది. మీ మనసులో...."

మళ్ళీ మోగింది ఫోన్.

ఇద్దరూ ఒకర్నొకరు చూసుకున్నారు.

"వెల్, ఈసారి మీ బాయ్ ఫ్రెండ్ కాదను కుంటాను."

"నోరు ముయ్యండి!"

"ఎందుకంటే నేనింకా ఇక్కడే వుంటానని అతనికి తెలుసు...." అంటూ ఫోన్ దగ్గరకి వెళ్ళాడు, "ఇన్స్పెక్టర్ కావచ్చు ఈసారి."

రిసీవరెత్తి నిశ్శబ్దంగా వుండిపోయాడు.

"హాలో, లాల్?" అంది అవతలి గొంతు.

లాల్ ఉలిక్కిపడ్డాడు. "యస్, జాన్?"

"జనార్ధన్ తప్పించుకున్నాడు."

"ఏమిటీ!"

"జనార్ధన్ తప్పించుకున్నాడు."

"ఎలా — ఎలా సంభవమది?" లాల్ అరిచాడు ఆందోళనగా.

## 4

ఆమె భయం భయంగా చూసింది. లేచి దగ్గరకొచ్చి ఆదుర్దాగా అడిగింది. "ఎలా తప్పించుకున్నాడట?"

లాల్ సిగరెట్ వెల్గించుకుని ఆమెవైపు చూశాడు. పొగ పైకి వూదుతూ అన్నాడు. "హెడ్ క్వార్టర్స్‌లో దీపు దిగుతున్నారట, చాకచక్యంగా దూకి పారి పోయాడు. కొంతదూరంలోనే కానరాకుండా పోయాడట....ఏ సందులోకి — ఏ మార్గంగుండా వెళ్ళాడో తెలియదు."

"ఓహ్, ఎంత సేపయింది?"

"పావుగంటయింది. భయపడకండి. ఇక్కడికొస్తాడనుకోను. తన కోసం ఇక్కడ పోలీసులుంటారని వూహిస్తాడు."

"అయితే ఇందాక ఫోన్ చేసింది...."

"మీ బాయ్ ఫ్రెండ్ కాదా?"

"నోరు ముయ్యండి! మా వారే కావచ్చు. తప్పించుకున్నాక నాకు ఫోన్ చేశాడు."

"బాగుంది. ఎందుకు ఫోన్ చేస్తాడు? మీ బాయ్ ఫ్రెండే మిమ్మల్ని హెచ్చరించడానికి చేసి వుంటాడు."

"డిటెక్టివ్ లాల్, మీరా బాయ్ ఫ్రెండ్ ఆలోచన మానెయ్యండి. మీరే ఆధారంతో అలా అనుకుంటున్నారు?"

"ఆల్ రైట్, ప్రస్తుతానికి మానుకుంటాను. మీరిప్పుడేం చేస్తారు? అతను మీ కోసం తిరుగుతున్నాడు. మీకిప్పుడే ప్రమాదం ఏర్పడింది. ఈ పరిస్థితిలో అతనికి యాక్సిడెంట్ జరిగేలా మీరు చూడలేరు. ఎందుకంటే అతనెక్కడున్నాడో మీకు తెలియదు కాబట్టి కంటబడేవరకూ. మీరతని కంటబడ్డారంటే మీ చావే అతని చేతిలో జరుగుతుంది."

"ఓహ్...అప్పుడు నే నేదో పరధ్యానంలో అన్నాను. అతన్ని చంపించే ఆలోచన....ఓహ్, నాకెందుకుంటుంది చెప్పండి?"

"పరిస్థితులతో పాటు అభిప్రాయాలు మారుతాయి. అతను వెంటనే ఇక్కడికి రాకపోయినా ఏ స్నేహితుల దగ్గరో తలదాచుకొని, అవకాశం కోసం చూస్తుంటాడు. కమాన్, ఆ స్నేహితుల పేర్లూ అడ్రసులూ రాసివ్వండి త్వరత్వరగా!"

ఆమె గాభరాగా వ్రాయసాగింది. లాల్ ఆమెను గమనిస్తూ ఆలోచనల్లో పడ్డాడు. అంతలో పనిమనిషి ఉరికి వచ్చింది కంగారుగా.

"ఏమిటి?" అన్నాడు లాల్.

"ఎవరో బాబుగారూ, ఈ రాయి విసిరారు?"

అందామె, కాగితంలో చుట్టివున్న రాయిని చూపిస్తూ.

లాల్ ఆ కాగితం లాక్కున్నాడు. "ఎలా విసిరారు?"

"ఇప్పుడే ఇలా ఎడమవైపుగా ఆటో వెళ్ళింది, బాబుగారూ! అందులోంచి ఎవరో విసిరారు—"

శశి చటుక్కున తలెత్తి లాల్ వంక చూసింది. లాల్ చదివి ఆ కాగితం ఆమెకిచ్చాడు. ఆమె ఆత్రుతగా చదివింది. అందులో ఇలావుంది.

"శశి—నువ్వొద్దు, నీ ఆస్తీ వద్దు. నలభై వేలు కావాలి. రాత్రి పదిగంటలకి జి. పి. ఓ. ఎడమవైపు చెత్తకుండీలో పొట్లంకట్టివేసి వెళ్ళిపో! ఇది నా ఆఖరి కోరిక. తీరిస్తే బ్రతికిపోతావు. లేకపోతే.... చచ్చిపోతావ్!

జ్ఞాపకముంచుకో!

—నీ పగబట్టిన భర్త."

లాల్ ఆమె చెయ్యిపట్టి "కమాన్, రండి!" అంటూ బయటకు పరుగెత్తాడు—

ఇద్దరూ బయటకొచ్చి కారెక్కారు. లాల్, స్టార్టు చేసి దూకించాడు. అలాగే ఎడమవైపు వేగంగాపోనిచ్చి, వీధి చివర ఆపేసి, అక్కడ నిలబడున్న ఓ పదెనిమిదేళ్ళ కుర్రాడ్ని చూశాడు. అతన్ని దగ్గరికి పిల్చి అడిగాడు, "ఇప్పుడే ఇటువైపు ఓ ఆటో వెళ్ళడం చూశావా?"

"చూశాను, సార్."

"ఎటు వెళ్ళింది?"

"రోడ్డెక్కి ఎడమవైపు - అంటే రాయల్ హోటల్ వైపు, సార్."

లాల్ స్టార్టుచేశాడు. కారుని పోనిస్తూ యధాలా

పంగా డ్రైవింగ్ మిర్రర్‌లో చూశాడు. అతని ముఖం ఎర్రబడింది. వెనుక ఆ కుర్రాడు ఇటువైపే చూస్తూ నవ్వుతూండడం కంటపడింది. లాల్ వెంటనే కారాపేసి దిగాడు. అది చూసి ఆ కుర్రాడు అదిరిపడి ఇంట్లో దూరిశాడు. లాల్ తరుముకెళ్ళి ఇంట్లోంచి అతన్ని లాక్కొచ్చాడు.

"నిజం చెప్పు, ఎందుకు నవ్వేవు? అబద్ధం చెప్పావు కదూ?"

"నిజమే చెప్పాను, సార్!"

లాల్ కాలరు పుచ్చుకున్నాడు. "ఫూల్! టైం వేస్టు చెయ్యకు. నీకతను డబ్బిచ్చాడు. అతడా యింట్లో రాయి విసురుతూండగా నువ్వు చూశావు. అతను నీకు డబ్బిచ్చి తప్పుదారి చెప్పమన్నాడు, అవునా?"

అతను బిత్తర చూపులు చూశాడు.

లాల్ అతని జేబులు వెతికి పదిరూపాయల నోటు తీశాడు.

"చెప్పు, ఇదెక్కడిది? ఎందుకిలా నలిగింది? చెప్పకపోతే లాక్కెళ్తాను పోలీస్ స్టేషన్‌కి!"

"సార్, అతను కుడివైపు వెళ్ళాడు — డింపుల్ థియేటర్ వైపు."

"గుడ్. ఆటో నెంబర్ చూశావా?"

"లేదు, సార్. నిజం చెప్తున్నాను, సార్."

"నీ పేరు?"

"నాగేష్, సార్. పదో తరగతి మరోసారి చదువుతున్నాను, సార్."

లాల్ అతన్ని వదిలేశాడు. "చదువుకో, పదోతరగతి ఒక్క సంవత్సరమే చదవాలి. తెలిసిందా? ఈ నోటు

తీసుకుని వెళ్ళిపో!"

లాల్ తిరిగివచ్చి కారెక్కాడు.

"ఏం జరిగింది?" అడిగింది శశి ఆందోళనగా.

లాల్ చెప్పకుండా కారు స్టార్టుచేసి పోనిచ్చాడు. శరవేగంతో పోనిచ్చి డింపుల్ థియేటర్ దగ్గరాపి, దిగివెళ్ళి అక్కడున్న ఆటోలని సమీపించాడు.

అక్కడ అయిదు ఆటోలున్నాయి. డ్రైవర్లందరూ ఆటోల్లోనే కూర్చుని వున్నారు. లాల్ ఒక్కో ఆటోనీ లోపలికి వంగి, బానెట్స్ ముట్టుకుని చూడసాగాడు. డ్రైవర్లంతా విచిత్రంగా చూడసాగారు.

"ఏమిటి సార్, ఏం కావాలి?"

లాల్ అన్నాడు అందులో ముగ్గుర్ని ఉద్దేశించి "మీ ముగ్గురి ఇంజన్లు వేడిగా వున్నాయి. ఇప్పుడే వచ్చి హాల్ట్ చేశారు. మీమీ ప్యాసింజర్లెవరు?"

"ఎందుకు సార్, మీ రెవరు?"

"పోలీస్! ఒక నేరస్థుడు తప్పించుకున్నాడు."

వాళ్ళంతా గబగబా చెప్పారు.

"నా బండిలో ఇద్దరు భార్యాభర్తలు వచ్చారు సార్, థియేటర్‌లోకి వెళ్ళారు."

"నా ఆటోలో ఇద్దరాడవాళ్ళు వచ్చారు సార్, థియేటర్‌లోకే వెళ్ళారు."

"నా ఆటోలో కూడా భార్యాభర్తలే వచ్చారు, సార్."

"మీరెంత సేపయింది వచ్చి?" అన్నాడు లాల్.

"మేమంతా ఒకే నిమిషంలో వచ్చాం సార్, పది నిమిషాల క్రితం."

"అప్పుడు ఇంకేదైనా ఆటో వచ్చి వెళ్ళడం

చూశారా?"

"లేదు సార్, మరో ఆటో ఏదీ రాలేదు."

"మీ ఆటోల్లో దిగిన మనుషులు కరక్టేనా?"

"కరక్టే సార్."

"మీ లాగ్ బుక్స్ తియ్యండి, పేర్లు కూడా చెప్పండి."

"ఎందుకు సార్, ఎందుకు?"

"తర్వాత మీ అవసరం రావచ్చు" లాల్ ఆ వివరాలు వ్రాసుకుని థియేటర్‌లోకి వెళ్ళాడు. బుకింగ్స్ దగ్గర విచారించి, లోపలికెళ్ళి ఫోన్ చేసి తిరిగివచ్చి కారెక్కాడు.

ఆమె ఇంకా ఆందోళనగా చూసింది.

లాల్ అన్నాడు స్టార్టుచేస్తూ "అతనిక్కడికిరాలేదు. ఇక్కడ దిగలేదు. థియేటర్‌లోకీ వెళ్ళలేదు. అతన్నిప్పుడు ట్రేస్ చెయ్యడం కష్టం. జాన్‌కు ఫోన్ చేశాను. అతని ఫ్రెండ్స్ అడ్రసులిచ్చి కృష్ణన్‌కి చెప్పమన్నాను. పోలీసులు వెళ్తారు. అతన్ని పట్టుకునే ప్రయత్నాలు వాళ్ళు చేస్తారు. మనమిప్పుడు ఏం చెయ్యాలో ఆలోచించాలి...."

ఆమె మౌనంగా వుంది.

లాల్ అన్నాడు మళ్ళీ, "అతనికిప్పుడు మీకు హాని చేసే ఉద్దేశంలేదు. గడువులోగా డబ్బు అందకపోతే అప్పుడాలోచిస్తాడు హెచ్చరిక ప్రకారం. కాబట్టి, ఆలోగా అతన్ని పట్టుకుంటామన్న నమ్మకంతో మీరు మామీద ఆధారపడతారా—లేక—డబ్బు ఏర్పాటు చేసి మీరే ప్రమాదాన్ని తొలగించుకుంటారా చెప్పండి."

"అతన్ని మీరు పట్టుకోలరా?"

"ఈ మహా నగరంలో కొన్ని గంటల వ్యవధిలో ఆ గ్యారంటీ ఇవ్వలేను."

"అయితే నేనలాగే చేస్తాను."

"ఎలా చేస్తారు?"

"అతన్ని పట్టుకోవడంవల్ల ప్రయోజనమేమిటి? మళ్ళీ అదే పోలీసులు, కోర్టు, జైలు గొడవలేగా? అప్పటి పరిస్థితిలో అదే మంచిదనుకున్నాను. కానీ, ఇప్పు డతని సరతు నాకు నచ్చింది. నలభై వేలు పారేస్తే నన్ను వదిలేసి పోతాడట. అది హాయి కదూ? ప్రాణానికి సుఖం. పీడ వదులుంది. నాకు మనశ్శాంతి దక్కుతుంది. ప్రాణభయం వుండదు."

లాల్ కొన్ని క్షణాలు మౌనంగా వున్నాడు. తర్వాత తలూపాడు.

"కానీ అతని మాటలు నమ్ముతారా? మళ్ళీ మళ్ళీ వచ్చి బెదిరిస్తే?"

"మళ్ళీ మళ్ళీ రాడు, బెదిరించడు."

"ఏమిటి నమ్మకం?"

"అందుకే నలభై వేలు-అంత పెద్ద మొత్తం కోరాడు. అంత ఎప్పుడూ అడగలేదు. పైగా ఇది ఆఖరి కోరిక అని రాశాడు. తన కోసం పోలీసులు గాలిస్తున్నారని తెలుసు. పట్టుబడితే కష్టం. అందుకని నానుంచి సాధ్యమైనంత ఎక్కువ మొత్తం ఫైనల్‌గా తీసుకుని మాయమవ్వాలని చూస్తున్నాడు. నానుంచి దూరంగా....చాలా దూరంగా శాశ్వతంగా...."

"మాటలు సరిగ్గా పలకండి, వేరే అర్థాలు వస్తున్నాయి."

నవ్విందామె. "నాకు పరధ్యానమెక్కువ."

"పరధ్యానంలోనే మీ ఆలోచనలకి ప్రాధాన్యం ఇవ్వాలనుకుంటాను. మీ అంతరంగంలో మీరేం ఆలోచిస్తుంటారు, శ-శి-క-ళ?"

"అ-బల_ని. ఆలోచన తప్ప ఆచరణ వల్లకాని దాన్ని."

"అనుచరులు ఆచరిస్తారు."

"ఎవరు?"

"మీ బాయ్‌ఫ్రెండ్."

"ఓహ్, మళ్ళీ మొదలెట్టారా? నోరు ముయ్యండి!"

"అలాగే మూసుకుంటాను. అతనిమీద పరిశోధన జరిపి, థీసిస్ మీకు సమర్పిస్తాను."

"డిటెక్టివ్ లాల్ ——"

"యస్, సిస్టర్?"

"మీరు నన్ను సిస్టర్ అన్నారా?"

"అన్నాను, సిస్టర్."

"అయితే ఈ సిస్టర్‌మీద నమ్మకముంచి మీ అనుమానాలు తొలగించుకోండి. ఈ సిస్టర్ అలాంటిది కాదు——"

"వెల్?"

"ఈ సిస్టర్‌కోసం మీరింత శ్రమ తీసుకున్నందుకు కృతజ్ఞతలెలా —— చెప్పుకోకూడదేమో సిస్టర్‌గా—— మీకెంతో ఋణపడివుంటాను. ఫీజు పంపుతాను అన్నీ చక్కబడ్డాక, ఇక ఈ క్షణనుంచి మన సంబంధాలు ముగిశాయి."

"ఓహ్, ఇంకా?"

"మీరిప్పుడు అతన్ని గాలించడం మానుకోండి. ఇన్స్పెక్టర్‌కి నా క్షమాపణలు చెప్పండి, అతన్ని ఇబ్బంది

పెట్టినందుకు. ఇప్పుడంతా తేలిగ్గావుంది. అతను కోరినట్టే డబ్బు తీసుకెళ్ళి రాత్రి అందులో పడేస్తాను. నాకన్ని కష్టాలూ తొలగుతాయి. ఇప్పుడిది మా భార్యాభర్తల మధ్య వ్యవహారం. ఇందులో మీ జోక్యం ఇక అవసరం లేదు. ఏమంటారు?"

లాల్ తలూపాడు. "ఓ.కే....అలా గే!"

# 5

జాన్ అంతా విని, పెద్దగా నవ్వుతూ, "యూ ఆరే ఫూల్!" అన్నాడు.

"ఎందుకు?" లాల్ అడిగాడు కుతూహలంగా.

"ముందు తీపి తీపి మాటలకి, తెలివి తేటలకి తబ్బిబ్బు అయిపోయి సిస్టర్ అంటూ వల్లో పడతావు. తర్వాత వాళ్ళు చెప్పిందానికల్లా వినయంగా, మంచి బాలుడు రామూలాగా తలవూపి వచ్చేస్తావు. నువ్విలా వస్తావు, అవతల అలా భగ్గున కొంపలంటుకుంటాయి!"

"ఇప్పుడేం అంటుకోలేదు."

"నిప్పు రాజుకుంటోంది, అంటుకుంటాయ్,"

"ఎలా, చెప్పు?"

"ఆమె కోరినట్లే పొట్లం తీసుకెళ్ళి ఆ చెత్తకుండీలో వేసివస్తుంది. ఆ తర్వాత మనవాడొస్తాడు. కలెక్టు చేసుకుంటాడు. కానీ అప్పుడేం జరుగుతుందనుకున్నావ్? పొట్లం విప్పగానే ధనామని పేలుతుంది బాంబు!"

"షటప్, నాన్సెన్స్ మాట్లాడకు!"

"నాన్సెన్స్ కాదు. లోకంలో జరుగుతున్నదే. ఆమె బాయ్ ఫ్రెండ్‌తో కలిసి చక్కగా నిర్వహించవచ్చు."

"అప్పుడు — వెళ్ళి జైల్లో కూర్చుంటారా? సెన్స్ లేకుండా మాట్లాడుతున్నావ్. ఆ పొట్లం ఆమె తీసు

కళ్ళిందన్నది మనకందరికీ తెలిసిన సత్యమని మరువకు."

"వెల్, అలా గాకపోతే మరోలా! అతనే ఆమెను చంపవచ్చు. కొంపలంటుకోవడానికొక ఉదాహరణ మాత్రం చెప్పానంతే."

"ఆమె వలపన్ని భర్తని చంపుతుందంటావా?"

"నలభై వేలతో పీడ వదులుతుందంటావా? అతను మళ్ళీ మళ్ళీ వస్తాడు. అప్పుడు పోలీసు వేట వుండదు. అవసరమున్నప్పుడల్లా వేధిస్తూంటాడు భార్యని. ఆమె ఆ మాత్రం గ్రహింపులేని మనిషి కాదు. గ్రహింపున్నవాళ్ళు ముందు జాగ్రత్త తీసుకుంటారు...."

ఫోన్ మోగింది.

లాల్ అందుకున్నాడు.

కృష్ణన్ అన్నాడు. "లాల్, జనార్థన్ జాడ దొరక లేదు. అతని ఫ్రెండ్స్ అందరి దగ్గరా చూశాం. అక్క డెక్కడికీ పోలేదు. ఎక్కడో ఏ హోటల్లోనో వుండొచ్చు. అవన్నీ చెక్ చేయడం పెద్ద వ్యవహారం. అతనెక్కడున్నా లక్ష్యం భార్య మీదనే. కాబట్టి భార్యకి రక్షణ ఏర్పాటు చేస్తే — ఇంటి దగ్గర నిఘా పెడితే మంచిదనుకుంటాను. అతనక్కడికి వస్తే చిక్కి పోతాడు."

లాల్ నవ్వి ఇప్పటి పరిస్థితి వివరించాడు.

"అయితే ఆమె డబ్బిస్తుందా? మన అవసరం లేదందా?" అన్నాడు కృష్ణన్.

"అవును. అతన్ని గాలించడం మానెయ్యండి. మిమ్మల్ని కష్టపెట్టినందుకు క్షమాపణలు చెప్పమంది. ఇప్పుడు మీ అవసరం, మా అవసరమూ ఆమెకు లేదు. భార్యాభర్తలిద్దరూ ఒక రాజీకొచ్చారు. వాళ్ళనే

చూసుకోనివ్వండి—"

"ఆల్ రైట్, నా ఐయామ్ హేపీ. నాకిదంతా విసుగ్గా వుంది. అతన్ని చూస్తే భార్యని చంపే రకంలా లేడు. ఉత్తపాగరు. ఇన్నాళ్ళూ ఇంట్లో ఇష్టమొచ్చినట్లు పెత్తనం చేశాడు. ఇప్పుడామె తెగించి బైటికిరావడంతో బెదిరిపోయాడు. మీ ఎదుట హత్యా ప్రయత్నమంటే మామూలు విషయంకాదు. వ్యవహారం చాలాదూరకు వెళు తుందని అలా మానుంచి తప్పించుకున్నాడు. కానీ—ఆమె డబ్బివ్వకపోతే ఏం చేస్తాడో చూడాలి."

"ఆమె ఇస్తుంది. ఇచ్చి అతన్ని వదిలించుకునే ఆలోచనతోనే వుంది. ఓ.కే., ఇన్స్పెక్టర్, థాంక్స్, మరోసారి కలుసుకుందాం, మరో కేసులో" లాల్ ఫోన్ పెట్టేసి జాన్ వైపు చూశాడు.

జాన్ అన్నాడు. "రాత్రి మనం జి.పి.ఓ. దగ్గ రుండాలి."

"ఎందుకు?"

"ఆమె నిజంగా డబ్బు తెస్తుందో లేదో చూడాలి."

"జనార్ధం అపార్థం చేసుకుంటాడు."

"ఎలా?"

"అక్కడ మనల్ని కనిపెట్టాడంటే తనని ట్రాప్ చేయడానికే అనుకుంటాడు. డబుల్ క్రాస్ సహించ లేడు. భార్యకు హాని చేస్తాడు."

"నువ్వెలా మాట్లాడతావు, లాల్? ఒకోసారి బుర్ర వాడవు. మనం చౌరస్తాలో నిలబడి మేమిక్కడున్నాం చూడండహో అని చాటుకుంటామా? చాటు ప్రదేశంలో మారువేషంలో వుండి గమనిస్తాం. ఇంక మాట్లాడకు—నోరు విప్పకు నువ్వు—రాత్రి మనమక్క

డుంటాం అంతేకి?"

ఫోన్ మోగింది మళ్ళీ. లాల్ ఎత్తాడు.

అవతలి గొంతు పలికింది, "డిటెక్టివ్ గారూ, నేను కాంతారావుని."

లాల్ అడిగాడు. "ఏ కాంతారావు?"

"కాదంబరి టెక్స్‌టైల్స్ కాంతారావుని. శశికళ పార్టనర్‌ని."

"ఓహ్, చెప్పండి."

"శశికళ ఇందాక వచ్చి చాలా చిత్రంగా మాట్లాడింది. నేను విన్నది నిజమేనా?"

"ఆమె భర్త కోసం నలభై వేలు అడిగితే అది నిజమే."

"అదే అడిగింది. కానీ నాకు నచ్చలేదు. వాడు డబ్బుకోసం వేధిస్తున్నాడని నాకు తెలుసు. కానీ ప్రాణంతీస్తాననడం ఇప్పుడే విన్నాను. శశికళ వాడి పోరు పడలేక చాలాసార్లు నా దగ్గర తీసుకెళ్ళి వాడికిచ్చింది. కొన్నాళ్ళక్రితం నేను సహించలేక ఇవ్వడం మానేశాను. వాడ్ని కోప్పడ్డాను. వాడు నాతో కొట్లాట పెట్టుకుని పదిమందితో నానా మాటలన్నాడు. అప్పట్నించీ నేను వాడి ముఖం చూడలేదు. వాడి నోరు మంచిదికాదు. వాటితో మాట్లాడితే మన పరువుండదు."

"మరి అప్పట్నించి ఆమె ఎలా సర్దుకుపోయింది?"

"నేను నెలనెలా ఖర్చులకిచ్చే రెండువేలతోనే. అందులో మూడొంతులు వాడు కొట్టేసేవాడట. ఆమె ఆ నాలుగైదు వందలతోనే గడుపుకొస్తోందట! ఇవ్వకపోతే కత్తితో బెదిరిస్తాడట. ఇదంతా ఇవ్వాళ నాతో చెప్పుకొచ్చింది....

"డిటెక్టివ్ గారూ, ఇదంతా చెప్పుకొచ్చి ఇవ్వాళే తనకు చావు బ్రతుకుల సమస్య ఏర్పడిందంది. ఈ నలభై వేలు ఇస్తే తను బ్రతుకుతుందనీ, లేకపోతే ఆ గడువు దాటిన మరుక్షణం నుంచీ తనకు ప్రాణగండమేనని చెప్పింది. ఆ డబ్బు వాడి ముఖాన కొట్టి మనశ్శాంతి దక్కించుకుంటానంది.

"డిటెక్టివ్ గారూ, ఈ వాదన నాకేమీ నచ్చలేదు. ముందు వాణ్ని అరెస్టు చేయించమన్నాను. ఇలా భయపడి లొంగితే అలా బందీగా ఉండిపోవాల్సిందే ఎప్పటికీ. వాడికవసరమున్నప్పుడల్లా వస్తాడు. ముగుడిగా వాడికా హక్కుంది. వాడి మాటలు నమ్మవద్దన్నాను.

"కానీ డిటెక్టివ్ గారూ, ఆమె వినలేదు. ఆ డబ్బు పారేసి విడాకులు పెట్టుకుంటానంది. వాడు మళ్ళీ వచ్చే వీలులేకుండా చేస్తానంది. వాణ్ని ఇప్పుడరెస్టు చేసి విడాకులు కోరితే, తర్వాత పగతో వచ్చి ప్రాణాలు తీస్తాడంది. ఇప్పుడే డబ్బు పారేసి ముందీ ప్రాణగండం తప్పించుకుంటే, తర్వాత విడాకులు పెట్టుకున్నా ప్రమాదం వుండదంది—"

"అప్పుడు మీరేమన్నారు?"

"అలాగే చెయ్యమన్నాను. ఆమె ఏది చెప్పినా వినేలా లేదు. తనకు కావాల్సిన డబ్బు ఇచ్చి సహాకరించమంది. అలాగే ఒప్పుకున్నాను. సాయంత్రం ఏడు గంటలకి ఇస్తానన్నాడు. అంత మొత్తం నా దగ్గరెక్కడుంటుంది? నా చేతిలో నాలుగైదు వేలుకంటే వుండదు. అంతా వ్యాపారంలోనే వుంటుంది. ఏడు గంటలకి ఎలాగైనా ఏర్పాటు చేస్తానన్నాను...."

# 6

రాత్రి తొమ్మిది గంటలకి జి.పి.ఓ. ముందు బస్సు దిగాడొక ఆగంతకుడు.

అతనికి పెద్ద వయసే వుంటుంది. వెంట్రుకలు బాగా నెరిశాయి. అతని చేతిలో స్టిక్, నోటిలో పైప్ వున్నాయి. అతను నల్ల ప్యాంటుమీద, సాదా తెల్లటి షర్టు టక్ చేసుకున్నాడు. కాళ్ళకి బూట్లున్నాయి.

అతను ఠీవీగా అక్కడి బుక్ స్టాల్ లోకి నడిచి, రాక్స్ లోని పుస్తకాలని ఆసక్తిగా పరిశీలించసాగాడు. కాస్సేపటికి అతని దృష్టి నాకర్షించిన హేడ్లీ ఛేజ్ నవల ఒకటి, జాన్ బాల్ నవల ఒకటి సెలక్టు చేసుకుని, మరేదో లేని పుస్తకం గురించి అడిగి, బిల్లు చెల్లించి ప్యాకెట్ తో బైటకొచ్చాడు.

అతనప్పుడు బస్ షెల్టర్ కింద నిల్చుని అక్కడ వచ్చి ఆగే ప్రతి వాహనాన్నీ, అందులోంచి దిగే ప్రతి మనిషినీ జాగ్రత్తగా గమనించసాగాడు.

అప్పుడు దూరంగా, నలువైపులా దృష్టిని సారించ సాగాడు.

షాపులు ఒక్కొక్కటే మూతలు పడుతున్నాయి. థియేటర్లు ఒక్కొక్కటే వదుల్తున్నారు. ఆ జనంతో ట్రాఫిక్ రద్దీ బాగా పెరిగిపోయింది. అతను హాడావుడిగా ఎడమవైపు కదిలి అక్కడున్న చెత్తకుండీవైపు చూడసాగాడు. అటువైపు నడిచే ప్రతి వ్యక్తినీ జాగ్రత్తగా పరిశీలించసాగాడు.

తొమ్మిదిన్నరయింది. ట్రాఫిక్ తగ్గింది. పదయింది. అతనిలో ఆత్రుత పెరిగింది. పదిన్నరయింది. అతనికి ఆందోళన ఎక్కువైంది. గబగబా అక్కడ్నుంచి కదిలి

జి. పి. ఓ. ఎడమవైపుకు దారితీశాడు. అక్కడ పాత ఫిలాటెలిక్ బ్యూరో మెట్లమీద కూర్చుని సిగరెట్ కాలుస్తున్న మరో ఆగంతకుడ్ని చేరుకున్నాడు. ఆ ఆగంతకుడు నల్లటి డ్రెస్‌లో అంత గౌరవనీయంగా లేడు.

లాల్ అండ్ జాన్ లనబడే ఆ ఆగంతకులిద్దరు ఒకర్నొకరు గుర్తించుకున్నారు.

"వచ్చిందా?" లాల్ అడిగాడు.

"లేదు" జాన్ అన్నాడు.

"ఏమైనట్టు? ఆమె ఇక్కడ బస్సు దిగలేదు. ఆటోలోనూ రాలేదు. కొంత దూరంలో దిగి నడిచివచ్చిందా?"

"ఆ కుండీ సమీపంలో ఆడవాళ్ళెవరూ పోలేదు."

"మగవాళ్ళు."

"కొందరు దానిముందునించి వెళ్ళారు."

"ఎవర్నయినా గుర్తించావా?"

"లేదు."

"జాన్, సమ్‌థింగ్ హేంపెండ్."

"ఏమిటి?"

"నువ్వెళ్ళి ఫోన్ చెయ్. ఆమె ఇంట్లో వుందో లేదో చూడు!"

జాన్ లేచి కదిలాడు. సమీపంలోని రెస్టారెంట్ కేసి నడిచాడు వేగంగా.

లాల్ పైప్ పీలుస్తూ తిరిగి కుండీమీద దృష్టి నిలిపాడు.

అప్పుడొచ్చిందొక యువతి. ఆమె గబగబా కుండీని దాటుకుంటూ వెళ్ళి, మళ్ళీ వెనక్కు వచ్చి, ముక్కు చీది, రసాన్ని కుండీలో పిండి, పెద్ద బరువుతగ్గినట్టు ఫీలవుతూ,

బస్సు షెల్టర్ కిందికి వెళ్ళిపోయింది.

అంతలో పరుగెత్తుకుంటూవస్తున్న జాన్ కన్పించాడు.

"వాట్ హేపెండ్?" అన్నాడు లాల్ ముందుకు వెళ్ళి.

"గాడ్‌నోస్! ఆమె ఏమీ చెప్పడంలేదు! చాలా భయపడిపోతోంది .... నేను ఫోన్ చేయగానే వెంటనే రమ్మని అరిచింది! ఇంకేమీ చెప్పకుండా ఫోన్ పెట్టేసింది—"

"సిల్లీ ఫూల్! కాంతారావు డబ్బు అందించివుండడు. అందుకే ఆమె రాలేదు. ఇప్పుడు భర్త ఎక్కడింటికి వచ్చేస్తాడోనని భయపడిపోతోంది .... లెట్స్‌గో, ఆదేమిటో చూద్దాం!

ఆటో ఎక్కి ఇద్దరూ బయల్దేరారు. పదినిమిషాల్లో చేరుకుంది ఆటో. దిగి గేటుతీసి లోపల కురుకుతుండగా, ఆమె ఎదురువస్తూ కన్పించింది. అరుస్తూ లాల్‌ని చేరుకుని, చేతులు పట్టుకుని అకస్మాత్తుగా ఏడుప్రారంభించింది....

"ఓమిటి? ఏం జరిగింది?"

"ఓ.హ్, నాకేం తెలియదు! నిజం చెప్తున్నాను! నేను.... నేను.... నాకేం తెలియదు! నేనతన్ని చంపాలనుకోలేదు! నేనెందుకతన్ని చంపాలనుకుంటాను? అతడే నన్ను చంపాలనుకున్నాడు! నేనతన్ని చంపలేదు.... చంపాలనుకుని...."

లాల్ ఆమె భుజంపట్టి గట్టిగా కుదిపాడు. "ఏయ్, ఏమిటది? మాటలు సరిగ్గా చెప్పండి! మీరెవర్ని చంపాలనుకోలేదు? ఇప్పుడెవరు చచ్చిపోయారు? ఎక్కడ?"

"అక్కడ—ఆ డ్రాయింగ్ రూంలో నే—గుండెలో...
ఓహ్!" ఆమె చేతుల్లో ముఖం కప్పుకుని మళ్ళీ ఏడ్వ సాగింది.

లాల్ ఆమెను వదిలి, జాన్ కు సైగ చేశాడు.

ఇద్దరూ చకచకా ఇంట్లోకి నడిచారు. డ్రాయింగ్ రూం తలుపు దగ్గరాగిపోయి లోపలికి చూశారు.

అక్కడ గుండెలో కత్తితో నేలమీద పడున్నాడు జనార్ధన్.

## 7

లాల్ ఆమె చెయ్యి పట్టుకొని దూరంగా తీసుకెళ్ళాడు. "ఓ.కే., ఓ.కే., ఇక ఏడుపు ఆపండి! అతనంటే మీ కసహ్యం. ఎందుకేడుస్తారు? మీ పతిభక్తిని ఇక్కడెవరూ పరీక్షించటంలేదు. మీరేం చేశారో చెప్పండి!"

"నే నేం చేయలేదు!"

"అయితే ఈ ఏడ్పెందుకు? ఈ భయం ఎందుకు? మీరు చేయాలనుకొని చేయలేదు, అవునా?"

"ఓహ్, కాదు! కాదు, లాల్!"

"అయితే ఏంచేశారో చెప్పండి!"

"అతను కోరినట్టే నేను డబ్బు తీసికెళ్ళి ఆ కుండీలో వేసివచ్చాను. సరిగ్గా పదిగంటలకే వేశాను. క్షణం అటూ ఇటూ కాలేదు. తిరిగి అరగంటలో ఇక్కడికి చేరుకున్నాను. లోపలికొచ్చి తలుపు తీయగానే — అతను కన్పించాడు. అక్కడ కిందపడిపోయి — గుండెలో కత్తితో. చుట్టంతా రక్తం! అతనిలో ప్రాణంలేదు! అది చూసి నా కళ్ళు తిరిగాయి! పడిపోతాననుకున్నాను. ఇంతలో ఫోన్ మోగింది. జాన్ చేశారు — ఆ పార్క్ లో

అప్పుడేం జరిగిందో ఆయనకు చెప్పలేకపోయాను...."

"మీరు జి.పి.ఓ.కి ఎలా వచ్చారు?"

"ఆటోలో వచ్చాను."

"ఎక్కడ దిగారు?"

"బస్ షెల్టర్ దగ్గరే."

"అప్పుడు టైం ఎంతయిందో చూశారా?"

"పది కావస్తోంది... రెండు నిమిషాలు తక్కువ."

"అంత కరెక్టుగా వూహించి ఎలా రాగలారు? సరిగ్గా పదిగంటలకే చేరుకోవాలని మీరు ఇంటినుంచి దూరం—ఆటో వేగం లెక్కగట్టి బయల్దేరారా?"

"లేదు. తొమ్మిదీ నలభైకి బయల్దేరాను. ఇరవై నిమిషాల్లో చేరుకోగలననుకున్నాను. రెండు నిమిషాలు ముందే చేరుకున్నాను. డబ్బు అందులో వేసి వెంటనే వచ్చేశాను."

"ఆటోలోనే?"

"ఆటోలోనే."

"వెళ్ళిన మార్గానే వచ్చారా?"

"అ—అవును—అవునవును."

"ఎన్ని గంటలకి ఇంటికి చేరుకున్నారు?"

"పదిన్నరకి."

"అంటే అరగంట పట్టిందా?"

"అవును—కాదు—కావచ్చు. సరిగ్గా గుర్తులేదు."

"గుర్తుచేసుకొని చెప్పండి. వెళ్ళినప్పుడు ఇరవై నిమిషాలు పట్టిన కాలం, వచ్చేటప్పుడూ అంతే పట్టాలి. మీరిందాక రెండుసార్లన్నారు, అరగంటలో ఇంటికి చేరుకున్నానని."

ఆమె కలవరంగా చూస్తూండిపోయింది. మాట్లాడలేక

పోయింది.

పోలీసు వాహనాలు వచ్చి యింటిముందాగాయి. వాళ్ళంతా దిగి గబగబా లోపలికొచ్చారు. కృష్ణన్ లాల్ని సమీపించి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఇదే కేసులో మళ్ళీ కలుసుకున్నాం" అన్నాడు లాల్.

జాన్ కృష్ణన్తోపాటు వాళ్ళందర్నీ తీసుకుని ఇంట్లోకి వెళ్ళాడు.

లాల్ ఆమెవైపు తిరిగి ఆసక్తిగా చూశాడు.

ఆమె తల దించుకుని నేలచూపులు చూస్తోంది.

"మీరు నిజం చెప్పడంలేదు, శశికళ."

"నిజమే చెప్తున్నాను, లాల్! నన్ను నమ్మండి."

"ఆల్ రైట్, మీరు టైము సరిగ్గా గమనించలేదనుకుందాం. మరి మీరు డబ్బు అక్కడ వేసి వస్తే, అతనిక్కడికి ఎందుకొచ్చాడంటారు?"

ఆమె మళ్ళీ కలవరపడింది.

నవ్వాడు లాల్. "షేమ్, షేమ్, ఐ పిటీయూ! మీకు అబద్ధాలు చెప్పడం కూడా రాదు."

"నన్ను నమ్మండి, లాల్! ఈ సిస్టర్ అలాంటిది కాదు!"

"మీమీద నమ్మకం పోయింది. మీరు జి.పి.ఓ.కి వెళ్ళలేదు. అక్కడ షెల్టర్ దగ్గర ఆటో దిగలేదు. ఆ కుండీలో డబ్బు వేయలేదు. మేమక్కడ గమనిస్తూనే వున్నాం. మీరు రాలేదు. మీకు కాంతారావు డబ్బివ్వలేదు. మీరాందోళనగా ఇంట్లోనే గడిపారు. మీరు అక్కడికి రాకపోవడం చూసి మీ భర్త ఇక్కడికే వచ్చాడు కత్తితో. కానీ...."

"కాంతారావు నాకు డబ్బిచ్చాడు, వెళ్ళి అడగండి!"

"ఓహ్!"

"ఆ డబ్బు కుండీలో వేశాను, వెళ్ళి చూడండి!"

"ఆగి, ఆగెగె!...."

"నాతో రండి, చూపిస్తాను!" ఆమె లాల్ చెయ్యి పట్టి లాగింది. లాల్ వెళ్ళాడు. ఆమె బయట జీపులో ఎక్కి డ్రైవర్ని పోనివ్వమంది. లాల్ కూడా ఎక్కి కూర్చుని పోనివ్వమన్నాడు.

డ్రైవర్ పోనిచ్చాడు.

దారి పొడవునా ఎవరూ మాట్లాడలేదు. జి.పి.ఓ. ముందు దిగి కుండీ వద్దకు వెళ్ళారు. ఆమె ఆత్రుతగా వంగి లోపల కెలకసాగింది. చెత్తాచెదారాన్ని తొలగిస్తూ లోపల చూడసాగింది. లాల్ ఆమె భావాలు గమనిస్తూ మౌనంగా నిలబడ్డాడు.

"ఇక్కడే .... ఇక్కడే వుండాలి. పైకి కనిపించ కూడదని కొంత లోపలికి నెట్టాను...." ఆమె ఇంకా గాలిస్తోంది.

"లాభంలేదు, శశికళ. అది అంత అడుక్కి వెళ్ళదు. మీ రెక్కడుంచారో అక్కడే వుంటుంది."

"ఎవరన్నా చూసి తీసుకున్నారేమో!"

"పదండి, ఇక్కడంతా మనల్ని చూస్తున్నారు."

తిరిగి జీపులో ఇంటికి చేరుకున్నారు.

లాల్ అన్నాడు జీపు దిగుతూ. "చటుక్కున చెప్పాలి మీరింటికొచ్చినప్పుడు లోపల లైటు వెలుగుతోందా?"

"లేదు!"

"మీరింటికొచ్చి బట్టలు మార్చుకున్నారా?"

"అహఁ.... లేదు."

"అహాఁ ఎందుకు? అది ఆలోచనను తెలుపుతుంది. మీరు బట్టలు మార్చుకున్నదీ లేనిదీ ఆలోచించి చెప్పాల్సినంత చిక్కు ప్రశ్నేమీ కాదు."

"ఎలా మార్చుకుంటాను—ఆ దృశ్యం చూశాక!"

"ఆ దృశ్యం చూశాక నాకు అనిపించింది అలా."

"ఎందుకనిపించింది?"

"గది చిందరవందరగా వుంది. వస్తువులు స్థానాలు మారాయి. చావుకి ముందు ఘర్షణ జరిగి వుండాలి. అతని వస్త్ర చినిగింది...."

"అతని చావుతో, ఆ ఘర్షణతో నాకు సంబంధం లేదు! నా బట్టలు చినగలేదు! నేను బట్టలు మార్చుకో లేదు!"

"కానీ మీరు గమనించారో లేదో—క్షమించండి—నేను గమనించాను."

"ఏం గమనించారు?"

"మీ జాకెట్ హుక్-వెనుక తప్పు పెట్టుకున్నారు."

ఆమె ఉలికిపడి పైట నిండుగా కప్పుకొని, కోపంగా చూసింది.

"మీరు అందర్నీ ఇలా పరీక్షగా చూస్తారా?"

"చూడాల్సిన సమయాల్లో చూస్తాను. నేను చూసే దృష్టి వేరు."

"ఈ హుక్....అవును, నేను గమనించలేదు, డబ్బు తీసికెళ్లే తొందరలో. అంతమాత్రాన బట్టలు మార్చుకున్నట్లు అర్థమా?"

"ఆల్ రైట్, పోనివ్వండి. మీ రేయే వస్తువులు ముట్టుకున్నారిక్కడ?"

"తాళం—తలుపు—లైటు స్విచ్చి...."

"ఇంకా?"

"టెలిఫోన్ — జాన్ ఫోన్ చేసినప్పుడు — అంతే."

లాల్ సిగరెట్ తాగుతూ స్ట్రెచర్ మీద వస్తోన్న శవాన్ని చూడసాగాడు. శవం తిన్నగా అంబులెన్స్‌లోకి వెళ్ళిపోయింది. ఆ వెనుక అందరూ వచ్చారు.

కృష్ణన్ అన్నాడు లాల్ దగ్గరకొచ్చి "జాన్ నాకంతా చెప్పాడు. ఈమె అంతా కల్పించి చెప్తోంది. ఈమె డబ్బు తీసికెళ్ళలేదు. భర్తని ఉపాయంగా ఇక్కడికి రప్పించి చంపింది. ఈమె మనసులో మొదట్నుంచీ భర్త చచ్చిపోతే బాగుండునన్న ఆలోచన వుంది. అదిలా కార్యరూపం దాల్చింది. ఈమె మీద ఈ అభియోగానికి ఆధారాలన్నీ సిద్ధమవుతున్నాయి. నేను ఇప్పుడీమెను అరెస్టు చేస్తున్నాను...."

"అరెస్టు హార్" అన్నాడు జాన్.

## 8

ఉదయం పదిన్నరకు కాంతారావు ఫోన్ చేసి, "డిటెక్టివ్ గారూ! ఏమిటిది, ఇలా జరిగింది?" అన్నాడు.

"ఇలాగే జరుగుతుంది...." అన్నాడు లాల్ ఏదో ఆలోచిస్తూ, "మీరెలా జరగాలనుకున్నారు?"

"శశికి మేలు జరగాలనుకున్నాను."

"అందుకే ప్రయత్నాలు చేశారు?"

"ఆమెకు డబ్బిచ్చి సహాకరించాను."

"మీరామెకు డబ్బిచ్చారా?"

"నేను గాకపోతే ఇంకెవరిస్తారు?"

"తర్వాత ఏం చేశారు?"

"షాపు కట్టేసి ఇంటికెళ్ళాను."

"ఎన్ని గంటలకి?"

"ఎనిమిదిన్నరకు. ఆపైన వుండకూడదు లేబర్ రూల్స్ ప్రకారం."

"అప్పటినుంచీ ఎక్కడున్నారు?"

"ఇంట్లోనే."

"ఏం చేశారు?"

"భోజనం చేసి పడుకున్నాను."

"ఏమిటీ! అవతల శశి పరిస్థితి అలా వుంటే.... ఆమెకు ఫోన్ చేసి ఏం జరిగిందో తెలుసుకోవాలనిపించలేదా మీకు?"

"ఎందుకనిపించలేదు? ఆమె జోక్యం చేసుకోవద్దంది. లేకపోతే తనకు కీడే జరుగుతుందంది. దాన్నెలా పరిష్కరించాలో తనకు బాగా తెలుసునంది. ఇక ఈ విషయంలో నన్ను కల్పించుకోవద్దంది. కాబట్టి నేను ఆమెకు ఫోన్ చేసి ఆమె ఆగ్రహానికి గురికాదల్చుకోలేదు.

"కానీ ఇప్పుడు — ఇలా జరిగాక ఇంకెలా చేతులు కట్టుకుని వుండను? ఆమెను రక్షించే ప్రయత్నాలన్నీ చేస్తున్నాను. మిమ్మల్ని అర్థిస్తున్నాను, ఆమెను దయచేసి కాపాడండి. మీకెంతయినా ఫీజిచ్చుకుంటాను. ఆమెను రక్షించండి. ఆమె ఈ హత్య చేయదు— చేయలేదు. ఆ హంతకుడెవరో పట్టుకుని ఆమెను విడిపించండి—"

"ఆమె ఈ హత్య చేసినట్టు ఆధారాలున్నాయి."

"లేదు, ఆమె చేయలేదు. అవన్నీ ఆమె మీద సృష్టించబడ్డాయి."

"మీకెలా తెలుసు?"

"నాకెలా తెలుసు? ఆమె మీద నాకు నమ్మకముంది—"

"మీది ఆత్మీయతకు సంబంధించిన నమ్మకం. మాకు

ఆధారాలతో పదరాలి నమ్మకం. రాత్రి ఆమె భర్త కోరినట్టు డబ్బు తీసుకెళ్ళలేదు."

"తీసుకెళ్ళానని నాతో చెప్పింది."

"అయితే భర్త ఇంటికెందుకొచ్చాడో అడిగారా?"

"అది — అవును, ఆలోచించవలసిన విషయమే. ఇందులో తప్పకుండా ఏదో రహస్యముంది. అది కనుక్కొని మీరామెను కాపాడాలి."

"మీ కెవరిమీద అనుమానముంది?"

"అతని ఫ్రెండ్స్ అందర్నీ ఒకసారి విచారించండి."

"థాంక్స్, మీ సలహాకి. అవసరమనిపిస్తే మిమ్మల్ని కూడా విచారిస్తాం."

"నన్నెందుకు?"

"అది అడక్కూడని ప్రశ్న. ఇది హత్యకేసు. ఇందులో ఎవరికీ మినహాయింపు వుండదు." లాల్ ఫోన్ పెట్టేశాడు.

జాన్ కూడా ఎక్స్‌టెన్షన్ రిసీవర్ పెట్టేశాడు. అతడన్నాడు. "ఆధారాలు—ఏం ఆధారాలు కావాలి? ఆమె అంతరంగమే మూలాధారం. ఇప్పుడు మనం చూసేవన్నీ సాక్ష్యాధారాలు. ఆమె మనసులో భర్త చావాలన్న కోరిక వుంది. ఆ డబ్బుతో మళ్ళీ రాడని నమ్మకమేమిటి? ట్రాప్ పసిగట్టింది. ముందు జాగ్రత్త తీసుకుంది. పరిస్థితులన్నీ ఆమె ఆలోచనకి అనుకూలంగా వున్నాయి....

"కాంతారావునుంచి డబ్బు తెచ్చుకున్నాక భర్తకివ్వకూడదనుకుంది. అతనెక్కడున్నాడో ఆమెకు తెలియదు. కాబట్టి తను జి.పి.ఓ.కి వెళ్ళకుంటే అతనెక్కడున్నా ఇంటికే వస్తాడు. ఇంటి దగ్గర పోలీసు

కాపలా లేదు. మనల్ని కూడా మాన్పించింది.

"అలా భర్త వస్తాడనుకున్న సమయంలో తను ఇంట్లో వుండకుండా ఎక్కడికో బయల్దేరితే—భర్తతో ఘర్షణపడి పారుగువాళ్ళు ఎలర్టు అయ్యే ప్రమాదం తప్పుతుంది. తను జి.పి.ఓ.కి వెళ్ళినట్టు ఎలిబీ ఏర్పడుతుంది—ఎవడు చూడొచ్చాడు? మనల్ని మాన్పించింది గనుక మనం అక్కడ కనిపెట్టుకు నుంటామని వూహించలేదు. తను జి.పి.ఓ. పరిసరాల్లో భర్త కంటపడకూడదు. అప్పుడతను కారణం తెలుసుకోవడానికి ఇంటికి ఫోన్ చేస్తాడు. ఆమె సూచన ప్రకారం రెస్పాన్స్ వుండదు. అప్పుడు నేరుగా ఇంటికే బయల్దేరతాడు—అక్కడ అనుకోని విధంగా ఆమె బాయ్ ఫ్రెండ్ చేతిలో కత్తిపోటు తింటాడు!"

"ఆమె బాయ్ ఫ్రెండ్?"

"అవును, లాల్. ఆమె బాయ్ ఫ్రెండ్ని ఇంట్లో వుంచి వెళ్ళింది. భర్త అలా యింటికి రాగానే గవ్ చివ్ గా లోనికి రానిచ్చి చంపమంది. కత్తి ఆమే ఇచ్చింది. అవసరమైన సూచనలిచ్చింది. చంపి పారిపొమ్మంది—లైటార్పి, ఇంటికి తాళంవేసి, తాళంచెవి నిర్ణీత చోటులో పెట్టి."

"ఎలా అంటున్నావు?"

"హత్యాస్థలంలో ఎవిడెన్స్ వుంది."

"ఏం ఎవిడెన్స్?"

"గుండీ—షర్టు గుండీ-గ్రీన్ కలర్ లో. జనార్దన్ షర్టు తెల్లది. దానికి తెల్ల గుండీలే వున్నాయి. ఈ గ్రీన్ గుండీ అతనిది కాదు. హంతకుని షర్టుది. ఘర్షణలో తెగి పడింది—"

"వెల్, వెల్, వెల్!"

"కత్తిమీద వేలిముద్రలు తుడిచేశాడు. ఇంట్లో వస్తువులేవీ ముట్టుకోకుండా జాగ్రత్తపడ్డాడు—లైటు స్విచ్, తలుపు, తాళం తప్ప. వెళుతూ వాటిని తుడిచాడు. అతను గ్రీన్ షర్టులో వున్నాడు. ఆమె బాయ్ ఫ్రెండును పట్టుకుంటే—"

ఫోన్ మోగింది. కృష్ణన్ అన్నాడు అవతలినుంచి. "మిష్టర్ లాల్, మీరొకసారి వస్తారా? మాకు కొత్త ఎవిడెన్స్ దొరికింది...."

## 9

డిటెక్టివ్‌లు కృష్ణన్ ఎదుట కూర్చున్నారు.

అతను ఉత్సాహంగా కన్పించాడు. ఒక సిగరెట్ ఇష్టంగా వెలిగించుకుని అన్నాడు. "ఆమె అబద్ధాలతో గట్టెక్కాలని చూస్తోంది. మీ క్లయింట్ అయివుండి మీతోనే అబద్ధాలు చెప్తోంది. ఇక మీరెలా రక్షిస్తారు?"

"రక్షిస్తానని ఆమెకు మాటివ్వలేదు. మళ్ళీ ఏం చెప్పింది?" అన్నాడు లాల్.

"ఆ డబ్బు ప్యాకెట్ కోసం ఉదయం మేము ఆమె యింటిని సోదాచేశాం. అది దొరకలేదు. కానీ ఏం దొరికాయో తెలుసా?"

"ఏం దొరికాయి?"

"ఇవీ!" అన్నాడు కృష్ణన్.

టేబులు కిందనుంచి ఒక జత బట్టలు, ఒక మఫ్లర్ తీసి పైన పడేశాడు.

డిటెక్టివ్‌లు కలవరంగా చూశారు వాటిని. వాటిలో ఒక తెల్ల ప్యాంటు, ఒక ఆకుపచ్చ షర్టు, ఒక నల్లటి మఫ్లర్ వున్నాయి. జాన్ షర్టు తీసుకుని చూశాడు.

దానికి ఆకుపచ్చ గుండీలున్నాయి. మధ్య గుండీ ఒకటి వూడిపోయింది.

"ఎవరివి?" అన్నాడు లాల్.

"హతుడు—జనార్దన్‌వి—అని ఆమె అంటోంది."

"ఎక్కడ దొరికాయి?"

"ఆమెనే అడగండి."

లాల్ శశివైపు చూశాడు. ఆమె అంది. "ఇవి నా బీరువాలో దొరికాయి అంటున్నారు. కానీ అందులోకెలా వచ్చాయో నాకు తెలియదు."

"ఇవి మాడూ చుట్టచుట్టి అందులో పడేసివున్నాయి" కృష్ణన్ అన్నాడు.

"అతని బట్టలు మీ బీరువాలోనే వుంటాయా?" లాల్ అడిగాడు.

"లేదు. హేంగరుకి వేలాడుతుంటాయి. అతనికి బీరువా లేదు."

"ఇవి అందులోకెలా వచ్చాయి? ఈ మఫ్లర్ అతనిదేనా?"

"అతనిదే. ఇవి నా బీరువాలోకెలా వచ్చాయో తెలీదు."

"అతను ఉదయం ఇంటినుంచి బయల్దేరినప్పట్నుంచీ చనిపోయేవరకూ ఒకే డ్రస్సులో వున్నాడు కదూ?"

"అవును, ఈ బట్టల గురించి నాకేం తెలియదు."

కృష్ణన్ నవ్వాడు. "మరొకటి వినండి! ఈమె పదిన్నరకు ఇంటికొచ్చానంటోంది. కాని పదీ—పదింపావు మధ్య ఈమె యింట్లోంచి అరుపులు విన్పించాయంటున్నారు ఎదురింటివాళ్ళు."

"ఎవరివి?"

"ఒక ఆడ—మగ గొంతులు. ఆ ఆడగొంతు ఈమెది, మగ గొంతు ఆమె భర్త జనార్దనదని చెప్తున్నారు ఎదురింటివాళ్ళు. ఆ అరుపులు మామూలే కాబట్టి వాళ్ళు ఆసక్తి కనబర్చలేదుట."

లాల్ ఆమెవైపు చూశాడు. ఆమె తల దించుకుంది.

"అతన్ని నేను చంపలేదు."

"అవును, మీరు చంపలేదు. చంపించారు మీ బాయ్ ఫ్రెండ్‌తో" జాన్ అన్నాడు.

"నాకు బాయ్ ఫ్రెండ్ లేడు" అందామె.

లాల్ అన్నాడు. "మీరెందుకు దాస్తున్నారు, శశికళ? ఇంకా ఎందుకీ అబద్ధాలు? రాత్రి మీ భర్తతో మాట్లాడిన విషయం ఒప్పుకుంటున్నారు. ఈ బట్టలు మీ భర్తవే అంటున్నారు. ఇవి మీ భర్తవైతే ఈ షర్టు గుండీ తెగి హత్యాస్థలంలో ఎలా పడింది? అతను ఈ షర్టు వేసుకోలేదు. ఇవి మీ బీరువాలోకి చుట్ట చుట్టుకొని ఎలా వచ్చాయి?"

ఆమె మాట్లాడలేదు.

"ఈ బట్టలు మీ భర్తవి కావు" లాల్ అన్నాడు మళ్ళీ, "మీరిద్దరూ పోట్లాడుతున్నప్పుడు మరొకతను వున్నాడక్కడ. ఈ బట్టలు అతనివి. అతను పరాయి వ్యక్తి. బయటనుంచి వచ్చాడు. అయినా మీకు తెలిసినవాడు. ఆనవాలు కాపాడుకోవడానికి బయట ఈ మఫ్లర్ చుట్టుకుని వచ్చాడు. మీ భర్తతో ఘర్షణలో అతను మీ తరఫున పోట్లాడాడు. అప్పుడే గుండీ తెగింది. అది గమనించలేదు. మీ భర్తని పొడిచాక ఈ బట్టలు విప్పేశాడు. వీటిమీద రక్తం మరకలేవీ లేవుగానీ— బయట తన రాకపోకల్ని కాపాడుకోవడానికి...."

"ఈ బట్టలు మావారివి."

"అయితే ఈ గుండీ హత్యాస్థలంలోకిలా వచ్చింది!"

"నాకు తెలియదు!"

"ఓ.కే. అప్పుడింట్లో మీరిద్దరే వున్నారా?"

"అవును."

"ఏ ఇద్దరు?"

"నేనూ జనార్థన్. నేను డబ్బు అక్కడ వేసి వచ్చేసరికి అతను ఇంట్లో వున్నాడు. అప్పుడు మేం పోట్లాడుకున్నాం."

"అక్కడ డబ్బు తీసుకోకుండా ఇంటికెందుకొచ్చాడు?"

"అక్కడ మిమ్మల్ని చూసివుంటాడు."

"అది అసంభవం. మీరు చూసినా మమ్మల్ని గుర్తుపట్టేవారు కాదు. మీరిద్దరు దేనిగురించి పోట్లాడుకున్నారు?

"అది చెప్పను."

"ఎందుకు చెప్పరు?"

"అది మా భార్యాభర్తల మధ్య విషయం."

"అతని చావు మీ కళ్ళముందే జరిగింది కదూ?"

"లేదు__"

"జరిగింది. అప్పుడక్కడ మీకు తెలిసినవాడు మరొకతను వున్నాడు. ఆ పోట్లాటలో మీ భర్తనుంచి మిమ్మల్ని రక్షించడానికి అతన్ని చంపేశాడు. రాత్రి మీ జాకెట్ హుక్ ఆ ఘర్షణలో నే స్థానం మారింది. ఆ మిత్రుణ్ణి రక్షించడానికి మీరిలా విషయాలు దాస్తున్నారు."

"నేనెవర్నీ రక్షించడంలేదు. నన్ను నేను రక్షించు

కోవాలి."

"ఈ లెక్కన మిమ్మల్ని మీరు రక్షించుకోలేరు."

"నాకిలాగే రక్షణ వుంటుంది."

లాల్ చురుగ్గా చూశాడు. "అలాగా? మీకిలాగే రక్షణ వుంటుందా? మీరిలాగే హంతకుణ్ని రక్షిస్తారా? తెలిసింది, నాకు తెలిసిపోయింది—శశికళ. మీరేం చెప్పకండి. నిజం నేనే వెలికితీస్తాను...."

## 10

జాన్ అడిగాడు తిరిగి ఆఫీసుకు బయల్దేరినప్పుడు. "ఏమిటి లాల్, నీకేం తెలిసింది? ఏమిటా నిజం?"

లాల్ వెనక్కి వాలి, కళ్ళు మూసుకున్నాడు. "కాంతారావ్ — అతనే — అతనే మనకు కావలసిన మనిషి. అతన్నే రక్షిస్తోంది శశికళ. ఆఫ్టరాల్ అతడామె పార్ట్‌నర్ కాదూ? బోలెడు లాభం చేసి పెడుతున్నాడు. అతన్ని కాపాడకపోతే ఎలా? తాను ఎలాగో బయటపడగలదు. ఆమెమీద వున్న ఆధారాలన్నీ పాక్షికంగానే వున్నాయి. హత్య ఆమె చేతిలో జరుగలేదన్నది స్పష్టం. ఆ గుండీ ఆమెకు బలమైన ఎలిబీ....

"ఆ షర్టు—మై డియర్ పార్ట్‌నర్ — కాంతారావు ధరించి వచ్చాడు. ఆ బట్టలు అతనివే. ఏ కారణంవల్లనో అతను డబ్బు సర్దలేకపోయాడు. అతనికి దురుద్దేశం లేకపోవచ్చు. నిజంగానే డబ్బు లభించి వుండకపోవచ్చు. కానీ ఆ పరిణామాన్ని ఎదుర్కోవడానికి మాత్రం ఒక్కటే మార్గం కన్పించింది—జనార్ధన్‌ని అంతమొందించడం. తాను డబ్బిచ్చింది, శశికళ మండీలో వేసి వచ్చిందీ అంతా కల్పితం. తన ఇంట్లో ఎలిబీ ఏర్పాటు

చేసుకునివచ్చి, శశికళకు ఎలిబీ కోసం బయటికి వెళ్ళి రమ్మన్నాడు. అప్పుడు అతడామె ఇంట్లో వుండగా జనార్థన్ వచ్చాడు. అనుకున్నంత సులభం కాలేదు పని. అతనితో ఘర్షణపడ్డాడు. ఎలాగైతేనేం అతన్ని అంతం చేశాడు. ఇదంతా శశికళ అంగీకారంతోనే చేశాడు..."

"కానీ అతను బట్టలెందుకు మార్చుకోవలసి వచ్చింది?" అడిగాడు జాన్, "బయట తన రాకపోకల్ని కాపాడుకోవడానికన్నది సబబుగా లేదు. అవి తన భర్తవి అంటోంది శశికళ."

"అలా చెప్పడంలో వింతేముంది? అతన్ని కాపాడాలి కదా...జాన్, నువ్వు కాంతారావు షాపుకి డ్రైవ్ చెయ్. దూరంనుంచి ఓ చూపు చూసి పోదాం. అతడెలా వుంటాడో మనం చూడలేదు—"

జాన్ తలూపి గన్‌ఫౌండ్రీవైపు తిప్పాడు. అయిదు నిమిషాల్లో కాంతారావు షాపుమీదనుంచి పోతూ ఇద్దరూ తొంగి చూశారు.

జాన్ అన్నాడు. "అదుగో, కౌంటర్‌లో నిల్చుని వున్నాడు కాంతారావ్. తెల్లటి ధోవతి, లాల్చీలో అతడెంత పవిత్రంగా కన్పిస్తున్నాడో చూడు. అహా, మల్లెపూవులా వున్నాడు. ప్యాంటు షర్టు వేసుకోడతను. దానవత్వం లేదతనిలో. మానవత్వం మూర్తీభవించిన..."

"పోనివ్వు" అన్నాడు లాల్.

జాన్ పోనిచ్చాడు. కారు పోతూండగా అన్నాడు మళ్ళీ. "నో, లాల్. ఆ బట్టలు కాంతారావువి కావు. జనార్థన్ శవంమీద షర్టూ, ఆ గ్రీన్ షర్టూ ఒకే టైలరు కుట్టినవి....వాటిమీద లేబిల్సు నువ్వు గమనించ లేదు. శశికళ అంటున్నది నిజమే. అవి తన భర్తవి. ఇక

బాయ్ ఫ్రెండ్ యాంగిల్ కూడా మనం డిస్‌మిస్ చేయాలి. పోతే ఆ గుండీ అక్కడికెలా వచ్చిందన్నది ప్రశ్న—"

"ఎక్కడో ఏదో కిటుకు వుంది, జాన్."

"అంతా క్లియర్‌గా వుంది, లాల్. ఆ పని ఆమె ఒక్కతే చేయలేదా? తన రహస్యాన్ని మరొకరితో పంచుకుంటుందా? భర్తని చంపేసి, కేసు పెడదోవ పట్టించడానికి ఆ గుండీ తెంపి పడేసివుండాలి. వీలు చూసుకుని ఆ బట్టలు మాయంచేయాలనుకుని తాత్కాలికంగా తన బీరువాలో దాచివుండాలి—"

"మరి ఆ మఫ్లర్? నో జాన్, క్లియర్‌గా లేదు. ఏదో కిటుకుంది. ఆ మఫ్లర్ ఆనవాలు మరుగుపరచడానికే ఉపయోగించబడింది. ఎవరి ఆనవాలు? హంతకుడివి, అఫ్ కోర్స్. హంతకుడెవరు? కాంతారావు కాదు. ఆమె బాయ్ ఫ్రెండ్—వెల్, అతడున్నట్లు బయటపడలేదు. మరి అప్పుడు ఫోన్ చేసిందెవరు—నిన్న ఉదయం ఆమె ఇంటికి నీకంటే ముందు ఫోన్ చేసిందెవరు? జనార్థనా? తన డిమాండ్ కోరడానికి ఫోన్ చేశాడా? అప్పుడు నేను పలకడంతో ఆ ప్రయత్నం విరమించుకుని ఆ ఉత్తరం ద్వారా తెలిపాడా?

"వెల్ రైట్, నిజమే అనుకుందాం. ఆ ప్రకారం కాంతారావు డబ్బిచ్చాడే అనుకుందాం. శశికళ తీసుకెళ్ళి ఆ కుండీలో వేసిందే అనుకుందాం. మరి జనార్థన్ ఇంటికెందుకొచ్చాడు? ఆ డబ్బు ఏమైంది? జి.పి.ఓ.కి శశికళ రాలేదనుకున్నాడా? ఆమెను అక్కడ గుర్తించలేదా? ఆమె మనల్ని అనుమానిస్తూ, మనల్ని మాన్పించినా

భర్తని ఎక్కడ ట్రాప్ చేసి తనకి ప్రమాదం కల్గిస్తా
మోనని భయపడి మారువేషంలో వచ్చిందా — మనం
గుర్తుపట్టకుండా వుండడానికి? మగవేషంలో భర్త
ప్యాంటు షర్టు వేసుకుని, ఒ మ్లర్ చుట్టుకొచ్చిందా
జి. పి. ఓ.కి? మనం ఆమె రాలేదనుకొని వెళ్ళిపోతే
భర్తకూ, తద్వారా తనకూ అపాయం వుండదనుకుందా?"

"కానీ మనలాగే భర్త కూడా ఆమె రాలేదనుకుని
పొరబడి ఇంటికె ల్తే అప్పుడు ఘర్షణపడి చంపేసిందా?
మరి అక్కడ డబ్బు ఏమైనట్టు? హుం వెళ్ళి చూస్తే లేదు.
అందులో డబ్బుంటే ఎవరు చూశారు? ఎవరు తీశారు?
ఎవరు—ఎవరు? డామిట్, స్టాపిట్! కారాపు, జాన్!"
అరిచాడు లాల్.

జాన్ ఆపేసి, "ఏమిటి, పార్ట్నర్?" అన్నాడు.

"ఓహ్, నేనెంత ఫూల్‌ని! డామిట్, డామిట్!"

"ఎందుకు—నువ్వెందుకు ఫూల్‌వి!"

"వెల్, వెల్, వెల్, కిటుకు తెలిసింది! జాన్,
నువ్వాఫీసుకెళ్ళి డెస్కులో ఆ ఆటో డ్రైవర్ల అడ్రసు
లున్నాయి—వాళ్ళని అర గంటలోగా కృష్ణన్ దగ్గర
హాజరుపరచు! ఈలోగా నేనొస్తాను. కమాన్, గెడవున్,
క్విక్!"

జాన్ అయోమయంగా దిగిపోయాడు.

లాల్ స్టార్టుచేసి శరవేగంతో దూసుకుపోయాడు.
పది నిమిషాల్లో ఆ యింటిముందున్నాడు. దిగి తలుపు
కొట్టిన వెంటనే ఆ కుర్రాడు వచ్చి తీశాడు.

"ఏమిటి సార్, మళ్ళీ ఏం చేశాను?" అన్నాడు
భయపడుతూ.

"నిన్న ఆటోలో నువ్వెవర్ని చూశావు?" అరిచాడు

లాల్.

"ఎవరో సార్, నాకు తెలియదు!"

"ఆ పక్కింటి జనార్దన్ కాదా?"

"కాదు, సార్."

"కాదా? జనార్దన్ కాదా?"

"కాదు సార్, అతను జనార్దన్ కాదు!"

లాల్ ముఖం ఎర్రబడింది కోపంతో. "ఈ సంగతి అప్పుడెందుకు చెప్పలేదు, యూ ఫూల్!"

"అప్పుడు మీరడగలేదు కదా సార్?"

లాల్ పళ్ళునూరాడు. "నిన్ను—నిన్ను చూస్తుంటే ఎత్తి కుదేద్దామనిపిస్తోంది!"

"పొరపాటు మీదే, సార్."

"పద నాతో! ఆ ఆటో డ్రైవర్ని గుర్తుపట్టగలవా?"

"గుర్తుపట్టగలను, సార్."

లాల్ అతనితో కృష్ణన్ దగ్గరికి చేరుకునే సరికి, అక్కడ జాన్ యింకా రాలేదు. పావుగంట నిరీక్షణ తర్వాత వచ్చాడు, ఆ ముగ్గురు ఆటో డ్రైవర్లని వెంట బెట్టుకొని.

వాళ్ళని వరుసలో నిలబెట్టి లాల్, నాగేష్ని అడిగాడు. "చూడు—బాగా చూడు, ఎవరు?"

ఆ ముగ్గుర్లో ఒకడు ఇట్టే దొరికిపోయాడు, నాగేష్ని చూస్తూనే ఉలికిపడి.

"ఇతనే, సార్" అన్నాడు నాగేష్.

లాల్ మిగిలిన ఇద్దర్ని పంపించేశాడు.

"వెల్, నీ పేరు?" అడిగాడు దొరికిపోయిన అతన్ని.

"స్వామి, సార్."

లాల్ అతన్ని సమీపించాడు. "ఉన్నదున్నట్లు

చెప్పేయ్. నిన్నటి మజాకా ఇప్పుడు సాగదు-నీ ఆటోలో భార్యాభర్తలు రాలేదనుకుంటాను?"

"లేదు, సార్. ఎవరో బక్క మనిషి వచ్చాడు. చెప్ప వద్దని యాభై ఇచ్చాడు. అతను ఎర్రషర్టు తెల్లప్యాంటులో వున్నాడు. ఆటో దిగి థియేటర్‌లో కెళ్ళాడు...."

లాల్ తలూపి కృష్ణన్ వైపు తిరిగాడు. "నిన్న మీరు జనార్థన్ ఫ్రెండ్స్ అందర్నీ చూశారు కదూ?"

"చూశాను."

"అందులో నల్లగా, బక్కగా రింగుల వెంట్రుకలతో ఎర్ర షర్టు తెల్లప్యాంటులో మీకెవరు కన్పించారు?"

కృష్ణన్ తల గోక్కున్నాడు. "ఎవరు కన్పించారు... ఆగండి.... శేఖర్ — శేఖర్!"

"అంతేనా?"

"అంతే."

"అతన్ని పిలిపించండి."

మరో అరగంట నిరీక్షణ తర్వాత కార్యక్రమం మొదలైంది. ఇద్దరు కాన్‌స్టేబుల్స్ శేఖర్‌ని పట్టు కొచ్చారు. అతను వస్తూనే అక్కడ నాగేష్‌నీ, ఆటో డ్రైవర్నీ చూసి గింజుకున్నాడు. అతన్ని లాక్కొచ్చి నిలబెట్టారు. అతనికి పాతికేళ్ళుంటాయి.

నాగేష్, ఆటో డ్రైవరూ అతన్ని గుర్తుపట్టి, "ఇతనే, సార్!" అన్నారు.

శేఖర్ గింజుకుంటూ వాళ్ళమీదపడి అరిచాడు. "మీరింత ద్రోహం చేస్తారా!"

## 11

కృష్ణన్ అతని మెడవంచి, వీపుమీద గుభీమని కొట్టాడు. "చెప్పు!"

శేఖర్ చెప్పసాగాడు....

"నిన్న ఉదయం జనార్ధన్ మీనుంచి తప్పించుకున్నాక నాకు ఫోన్ చేశాడు — జరిగింది క్లుప్తంగా చెప్పాడు. భార్యమీద పట్టరాని కోపం, కసి వెలిబుచ్చాడు. వాళ్ళిద్దరి గొడవలు నాకు బాగా తెలుసు. ఇంటి గుట్టు అలా రోడ్డెక్కించినందుకతను ఆమెకు తగిన బుద్ధి చెప్తానన్నాడు. ఆమెను కనిపెడుతూ వుండమని నన్ను కోరాడు. ఆమె ఎక్కడైనా ఒంటరిగా వున్నట్టు తెలిసే వెంటనే తనకు ఫోన్ చేయమన్నాడు. హోటలు గ్లామర్ నెంబరిచ్చాడు. తానక్కడుంటానన్నాడు. నేను అలాగేనని ఒప్పుకున్నాడు.

"అప్పుడే మెరుపులా నాకో ఆలోచన వచ్చింది. ఆ పరిస్థితిని నా కనుకూలంగా మలచుకోవాలనుకున్నాను. లాభం పొందాలనుకున్నాను. నాకు డబ్బు కావాలి. చాలా డబ్బు. విమ్మి నాకు వార్నింగిచ్చింది. నాల్గు రోజుల్లో బాగా డబ్బుతో నా క్వాలిఫికేషను నిరూపించుకోకపోతే రెడ్ సిగ్నలు ఇచ్చేస్తానంది. గుడ్ బై చెప్పేస్తానంది. అది నేను భరించలేను. ఆమె నా స్వీట్ గర్లు. శృంగారవతి. కేరాణి. రంగుల రమణి. ఆమె లేకుండా బ్రతకలేను—"

"నువ్విప్పుడు బ్రతకనవసరంలేదు" అన్నాడు కృష్ణన్.

"అప్పుడు బ్రతుకుతాననే చేశాను. బ్రతుకుమీద ఆశతోనే మనిషి యాక్షన్ లోకి దిగుతాడు. నేను యాక్షన్ లోకి దిగాను. జనార్ధన్ కిదంతా తెలియకుండా వుంటుంది. శశికళ కూడా అనుమానించదు. ఆమెనుంచి డబ్బు రాబట్టుకుని జనార్ధన్ ని చంపేస్తే నిజం బయటపడి అతన్నుంచి నాకు ప్రమాదం వుండదు. అలాగే చేశాను.

"నిన్న ఉదయం నాకతను ఫోన్ చేశాక నేనతని ఇంటికి బయల్దేరి ఆ ఉత్తరం వేశాను. ఆ ఉత్తరంలో జనార్దన్ దమ్మూరి గురించి అనుమానాలు తలెత్తకుండా గజిబిజిగా వ్రాశాను. అతను ఏ తొందర్లోనో అలా రాశాడనుకుంటారు. అది చెల్లిపోతుందనుకున్నాను.

"అనుకున్నట్టే నా అయిడియా ఫలించింది. ఆ ఉత్తరం బాగా పనిచేసింది. రాత్రి విమ్మిని డబ్బుకోసం జి.పి.ఓ.కి పంపి, నేను జనార్దన్‌కి ఫోన్ చేశాను. చేసి అతనింటివద్ద పోలీసు నిఘా లేదనీ, పది దాటాక శశికళ ఒంటరిగా ఇంటికొస్తుందనీ అతనికి టిప్ ఇచ్చాను. ఆ వెంటనే అతనింటికి బయల్దేరాను. అప్పుడు శశికళ ఇంట్లో లేదు. ఆ డబ్బు తీసుకుని రమ్మన్న చోటికి వెళ్ళింది. నేను కాంపౌండులోకి దూకి దాక్కున్నాను. అప్పుడు— పదింపావుకామె ఆటోలో వచ్చింది.

"విచిత్రమైన వేషంలో వుంది ఆమె! ప్యాంటూ షర్టూ వేసుకుంది. తలకి మఫ్లరు చుట్టుకుంది. గబగబా లోపలికొచ్చి, తలుపుతీసి ఇంట్లోకెళ్ళింది. అప్పుడే ఆమె వెనుక జనార్దన్ వచ్చేశాడు...."

"అప్పుడేం జరిగింది?"

"అతను లోపలికెళ్ళగానే అరుపులు వినపడ్డాయి! నేను పరుగెత్తుకొని వెళ్ళి కిటికీదగ్గరాగాను. అతడామె జడపట్టి, షర్టుపట్టి, ఏమిటీ వేషమని లాగుతున్నాడు. ఆమె అయోమయపడుతోంది. డబ్బెక్కడ వేసివస్తే ఇంటికెందుకొచ్చావని అడుగుతోంది. అతను విన్పించు కోవడంలేదు. ఉదయం చేసిన పనికి చంపుతానని కత్తి తీశాడు — ఆమె చెప్పేది అతను విన్పించుకునివుంటే డబ్బు విషయంలో మోసం అతనికి, ఆమెకు తెలిసి

పోయేది! నేను వెంటనే రంగంలో దూకాను. అతన్ని వెనక్కి లాగి, నా కత్తితీసి గుండెలో దింపాను—

"ఆ కత్తిని అలాగే వదిలేసి, అతని కత్తిని నా జేబులో వేసుకున్నాను. అతను కిందపడి చచ్చిపోయాడు. శశికళ భయంతో బిగుసుకుపోయింది. ఆమెను హెచ్చరించానప్పుడు. ఈ వ్యవహారం పొక్కితే ప్రాణాలుండవని. ఆమె భర్త ఎంతో ఇష్టంగా దింపాలన్న కత్తిని ఆమె గుండెలో దింపుతానని. ఆమె భర్తతో నాకు పాత కక్ష వుంది — ఆమె కతనితో బ్రతుకు దుర్భరంగా వుంది. కనుక ఇద్దరికీ న్యాయం జరిగింది, నోర్మూసుకోమన్నాను.

"వెంటనే బట్టలు మార్చుకుని పోలీసులకి ఫోన్ చేయమన్నాను. తను బయటకెళ్ళివచ్చి చూస్తే చచ్చిపడున్నాడని చెప్పమన్నాను. అంతకుమించి ఒక్క ముక్క మాట్లాడితే నేను జైలుకి పోవచ్చు. కానీ దావూద్ భాయ్ ఆమె ఏ కీలుకాకీలు విరిచేస్తాడు కిరాయి రౌడీల్ని పంపించి. దావూద్ భాయ్ నా గాడ్ ఫాదర్!"

"ఇప్పుడా గాడ్ ఫాదర్ నీ కీళ్ళే విరిచేస్తాడు చిక్కితే!"

"ఆ తర్వాత ఆక్కణ్ణుంచి నేను పారిపోయాను. వెళ్ళి విమ్మిని కలుసుకున్నాను. ఆమె ఆ డబ్బుని కలెక్టు చేసుకుంది. మజా చేసుకున్నాం. విమ్మి నా ప్రాపర్టీ అయిపోయింది! నేనామెకు పోలీసులూ, డిటెక్టివ్‌ల ప్రమాదం హెచ్చరించాను. శశికళ కూడా ఆ అనుమానంతోనే మారువేషంలో వెళ్ళింది. అది మేం వూహించినందువల్ల ఆమెను గుర్తుపట్టలేక విమ్మి ఆమె రాలేదనుకుందిట మొదట. అనుమానం తీర్చుకోడానికి

ఓసారి చెత్తకుండి ప్రక్కనుంచి వెళుతూ బస్సెక్కింది. కొంత దూరంవెళ్ళి మళ్ళీ తిరిగి వచ్చింది. అప్పటికి జన సమ్మర్దం బాగా తగ్గింది. అక్కడెవరూ అనుమానా స్పదంగా కనిపించకపోతే, కుండీలో కెలికి ఆ ప్యాకెట్ తీసుకుంది...."

లాల్ తలూపాడు. "అవును, ఆమె మొదట ఆ కుండీలో ముక్కు చీది వెళ్ళి బస్సెక్కుతోంటే ఎవరో బాధ్యతగల పౌరురాలనుకున్నాను. అందరూ అలా పరి శుభ్రత పాటిస్తే నిజంగా మనదెంతో అందమైన నగర మవుతుందనుకున్నాను...."

"కానీ నేనిలా జరుగుతుందనుకోలేదు!" అన్నాడు శేఖర్ దీనంగా.

శేఖర్ నాగేష్‌వైపు తిరిగి కోపంగా అన్నాడు. "వీళ్ళ వల్లే జరిగింది....వీళ్ళు నాకు ద్రోహం చేశారు! డబ్బు తిన్నా మనుష్యుల్లో విశ్వాసం ఏర్పడడంలేదు— ఛ— నేనిప్పుడెవర్నీ నమ్మను!"

"నువ్విప్పుడెవర్నీ నమ్మనవసరంలేదు" అన్నాడు కృష్ణన్, అతన్ని సెల్ దగ్గరకి నడిపిస్తూ.

అపరాధి ఏడడుగులు నడిచి యావజ్జీవాశ్రమం స్వీక రించాడు.

—:ఐ పో యిం ది:—

# కోటి సారంగాలు

## మోహన్

మధ్యాహ్నం పన్నెండు గంటలయింది.

ఉదయం ఎనిమిది గంటలనుంచి కొండ ఎక్కుతున్నాము. ఆరు గంటలకు కర్నూలు నుండి రామప్పపాలెం వచ్చి అక్కడ మా లగేజ్ మోసేందుకు ఇద్దరు కూలీలను కుదుర్చుకున్నాము. ఆ కొండల్లో 'కోసారంగ్' అని పిలువబడే కోటి సారంగాలను కనిపెట్టాలనేదే మా మిత్ర బృందం ధ్యేయం.

ఆ వూరివాళ్ళను కొద్దిమందిని అడిగాం కాని వారెవరికి "కోసారంగ్" ఎక్కడుందో తెలియదన్నారు. పైగా అది చాలా భయంకరమైన సారంగమని దాని జోలికి పోవద్దని భయపెట్టారు. కాని నాతోపాటు నా స్నేహితులు అరుణ్, ఇస్మాయిల్, క్రిష్ణ కూడా ఉత్సాహవంతులు కాబట్టి మా దృఢ నిశ్చయాన్ని మార్చలేక పోయారు. నలుగురం ఉద్యోగస్థులం. 'కోసారంగ్' గురించి విని వారంరోజులు సెలవురావటంతో సాహస

యాత్రకు పూనుకున్నాము.

"మోహన్, మనమిక్కడ కొద్దిసేపు రెస్టు తీసుకుంటే బాగుంటుంది, కాళ్ళు పీకుతున్నాయి" నసిగాడు ఇస్మాయిల్.

"ఆల్ రైట్, మనం నాలుగు గంటలు నడిచాము. ఆ కనిపించే చెట్టుక్రింద భోజనం చేసి ఒక గంట రెస్టు తీసుకుందాము" అన్నాను ఒక చిన్న మర్రిచెట్టువేపు నడుస్తూ.

కొండ మేమింకా అరభాగం కూడా ఎక్కలేదు. ఇప్పటివరకూ కొండ ఎక్కేందుకు అనుకూలంగానే వుంది. అక్కడక్కడా చిన్నచిన్న చెట్లున్నాయి.

రెండు పెద్ద సంచులలో తెచ్చిన మా లగేజ్ విప్పారు, మా వెంట వచ్చిన గంగన్నా, మస్తాన్‌లు. ఒటానీల డబ్బాలు, సీల్డుమీట్ టిన్స్ ఓపెన్ చేసి వాటిని ఉడకబెట్టి మసాలా వేసి చపాతీలు చేసారు. మాతో ఆరు పెద్ద వాటర్ బాటిళ్ళ నిండా నీరు తెచ్చుకున్నాము. కొండలో అక్కడక్కడా చిన్న సెలయేర్లున్నందున మాకు నీటిబాధ లేదు.

భోజనం చేసి అరగంట ఆ చెట్టుక్రింద కూర్చున్నాము. తరువాత తిరిగి ప్రయాణం సాగించాము.

సాయంకాలం ఐదుగంటలయేసరికి కొండ మూడు వంతులు ఎక్కేశాము. దారిలో మాకు ఎటువంటి సారంగాలు కనిపించలేదు. కాని మేము నిరాశ చెందలేదు.

"సూర్యుడు అస్తమించేలోగా ఒక చదునయిన ప్రదేశం చూసి ఈ రాత్రికి అక్కడ మకాం వేద్దాం" అన్నాడు కిట్టూ. క్రిష్ణను మేమంతా 'కిట్టూ' అని పిలుస్తాము.

పావుగంట నడిచాక ఒక పెద్ద గుట్ట వెనుక మూడె గజాల చదునయిన ప్రదేశం కనిపించింది. అక్కడ చిన్న కాన్వాస్ టెంట్ వేశాం.

అరుగంటలయేసరికి మెల్లగా చలిగాలి మొదలయింది. ఆ రాత్రికి గంగన్న బీన్స్ గింజలు ఉడకబెట్టి, మాంసం వేపుడు చేసాడు. ఎనిమిది గంటలకు భోంచేసి, రేపు ఏ ప్రక్క బయలుదేరాల్సింది ఒక అరగంట మాట్లాడుకుని నిద్రకుపక్రమించాము.

మేము మాతో రెండు డబుల్ బారల్ గన్స్, నాలుగు డాగర్ లు తెచ్చుకున్నాము. వాటిని పక్కలో వుంచుకొని పడుకున్నాము. ఉదయంనుంచీ నడచినందువల్ల కొద్దిసేపటికి నాకు నిద్రపట్టింది.

## 2

ఏదో శబ్దం వినిపించి హఠాత్తుగా ఉలిక్కిపడి నిద్ర లేచాను.

కొద్దిసేపటివరకూ నాకు అంత హఠాత్తుగా ఎందుకు మెలకువవచ్చిందో తెలియలేదు. చేతికున్న గడియారం చూసాను. రాత్రి రెండుగంటలయింది.

మళ్ళీ ఆ శబ్దం వినిపించింది. ఆ శబ్దానికే నాకు మెలకువ వచ్చింది.

టెంటు బయట చలిమంట కాచుకుంటున్న గంగన్న పరిగెత్తుతూ టెంటులోకి వచ్చాడు.

"దొరా పులి గాండ్రింపు విన్నారా. కొద్దిసేపట్లో ఈ ప్రాంతానికి పులి వస్తుంది. ఈ కొండ చుట్టుపక్కల పులులు ఎక్కువగా వున్నాయి. ఆ పులితోపాటు ఇంకొన్ని పులులు కూడా రావచ్చు" గాభరాగా వణుకుతూ చెప్పాడు గంగన్న.

ఇంతలో మరోసారి దగ్గరలో పులి గాండ్రింపు వినపడింది. ఆ శబ్దానికి కిట్టూ లేచాడు.

"మోహన్ ఏమిటా చప్పుడు?" బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ అడిగాడు.

"పులి — మనమున్న చోటుకే వస్తున్నట్లుంది. ఈ గన్ తీసుకుని లోడ్ చెయ్" చెప్పాను, నేను రెండవ గన్ లోడ్ చేస్తూ.

అలికిడికి అరుణ్, ఇస్మాయిల్, మా ఇంట్లో నౌకరు మస్తాన్ లేచి కూర్చున్నారు. వారు అడక్కముందే పరిస్థితి వివరించి జాగ్రత్తగా వుండమని హెచ్చరించి, తుపాకీ తీసుకొని టెంటు బయటికొచ్చాను. నా వెనుక కిట్టూ ఇంకొక తుపాకీతో వచ్చాడు.

"మోహన్ నీవు ఆ చెట్టు చాటున మాటు వెయ్యి, నేను ఈ రాయి చాటున నించుంటాను" అన్నాడు కిట్టూ టెంటుకు కొద్దిగా ప్రక్కనున్న ఓ చెట్టు చూపిస్తూ.

సరేనని, టెంటులో వున్న మిగతా వారిని కత్తులు పట్టుకుని జాగ్రత్తగా వుండమని హెచ్చరించి, ఇద్దరం చాటుకు వెళ్ళిపోయాం.

నిముషాలు గడుస్తున్నాయి. పులి వున్న అలికిడి లేదు. అంతా నిశ్శబ్దంగా వుంది. పులి గాండ్రింపు కూడా వినిపించడంలేదు. బహుశా, వేరే దారిలో వెళ్ళి వుంటుంది.

మరికొద్దిసేపు చూచి, టెంటువద్దకు వెళ్లామనుకొని ఒక అడుగు వేశాను. యధాలాపంగా టెంట్ వైపు చూసాను. అంతే— నా గుండె దడదడలాడింది. ఒక్క క్షణం భయంతో గుండె ఆగినట్లయింది.

టెంటు వెనుకనుండి పులి నెమ్మదిగా నడుచుకుంటూ

వస్తుంది. నా కళ్ళు చీకటికి అలవాటుపడ్డందుకు పులి ఆకారం స్పష్టంగా కనిపిస్తుంది. అది ఆరడుగుల పొడవు మూడడుగుల ఎత్తుతో ఏమాత్రం ఆత్రం లేకుండా హుందాగా నడుచుకుంటూ టెంటుకి పదడుగుల దూరంలో ఆగింది.

టెంటులో వున్నవారు పులి ముందునుంచీ వస్తుందని చూస్తున్నారు కాబట్టి వారికి పులి కనిపించలేదు. కిట్టూ పులిని చూసాడో, లేదో తెలియలేదు.

తుపాకి పులివైపు గురిపెట్టాను. ఆ చీకటిలో దాని తల స్పష్టంగా కనిపించడంలేదు. పులి కడుపుకు గురిపెట్టి ట్రిగర్ నొక్కాను.

నిశ్శబ్దముగా వున్న ఆ కొండల్లో తుపాకి పేల్చగానే శబ్దము గట్టిగా ప్రతిధ్వనించింది. గుండు సూటిగా పులి కడుపులో దూసుకుపోయింది.

పులి భయంకరంగా గాండ్రించింది. నేను రెండోసారి దానికి గురిపెట్టేలోగా అది తుపాకీ శబ్దాన్ని బట్టి నావైపు వురికింది.

రెండోసారి ట్రిగ్గర్ నొక్కాను. కాని నా గురి తప్పింది. పులి వేగంగా నావైపు వస్తోంది. వున్న రెండు గుళ్ళూ కాల్చాను. తిరిగి లోడ్ చేసే సమయంలేదు. పరిగెత్తే అవకాశం అసలేలేదు.

పులి అయిదు గజాల దూరంనుండి పంజా ఎత్తి గాలిలో కెగిరింది. ఇక నా పని అయిపోయిందనుకొని భయంతో కళ్ళు మూసుకున్నాను.

'ధన్'మంటూ తుపాకి పేలింది. గాలిలో కెగిరిన పులి కుప్పలా క్రిందికి పడింది. తుపాకి గుండు దాని తలలో దూసుకుపోయింది. అది గట్టిగా అరుస్తూ లేవ

బోయింది. ఇంతలో ఇంకొక బుల్లెట్ దాని ఎడమ కంటిలో దూసుకుపోయింది.

ఏమి జరుగుతుందో అర్థంకాక చూస్తున్న నాకు కిట్టూ గుండు చాటునుండి బయటకు రావటం కనిపించింది.

పులి కొద్దిసేపు గిలగిల తన్నుకొని నిర్జీవంగా పడి పోయింది.

టెంటునుండి అరుణ్, ఇస్మాయిల్, గంగన్నా, మస్తాన్‌లు బయటికి వచ్చారు.

కిట్టూ పులి తలను కాలితో అటూ ఇటూ ఆడించాడు. "చనిపోయింది. సారీ మోహన్ పులి రావటం చూడలేదు. పులి ఈ వైపునుండీ వస్తుందని చూస్తుండిపోయాను. ఏమైతేనేం, అపాయంనుంచీ తప్పించుకున్నాం" అన్నాడు నిట్టూరుస్తూ.

అంతలో, కొండలు మారుమ్రోగేట్లు అరుపులు విని పించాయి. ఈసారి ఒక పులి కాదు, అయిదారు పులుల గాండ్రింపులు నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ వినిపించాయి.

"దొరా పులుల మంద వస్తుంది. తుపాకీ కాల్పులు విని అవి మన ప్రక్క రావచ్చు. మనమెక్కడ దాక్కున్నా వాసనపట్టి చంపుతాయి. ఒకేసారి అయి దారు వస్తే వాటిని తుపాకులతో కూడా ఎదిరించలేము" గజగజ వణుకుతూ కాళ్ళు స్వాధీనం తప్పినట్లు కూల బడ్డాడు గంగన్న.

ఈసారి పులి అరుపులు ఇంకా దగ్గర్లో వినిపించాయి.

"దొరా, మనం ఇక్కడినుంచి ఎంత త్వరగా బయ ల్దేరితే అంత మంచిది. అక్కడున్న చచ్చిన పులినిచూస్తే మనకోసం వెంటపడవచ్చు" అన్నాడు మస్తాన్ వంట సామాన్లు సంచిలో సర్దుతూ.

"క్విక్, త్వరగా సామాన్లు సర్దండి. అరుణ్ కమాన్. మనిద్దరం టెంటు పాక్ చేద్దాం. మీరిద్దరూ వారికి సామాన్లు సర్దటంలో సాయపడండి" అంటూ టెంటు వైపు పరిగెత్తాను.

చకచకా మా లగేజంతా సర్దేశాం. టెంటు మడత వేసి బాగ్‌లో పెడుతూంటే, దగ్గర్లో ఒక పులి దిక్కులు దద్దరిల్లేలా గాండ్రించింది.

"దొరా, పులులు దగ్గరికొస్తున్నాయి, త్వరగా కదలండి" అంటూ సంచి నెత్తుకుని పరుగుతీశాడు మస్తాన్.

తలా ఒక సామాను తీసుకుని మేము ఆ చీకటిలో, రాళ్ళు, ముళ్ళూ తొక్కుకుంటూ, తన్నుకుంటూ పరుగు తీశాం. పరుగెత్తుతూనే నా వద్ద వున్న గన్ లోడ్ చేశాను.

ఏటవాలుగా వున్న కొండపై ఎక్కువ వేగంతో పరిగెత్తటం సాధ్యం కాలేదు. ఆ చీకటిలో జాగ్రత్తగా సాధ్యమయినంత వేగంగా కొండను ఎక్కసాగాము. అలా ఎంత దూరం నడిచామో తెలియదు. కాని భయం దెబ్బకు అలుపు, ఆయాసం తెలియటంలేదు.

సూర్యుడు అరుణకిరణాలతో తూర్పున ఉదయించే సమయానికి మేము కొండపైకి ఎక్కేశాము. కొండ ఎక్కేంతవరకూ మేము ఎవరమూ మాట్లాడుకోలేదు. ఎక్కడా ఆగలేదు.

"అమ్మయ్యా, ఎలాగయితేనేం కొండ ఎక్కాము. ఆ పులులను తలచుకుంటే నా గుండె యిప్పటికీ దడదడలాడుతుంది" అన్నాడు అరుణ్ ఒక చెట్టుకింద కూలబడుతూ.

గంగన్నా, మస్తాన్‌లు కొండ రాళ్ళపై గొంతు కూర్చుని బీడీలు వెలిగించారు.

"గంగన్నా, నువ్వు ఈ కొండ ఎప్పుడూ ఎక్క లేదా?" అడిగాను సిగరెట్ పొగ వదులుతూ.

"ఎందుకు ఎక్కలేదు బాబూ, నా చిన్నతనంలో నేను గొర్రెల మందలను ఈ కొండలమీదనే మేపే వాణ్ణి. కాని కొండ చివరి వరకూ ఎక్కడం ఇదే మొదటిసారి. అప్పట్లో ఈ కొండల్లో పులులు తోడేళ్ళు లేవు. పదేళ్ళ క్రితం మొదటిసారిగా గొర్రెలు కాస్తున్న ఇద్దరు కుర్రాళ్ళను పులులు చంపాయి. అది చూసి మిగతా పిల్లలు భయపడి అరచుకుంటూ ఊళ్ళోకి పరి గెత్తుకొచ్చి చెప్పారు. కత్తులూ, కటార్లు తీసుకుని మేము వెళ్ళేసరికి వాళ్ళ ఎముకలు తప్ప ఇంకేమీ మిగల లేదు. అప్పటినుంచీ ఈ కొండల దరిదాపులకు కూడా రావడం మానేశాము. ఏదో మీరిస్తున్న డబ్బుకు ఆశపడి, మీ దగ్గర తుపాకులున్నాయన్న ధైర్యంతో నేను మీ వెంట వచ్చామేకాని, ఈ కొండల్లో వున్న క్రూర జంతువుల గురించి తెలియక కాదు బాబు" అన్నాడు గంగన్న తుండుగుడ్డతీసి ముఖం తుడుచుకుంటూ.

"అయితే ఈ కొండల్లో తిరిగానంటున్నావు కదా, నీకు ఆ సొరంగం గురించి ఏమీ తెలియదా?" కుతూ హలంగా అడిగాను.

"తెలీదు బాబు, కోసొరంగ్ చేరుకోవాలంటే ఈ కొండ అవతలివైపుకు దిగాలి అంటుండగా విన్నాను. ఆ సొరంగాన్ని బయటినుండి చూసినవారే చాలా తక్కువ. దానిలో కోటి దారులున్నాయని మా తాతలు చెప్పే వారు. అందుకే ఆ సొరంగాన్ని 'కోసొరంగ్' అని

పిలిచేవారట."

"అయితే మనం కొండ ఎక్కాం కదా, ఈ రోజు ఆ ప్రక్కనుండి దిగి వెతుకుదాం. మన అదృష్టం బాగుంటే ఒక్క రోజులో ఆ సొరంగం కనపడవచ్చు. మస్తాన్ త్వరగా టిఫిన్, టీ చేసివ్వు, ఓ గంట రెస్టు తీసుకుని బయలుదేరుదాం" అన్నాను ఒక కొండరాతి పై కూర్చుంటూ.

## 3

ఉదయం ఎనిమిది గంటలవరకూ విశ్రాంతి తీసుకుని తిరిగి ప్రయాణం సాగించాము. కొండ అవలివైపుకు దిగ నారంభించాము.

మేము ఎక్కినవైపుకన్నా దిగేవైపు కొండ చాలా ప్రమాదకరంగా వుంది. ముళ్ళచెట్లు గుబురులు, గుబురులుగా వున్నాయి. కొండ కొన్నిచోట్ల నిలువుగా వుంది. అలాంటిచోట తాళ్ళు కట్టుకుని దిగవలసి వచ్చింది.

కొండ దిగుతూ సొరంగం కోసం వెతుకుతున్నాము. ఎక్కేటప్పుడు ప్రయాణం జరిగినంత వేగంగా దిగేటప్పుడు జరగడంలేదు.

మా ముందు నడుస్తున్న మస్తాన్ వున్నట్టుండి ఆగి పోయాడు.

"బాబుగారు ఇటు చూడండి" నిలబడిన చోటునుండి క్రిందికి చూపిస్తూ అన్నాడు.

"ఏమిటి?" అంటూ అరుణ్ ముందుకు వెళ్లాడు. వెనకనే నేను వెళ్ళాను. క్రిందికి చూస్తూనే నా కళ్ళు గిర్రున తిరిగాయి.

"ఓ మై గాడ్, ఎన్ని పాములు!!" శాస్త్రి వెనక్కు

జరిగి వణుకుతూ అన్నాడు అరుణ్.

మేము నించున్న చోటుకు పది, పదిహేను గజాల క్రింద కొద్దిగా చదును ప్రదేశం వుంది. ఆ ప్రదేశంనిండా కొన్ని వందల పాములు ఒకదానిపై ఒకటి పడి పొర్లుతున్నాయి. ఆ పాములు రకరకాల రంగుల్లో వున్నాయి. అడుగునుండీ పదడుగుల వరకూ వున్న ఆ పాములు మెలికలు తిరుగుతూ పొర్లుతుండటం చూస్తూంటే ఎలాటి వారికైనా భయం కలుగక మానదు.

"నా జీవితంలో ఇంత భయంకరమైన దృశ్యం చూడలేదు" తడి ఆరిపోయిన గొంతుతో అన్నాడు ఇస్మాయిల్.

"కమాన్, మనమిక్కడుండడం ప్రమాదం. పాములు మనల్ను గమనించితే పైకి ప్రాకి రావచ్చు. త్వరగా వేరే త్రోవలో కొండ దిగుదాం" అన్నాడు కిట్టూ.

"దొరా! మనం ఈ దారిలో తప్ప మరే దారిలో కొండ దిగలేం. అటు చూడండి, ఎటు చూసినా కొండ నిలువుగా వుంది. దట్టంగా ముళ్ళచెట్లు ఆక్రమించుకున్నాయి. ఒకవేళ ఈ చెట్లు నరుక్కుంటూ దారి చేసుకు వెళ్ళినా, ఒక్క అడుగు పక్కకు పడితే అగాథంలో పడిపోతాం. అందునా ఆ ముళ్ళపొదల్లో కూడా పాములుండవచ్చు" అన్నాడు గంగన్న నిరుత్సాహంగా.

"అయితే, ఇప్పుడేమి చేద్దాం? వచ్చిన దారిలో వెనక్కు వెళ్దామా?" అన్నాడు అరుణ్.

"వెనక్కు వెళ్ళే ప్రశ్నలేదు. ఇక్కడ్నుంచి ఎలాగోలా ముందుకు వెళ్ళాల్సిందే. కావలిస్తే ఆ పాములను చంపయినా మనం ముందుకు పోవాలి" దృఢంగా అన్నాడు కిట్టూ సిగరెట్ అంటిస్తూ.

"ఇది చీమల పుట్ట కాదు కాలితో నలపడానికి. ఇన్ని పాములను మనం ఎలా చంపగలం" చిరాగ్గా అన్నాను పాములను చూస్తూ.

"దొరా, ఇవి సామాన్యమైన పాములు కావు. వీటిని జిగట పాములంటారు. ఇవి చాలా భయంకరమైన విష సర్పాలు. ఇవి గాలిలో ఎగిరి తోకపై నిలబడగలవు. ఈ పాములెప్పుడూ గుంపులు గుంపులుగా వుంటాయి. వాటికేదైనా అపకారంచేసి వాటి కళ్ళలో పడ్డామంటే మనలో ఎవరూ ఇక్కడినుండీ ప్రాణాలతో పోలేరు" మస్తాన్ భయంగా అన్నాడు.

"ఆల్ రైట్ మనం వెనక్కు వెళ్ళే ప్రశ్న లేదు. ఈ పాముల్ని చంపి ముందుకు పోలేము. ఈ కొండ దిగేందుకు ఇది తప్ప ఇంకేదారి లేదు. అయితే ఇప్పుడేమి చేద్దాం?" పాముల విన్యాసాలు గమనిస్తూ అన్నాడు ఇస్మాయిల్.

"ఇలా ఇక్కడ కూర్చునేకంటే ఎక్కడైనా దారి వుందేమో ప్రయత్నించడం మంచిది. మనం ముళ్ళ పొదలను నరుకుంటూ పోదాం. ఎక్కడయినా దిగేందుకు దారి కనిపించకపోదు" అని లేచాను.

శబ్దం కాకుండా మేము వచ్చిన దారిన కొంతదూరం కొండ ఎక్కి అక్కడినుంచీ ముళ్ళపొదలను నరుక్కుంటూ పక్కలకు నడిచాం.

ప్రక్కగా ఎంత దూరం వెళ్ళినా దిగేందుకు అనువయిన మార్గం కనిపించలేదు. అప్పటికే సూర్యుడు నడినెత్తినకొచ్చాడు.

కొంచెం చదునయిన ప్రదేశం చూసుకుని ముళ్ళచెట్టు చాటున మకాం వేశాం. గంగన్న మస్తాన్ వంట చేయసాగారు.

ఇస్మాయిల్ సిగరెట్ అంటించాడు. "ఇలాగయితే మనం ఆ సొరంగాన్ని చేరినట్లే. ఇప్పటికి ప్రొద్దుటినుండి కష్టపడి దిగినదానిలో సగం దూరం పైకెక్కాము. ఇలాగే ఇంకొంత సేపు ప్రయాణిస్తే తిరిగి కొండపైకి చేరు కుంటాము. ఎలాగోలా సాయంత్రం లోపల కొండ దిగే దారి కనిపెట్టాలి" అన్నాడు.

"నిజమే, మనం ప్రొద్దుటినుంచీ చేసిన ప్రయాణ మంతా వ్యర్థమయింది. కాని క్రిందికి దిగటం ఎలా?"

"ఒక అయిడియా. ఆ కనిపించేచోట ముళ్ళపొదలు ఎక్కువగా లేవు. ఈ కొండపైన ఏ పెద్ద చెట్టుకో తాడు కట్టి దాన్ని పట్టుకుని క్రిందకు దిగుదాం, ఏమంటారు?" ఉత్సాహంగా అన్నాడు కిట్టూ.

"ఓ మై గాడ్, నీకేమైనా పిచ్చెక్కిందా. ఇక్కడి నుండి క్రిందికి దాదాపు నూరడుగుల లోతుంది. మనవద్ద నూరడుగుల తాడయితే వుండవచ్చుకాని, అది కొండలు దిగేందుకు పనికివచ్చేదికాదు. మధ్యలో తాడు తెగిపోతే? తాడు తెగకున్నా నూరు అడుగులు ఏ అధారం లేకుండా గాలిలో వూగుతూ క్రిందికి దిగడమంటే మాటలుకాదు" అగాధాన్ని చూస్తూ నమ్మలేనట్లు అన్నాడు అరుణ్.

"అంతకు మించి వేరే దారిలేదు....మనం తెచ్చిన తాడు నైలాన్ తాడు కాకున్నా చాలా గట్టి తాడు, సులభంగా తెగదు. తాడుకు అక్కడక్కడా ముడులు వేస్తే దిగడానికి అనువుగా వుంటుంది. కొద్దిగా కష్టపడితే సాయంత్రానికంతా మనం క్రింద వుంటాము" అన్నాను ఉత్సాహంగా.

ఎవరూ మాట్లాడలేదు. అందరూ ఆలోచనలలో మునిగిపోయారు.

అంతలో భోజనం తయారయిందని పిలిచాడు గంగన్న. భోజనం ముగించి ఒక గంట విశ్రాంతి తీసుకున్నాము.

మధ్యాహ్నం రెండు గంటలకు మా లగేజంతా పాక్ చేశాము. మేము దిగాలనుకున్న ప్రదేశం చుట్టుపక్కల వున్న ముళ్ళచెట్లను, పొదలనూ మస్తాన్ కత్తితో నరికేసాడు.

నేను బాగ్ లోంచి రెండు పెద్ద తాళ్ళు తీసాను. అవి ఒక్కొక్కటి వంద అడుగుల పొడవున్నాయి. వాటి రెంటిని కలిపి గట్టిగా ముడివేశాను.

తాడును కట్టడానికి దరిదాపుల్లో పెద్ద చెట్లేవీ కనిపించలేదు. అయిదు అడుగుల దూరంలో ఒక పెద్ద కొండరాయి వుంటే, దానికి తాటిని బలంగా కట్టాను. మేమంతా కలిసి ఆ తాటిని లాగిచూశాం. ఆ రాయి కదలలేదు. తాడు కూడా గట్టిగానే వుంది.

తాడు మెల్లగా లోయలోకి విడిచాము. అది క్రింది వరకూ సరిపోయి యింకా మిగిలింది.

"ముందు నేను దిగుతాను. ఆ తరువాత లగేజి దింపి మీరు దిగండి" అన్నాడు కిట్టూ.

తాటిని రెండుసార్లు గట్టిగా లాగి, మెల్లగా లోయలోకి కాళ్ళు విడిచి రెండు చేతులతో తాడు పట్టుకున్నాడు.

బరువు పడగానే తాడు కటకటమంటూ కొద్దిగా సాగింది. అందరం ఊపిరి బిగబట్టి చూస్తున్నాము. భయం లేదన్నట్లు తల వూపి మెల్లగా క్రిందికి దిగసాగాడు కిట్టు.

గాలిలో తాడు అటూ, ఇటూ వూగుతూ ముళ్ళ పొదలను తాకుతుంది. కిట్టూ సగం దూరంవరకు ఏకబిగిన

దిగి, తాటిముడిని కాలివేళ్ళమధ్య పట్టుకుని కొద్దిసేపు నిలుచుండిపోయాడు. అంత ఎత్తునుండీ దిగాలంటే చేతుల్లో బలం వుండాలి.

కిట్టూ నిమిషం తరువాత తిరిగి దిగనారంభించాడు. ఏ ఆటంకం లేకుండా లోయలోకి చేరి ఒక పెద్ద రాయి పైన నిలబడి తాటిని వూపాడు. కిట్టూ మా కళ్ళకు చాలా చిన్నగా అస్పష్టంగా కనిపిస్తున్నాడు.

మస్తాన్ తాటిని పైకి చేదాడు. నేను తాడు ఎక్కడన్నా దెబ్బతినిందేమోనను చూశాను. ఎక్కడా దెబ్బ తినలేదు.

తాటి చివర మా లగేజివున్న రెండు సంచుల్లో ఒక దాన్ని కట్టి మెల్లగా అందరం కలిసి లోయలోకి విడిచాము. లోయలో దాన్ని కిట్టూ విప్పుకున్నాడు. అలాగే రెండవ సంచి కూడా పంపాము.

"మస్తాన్ ఈసారి నువ్వు దిగు" అన్నాను.

మస్తాన్ తాటిని గట్టిగా గుంజి, కొండ రాతికి నమస్కరించి దిగసాగాడు. ఎంతో అనుభవమున్నవాడిలా ఎక్కడా ఆగకుండా చకచకా దిగి రెండు నిమిషాల్లో లోయ చేరుకున్నాడు. తరువాత గంగన్న దిగాడు. మస్తాన్, గంగన్నలు నలభై ఏళ్ళు పైబడిన వాళ్ళు. వారిద్దరూ ఎంతో సునాయాసంగా క్రిందకు దిగారు.

"ఈసారి నేను దిగుతాను" అని తాడును పట్టుకున్నాడు ఇస్మాయిల్. ఇస్మాయిల్ సగం దూరం దిగాక తాడును కట్టిన కొండరాతికేసి చూసాను. అక్కడ కనిపించిన దృశ్యానికి నా వళ్ళు భయంతో జలదరించింది.

"అరుణ్" గట్టిగా అరిచాను ఆ రాతివైపు వురుకుతూ.

దిగేటప్పుడు తాడు అటూ ఇటూ వూగటంవలన రాతికి రాసుకుంటూ తాడు సగం తెగివుంది. ఇంక రెండే రెండు పోరలున్నాయి. ఏ క్షణానయినా తాడు తెగవచ్చు.

"అరుణ్, ఆ తాటిని గట్టిగా పట్టుకో" కంగారుగా అరిచాను.

తెగిన తాటికి కొద్దిముందర ఇద్దరం కలిసి తాటిని గట్టిగా పట్టుకున్నాము.

నా శరీరమంతా చెమటలు పడ్తున్నాయి. ఒకవేళ తాడు తెగితే మే మిద్దరం ఆ తాటిని ఆపగలమా? మాకు పట్టుకోనేందుకు ఏ ఆధారం లేదు. తాడు మా చేతినుంచీ జారితే ఇస్మాయిల్ లోయలో పడిపోతాడు. చూడ టానికి ఎముకలు కూడా మిగలవు.

రెండు నిమిషాలు అలా ఊపిరి బిగించి తాటిని పట్టు కున్నాం. కొద్దిసేపటికి మా చేతికి తాడు తేలికగా తగి లింది. నేను లోయలోకి తొంగిచూశాను. ఇస్మాయిల్ లోయలో గంగన్న పక్కన నిలబడి వున్నాడు. గండం గడిచినందుకు హాయిగా గాలి పీల్చుకున్నాను.

తాటిని పైకిలాగి తెగిన దగ్గరికి తాటిని తీసివేసి, తిరిగి బలంగా రాతికి కట్టాము. తాటిని లాగిచూశాం. గట్టిగానే వుంది.

"నేను దిగుతాను" అని నా జవాబుకు ఎదురు చూడ కుండా తాడు పట్టుకుని లోయలోకి జారాడు అరుణ్.

అరుణ్ సన్నగా గెడకర్రలా వుంటాడు. ఇంత ఎత్తు నుంచి జాగ్రత్తగా దిగగలడా అని అనుమానించాను. నా అనుమానం నిరాధారమయింది.

చకచకా సగందూరం దిగి అక్కడ కొద్దిసేపు నిలిచి,

సునాయాసంగా క్రిందికి దిగిపోయాడు.

చివరగా నేను మిగిలాను.

తాటిని ఒకసారి పరీక్షించి, నెమ్మదిగా లోయలోకి జారాను. పావు భాగం దిగాను. తాడు అటూ ఇటూ కదులుతోంది. ఒకవేళ తాడు ఇంతకుముందులా తెగితే పైన మోసేందుకు ఎవరూ లేరు. దేవుని పైన భారంవేసి దిగసాగాను.

కొండలు ఎక్కటం, దిగటం నాకు కొత్తకాదు. నేను కాలేజిలో N.C.C. లో వున్నాను. N.C.C. క్యాంపులలో ఎన్నోసార్లు కొండలను ఎక్కిదిగాను. కాని ఈసారెందుకో భయమేస్తుంది.

లోయలోకి దిగేసరికి నాకు కొద్దిగా ఆయాసం వచ్చింది.

"మోహన్, ఈ తాటిని ఇక్కడే వుంచి పోదామా" అడిగాడు కిట్టూ.

"అంతకంటే ఏమిచేయగలం, మనం లాగినా ఈ తాడు రాదు. వెళ్ళేప్పుడు కొండ ఎక్కేందుకు వుపయోగ పడుతుంది" అన్నాను కర్చీఫ్ తో ముఖం తుడుచుకుంటూ.

"అమ్మబాబోయ్, ఈ కొండను తాటితో వేరే ఆధారం లేకుండా ఎక్కడం నావల్లకాదు!" కొండ పైకి చూస్తూ అన్నాడు ఇస్మాయిల్.

కొండవైపు చూసాను. కళ్ళు గిర్రున తిరిగాయి. మేము కట్టిన తాడు మొదలు కనిపించటంలేదు. ఈ కొండను తాటితో ఎక్కటం అసాధ్యంగా కనిపించింది.

"సరే! ఆ సంగతి తరువాత చూద్దాం. ప్రస్తుతం మన కార్యక్రమము గురించి ఆలోచిద్దాం" అన్నాడు

సిగరెట్ వెలిగిస్తూ.

"గంగన్నా కొద్దిగా టీ తయారుచేసివ్వు" అన్నాడు కిట్టూ ఒక రాతిపైన కూర్చుంటూ.

కొండనీడ లోయలో పడుతుంది. చల్లగా గాలి వీస్తోంది. సూర్యుడు కనిపించటంలేదు. శరీరం ఆ వాతావరణంలో హాయిగా రిలాక్సయింది.

"మస్తాన్, ముందు సంచీల్లోనుండీ గన్స్ బయటకు తియ్యి" అన్నాను ఆ ప్రశాంతతనుండీ తేరుకుని.

"ఎందుకూ?" అడిగాడు కిట్టూ.

"ఏ సమయంలోనైనా ఇటువైపు క్రూరమృగాలు రావచ్చు. అందుకే అన్ని సమాయాలలో తుపాకి చేతిలో వుండటం మంచిది."

మస్తాన్ తుపాకులు తీసి ఇచ్చాడు.

కొద్ది సేపటికి గంగన్న చిన్న అల్యూమినియం కప్పులతో టీ తెచ్చి యిచ్చాడు. టీ తాగి అరుణ్ తప్ప అందరం సిగరెట్లు అంటించాము. అరుణ్ కు సిగరెట్ అలవాటులేదు.

"టైమెంతైంది దొరా!" గంగన్న అడిగాడు.

వాచ్ చూసాను. నాలుగున్నర అయింది. అప్పుడే లోయలో చీకట్లు ముసురుకుంటున్నాయి.

"ఈ రోజు మనం సారంగం వెతకలేము. ఈ రోజు రెస్టు తీసుకుని రేపు 'కోసారంగ్' అన్వేషణ ప్రారంభిద్దాం" అన్నాను.

"అవును. పొద్దుటినుండీ నడిచి, నడిచి కాళ్ళు పీకుతున్నాయి" కాళ్ళు జాడిస్తూ కిట్టూ అన్నాడు.

"ఈ ప్రశాంతతను చూస్తూంటే ఇక్కడినుండి వెళ్ళాలనిపించటంలేదు. పట్టణాలకు ఇక్కడికి ఎంత

లేదా. అక్కడ ఈ రమణీయమైన దృశ్యాలు, ఈ చల్ల గాలులు, ఈ నిశ్శబ్దత వుండవు" లోయ సౌందర్యం చూసి పరవశంగా అన్నాడు ఇస్మాయిల్.

నిజంగా లోయ ఎంతో రమణీయంగా వుంది. పెద్ద పెద్ద చెట్లు, పచ్చిక, రకరకాల పక్షుల కిలకిలలు. ఒక ప్రక్క పారుతున్న సెలయేరు ఎంతో మనోరంజితంగా వుంది.

"ఈ ప్రశాంతత వెనుక ఎన్ని విపక్రిములు, క్రూర జంతువులు వుంటాయో మీకు తెలీదు బాబు. జాగ్రత్తగా నడుచుకోకపోతే ఇలాంటి ప్రదేశాలలో ఒక్క రోజు కూడా బ్రతకలేము" కాళ్లు కడగటానికి సెలయేటివైపు పోతూ అన్నాడు మస్తాన్.

కమ్మగా వినిపిస్తున్న రకరకాల పక్షుల అరుపులు వింటూ అందరం ఆలోచనల్లో మునిగిపోయాం.

గంగన్న, మస్తాన్ కలసి టెంటు వేశారు.

ఆరుగంటలయేసరికి విపరీతంగా చలి మొదలయింది. గంగన్న అక్కడక్కడ ఎండు కట్టెలు ఏరి చలిమంట వేశాడు. అందరం మంటచుట్టూ కూర్చున్నాం.

ఏడుగంటలకల్లా భోజనం ముగించి, మా బాగ్‌లో వున్న దుప్పట్లు తీసికొని టెంటులో పడుకున్నాము.

చలికి మా దుప్పట్లు చాలటంలేదు. అయినా అలిసి వున్నందున వెంటనే నిద్రపట్టింది. ఆ రాత్రి ఎలాంటి అవాంతరాలు ఎదురవలేదు.

## 4

పక్షుల అరుపులకు నాకు మెలకువ వచ్చింది. అప్పుడు సమయం ఆరుగంటలు కావస్తుంది. లోయలో ఇంకా వెలుగు రాలేదు.

మస్తాన్, గంగన్న, ఇస్మాయిల్ టెంటు బయట చలిమంట ముందు కూర్చున్నారు. అరుణ్, కిట్టూ ఇంకా లేవలేదు.

నేను లేచి టెంటునుంచీ బయటకు వచ్చాను.

"రండి బాబూ" అంటూ కాస్త పక్కకు జరిగి కూర్చున్నాడు మస్తాన్.

చలిమంటముందు కూర్చుని మండుతున్న పుల్లతీసి సిగరెట్ వెలిగించుకున్నాను.

"మోహన్, ఇంతకూ మనం ఆ సారంగాన్ని కనుక్కోగలమంటావా!" మఫ్లర్ తలకు చుట్టుకుంటూ సందేహంగా అడిగాడు ఇస్మాయిల్.

"మనం అందుకోసమేకదా ఇంతదూరం వచ్చింది. ఈ లోయ చుట్టుపక్కల ఎక్కడో వుండివుంటుంది. జాగ్రత్తగా గమనిస్తూ పోతే దొరకవచ్చు. ఒకవేళ సారంగం కనపడకపోయినా నష్టంలేదు, కొన్ని రోజులు ఈ లోయ సౌందర్యాన్ని ఆస్వాదించి వెళ్ళిపోదాము."

ఇంతలో, అరుణ్ కిట్టూ లేచివచ్చారు.

అందరం టీ తాగి టవళ్ళు, సోప్ తీసుకుని సెలయేరు వైపు బయలుదేరాం. నేను టెంటునుంచి ఒక గన్ తెచ్చాను. సెలయేటికి నీటికోసం వచ్చిన ఏ క్రూర మృగాలయినా ఎదురుకావచ్చు. జాగ్రత్తగా వుండటం మంచిది.

సెలయేరు ప్రశాంతంగా పారుతుంది. నీరు వెచ్చగా వుంది. మొఖం కడుక్కుని టెంటువద్దకు తిరిగివచ్చాం.

పుల్కాలు, బటానీగింజల కూరతిని, కాఫీ తాగి లగేజ్ సర్దుకుని బయలుదేరేసరికి ఉదయం ఎనిమిదిగంటలయింది.

ముందు లోయ ఉత్తరపు దిక్కున బయలుదేరాం.

మేము లోనికిపోయేకొద్దీ దట్టమైన అడవి యెదురయింది. అలా చాలాదూరం నడిచాము. దారిలో రెండు సారం గాలు కనిపించాయి. కాని అవి అయిదుగజాలకే అంత మయ్యాయి. నిరాశ చెందకుండా అలాగే అన్వేషణ సాగించాము.

వాచ్ చూసేంతవరకూ మధ్యాహ్నం ఒంటి గంట అయిందని తెలియనేలేదు. చిక్కటి అడవి కావటంవలన సూర్యుడు కనిపించటంలేదు. అడవిలో వెలుగుమాత్రం వుంది. మా దారిలో ఒక చిన్న వాగు యెదురయింది.

ఆ వాగు పక్కన భోజనంచేసి, ఒక గంట రెస్టు తీసుకున్నాము. తిరిగి ప్రయాణం మొదలయింది.

"సారంగం కొండలో మలచబడిందని చెప్పావుకదా. ఒకవేళ దాని బిలం కూడా కొండ అంచుకే వుందేమో. మనం ఈ అడవిలో వెతికేబదులు, కొండ అంచున వెతుకుదాం" అన్నాడు అరుణ్.

దానికి అందరం అంగీకరించాం.

ఒక గంటసేపు నడిచి లోయకు ఒక ప్రక్కనున్న, కొండ అంచును చేరుకున్నాం. కొండ నిలువుగా ఎక్కేందుకు వీలుకాకుండా వుంది. కొండ అంచును అనుకుని నడవసాగాం.

అలా రెండు గంటలు కొండ అంచును పరిశీలిస్తూ నడిచాము. సాయంత్రం అయిదు గంటలయింది.

"మోహన్ అటు చూడు" గట్టిగా సంతోషంగా అరిచాడు కిట్టూ.

కిట్టూ చూపించినవైపు చూశాను. మాకు కొద్ది దూరంలో కొండకు పదడుగుల ఎత్తులో గుండ్రటి బిలం వుంది. అది దాదాపు ఆరడుగుల ఎత్తుంది. మనిషి సునా

యాసంగా దానిలో నడిచిపోవచ్చు.

"బాబయ్యా, అదే కోసారంగ్" ఉత్సాహంగా అన్నాడు గంగన్న.

"నీ కెలా తెలుసు గంగన్నా?"

"మా తాత చెప్పేవాడు బాబయ్యా, కోసారంగ్ బిలం దాదాపు ఆరడుగుల ఎత్తుంటుందని, అది భూమికి కాస్త ఎత్తులో వుంటుందని చెప్పేవాడు. మా తాతకు ఎవరో చూసినవారు చెప్పారట."

మస్తాన్ బీడి అంటిస్తూ అడిగాడు "సారంగ బిలం భూమికి పదడుగుల ఎత్తులో వుంది. ఆ సారంగాన్ని మీరు ఎలా చేరుకుంటారు?"

"అదేమంత పెద్ద పని కాదులే. ఇప్పటికే చీకటి పడింది. రేపు ఆ విషయం ఆలోచించవచ్చు. ముందు టెంటు వేయండి" అన్నాను.

అయిదు నిమిషాల్లో సారంగానికి పదిగజాల దూరంలో టెంటు వేశారు. మస్తాన్ టీ తయారుచేయసాగాడు.

టీ తాగుతూ రేపు ఈ సారంగ బిలంవరకు ఎలా ఎక్కవలసింది. సారంగంలో ఏమిచేయాల్సింది ఉత్సాహంగా మాట్లాడుకున్నాం.

"దొరా మీరు సారంగంలోకి పోయి తిరిగి ఎప్పుడు వస్తారు" అడిగాడు గంగన్న.

రామప్ప పాలెంలో గంగన్నను, మస్తాన్‌ను జీతానికి కుదుర్చుకున్నప్పుడే వారు సారంగం లోనికి రామని కచ్చితంగా చెప్పేశారు. ఆ సారంగం భయంకరమైనదని విన్నామని, కావలిస్తే మేము తిరిగి వచ్చేవరకూ సారంగ బిలంవద్దే వుంటాము కాని సారంగంలోనికి రాము అన్నారు.

"గంగన్నా మేము సారంగంనుంచీ రెండురోజులలో తిరిగివస్తాం. మీరు మా కోసం మూడు నాలుగురోజులు చూడండి అప్పటికే మేము తిరిగిరాకుంటే మీరు ఏదో ఒకదారిలో రామప్పపాలెం వెళ్ళిపోండి. మీకు ఒక తుపాకి విడిచిపోతాము" అన్నాను.

"అయితే మీకు తిరిగివస్తామన్న నమ్మకం లేదా బాబయ్యా" ఆశ్చర్యంగా నోరు తెరచి అడిగాడు మస్తాన్.

గట్టిగా నవ్వాడు కిట్టూ "పిచ్చివాడా, నమ్మకం లేకకాదు, ఒకవేళ మేము తిరిగిరావటం ఆలస్యమయితే మీరు వెళ్ళండి. మాకోసం ఎదురుచూస్తూ ఎన్నిరోజులని వుండగలరు. మేము తరువాత పాలెంలో కలుసుకుంటాం" అన్నాడు.

సరేనంటూ రాత్రికి వంటచేయటంలో నిమగ్నులయ్యారు.

'క్రోసారంగ్' కనుగొన్న సంతోషంలో వోల్టావరిన్ ఫుల్ బాటిలు ఖాళీచేశాం. నేను మాత్రం కొద్దిగా తీసుకున్నాను, రాత్రి ఏదైనా ఆపద ఎదురైతే రెడీగా వుండేందుకు. మేము తెచ్చుకున్న సీసాల్లో ఇంకా ఒకటి మిగిలింది.

## 5

ఉదయం ఎనిమిదిగంటలకల్లా కాలకృత్యాలు తీర్చుకుని, టిఫిన్ తిని రెడీ అయ్యాం.

అడవిలోనుండి పదడుగుల పొడవున్న రెండు పెద్ద కొమ్మలను నరికి తెచ్చాడు గంగన్న. ఆ రెండు కొమ్మలను కత్తితో శుభ్రంగా చెక్కి వాసాల్లా తయారుచేశాడు. ఆ రెండు వాసాలను దగ్గరగా పెట్టి అడ్డంగా చిన్నచిన్న

కట్టెలు పెట్టి అడవి తీగలతో బిగించాడు. అది నిచ్చెనలా తయారయింది.

మా దగ్గరున్న ఆహారంలో మస్తాన్‌కు గంగన్నకు అయిదురోజులకు సరిపడేలా యిచ్చి మిగిలినవి పాక్ చేసుకున్నాం. మేం వచ్చేటప్పుడు మాతో విటమిన్ టాబ్లెట్లు, నీరు దొరకనిచోట దప్పిక వేయకుండా వుండేందుకు కావలసిన టాబ్లెట్లు తెచ్చుకున్నాం. సారంగంలో ప్రయాణించేప్పుడు ఆహారం లైట్‌గా వుండాలని మాతో బ్రెడ్, బటర్, జామ్ టిన్నులు తెచ్చుకున్నాం.

టెంటును గంగన్న వాళ్ళకే యిచ్చేశాము. దానితో మాకికి పనిలేదు.

గంగన్నకు తుపాకి ఎలా కాల్చాలో నేర్పాను. కొన్ని తూటాలు, ఒక తుపాకి వారికిచ్చాను. వారికి ఇవ్వవలసిన నాలుగువందల రూపాయలకంటే వంద రూపాయలు ఎక్కువ యిచ్చాను.

"చూడు గంగన్నా, మేము మూడు రోజులలో సారంగంనుంచి తిరిగిరాకుంటే, మీరు మాకోసం ఎదురు చూడక వెళ్ళిపోండి. మా గురించి ఎలాంటి ఆదుర్దా పడవద్దు. మాకేవైనా ఆపదలు ఎదురైతే ఎదుర్కొనేందుకు సన్నద్ధంగా వున్నాము" అన్నాను గంగన్నతో.

"నాకేమిటో భయంగా వుంది బాబు. మీరు ఆ సారంగంలోకి వెళ్ళాలని ఎందుకింత పట్టుదలగా వున్నారో అర్థంకావటంలేదు" గంగన్న సారంగంవైపు దిగులుగా చూస్తూ అన్నాడు.

"పరవాలేదు, మాకే ఆపదా రాదు. మా గురించి దిగులుపడవద్దు!"

"సరే, మీ ఇష్టం బాబు" అని నిచ్చెన తీసి సారం

గానికి అనించారు మస్తాన్, గంగన్నలు.

మేము లగేజిని మోసేందుకు వీలుగా నాలుగు చిన్న బాగ్‌లలో సరదుకుని వీపుకు కట్టుకున్నాం. ముందు ఇస్మాయిల్ నిచ్చెన ఎక్కి సొరంగంలో అడుగుపెట్టి నిలబడ్డాడు. తరువాత అరుణ్, కిట్టూ ఎక్కారు.

"మూడు రోజులలో మేము రాకుంటే మీరు వెంటనే ఈ ప్రదేశం వదలి వెళ్ళిపొండి" చివరిసారిగా వారిని హెచ్చరించి, నేనూ నిచ్చెన ఎక్కి సొరంగ బిలంలో అడుగుపెట్టాను.

నిచ్చెన పైకి తీసుకుని సొరంగంలో ఒక మూల పెట్టాం. ఆఖరుసారిగా దిగులుగా చూస్తున్న గంగన్న మస్తాన్‌లకు చెయ్యి వూపి, సొరంగంలోనికి నడిచాం.

# 6

సొరంగం లోపల చమ్మగా వుంది. మా అందరి చేతుల్లో ఫైవ్ సెల్ టార్చిలున్నాయి. అందరివద్దా డాగర్‌లున్నాయి. నా భుజానికి డబుల్ బారల్ గన్ వ్రేళ్ళాడుతుంది.

సొరంగమంతా పక్షుల ఈకలు, దుమ్ముతో నిండివుంది. అందరి కాళ్ళకూ బూట్లున్నాయి కాబట్టి నడుస్తుంటే పెద్దగా చప్పుడవుతుంది. సొరంకం బాగా విశాలంగా వుంది. టార్చి వెలుగు ఎక్కువ దూరం ప్రసరించడంలేదు.

అందరం ఉత్సాహంగా ముందుకు సాగుతున్నాం. ఒక ఫర్లాంగ్ దూరం నడిచేసరికి సొరంగం వెడల్పు తగ్గిపోయింది. మేము ఒకరి వెనుక ఒకరం నడువవలసి వచ్చింది.

సొరంగం గోడలు కొద్దిగా తడిగా వున్నాయి. అదో రకమయిన ముగ్గిపోయిన వాసన వస్తుంది. అరగంటలో

దాదాపు మైలు దూరం నడిచాం. దారిలో యెలాంటి ప్రాణులూ యెదురవలేదు.

వున్నట్లుండి అరుణ్ ఆగాడు. "నా బూటు క్రింద ఏమిటో మెత్తగా తగిలింది" అని టార్చ్ క్రిందికి వేశాడు. నా బూటు కింద కూడా ఏదో మెత్తగా తగిలింది.

టార్చ్ వెలుతురులో కిందికి చూసాను. అంతే— ఒళ్ళు జలదరించింది. 'ఓ మై గాడ్' అంటూ యెగిరి పక్కకు దూకాడు అరుణ్ కంపరంగా.

మా కాళ్ళక్రింద అడుగు పొడవున్న పాముపిల్లలెన్నో తిరుగుతున్నాయి. మా కాళ్ళక్రిందపడి చాలా పిల్ల పాములు నలిగిపోయాయి.

నాకు సన్నగా వణుకు పుట్టసాగింది. వీటి తల్లి పాము దగ్గరలోనే వుంటుంది. చనిపోయిన పాముపిల్లలనుచూస్తే అది మా వెంట పడవచ్చు. ఒకవేళ ఈ సొరంగమంతా పాములున్నాయేమో.

"మోహన్, క్విక్! త్వరగా ముందుకు పద. ఇంకా ఇక్కడుంటే నాకు మూర్ఛవచ్చేలా వుంది" అరిచాడు కిట్టూ.

అందరం పరుగుతీసాం. మా బూట్ల శబ్దం సొరంగంలో ప్రతిధ్వనిస్తోంది. మేము పరిగెడుతున్నా మా కాళ్ళక్రింద పడి చస్తున్నాయ్ పాము పిల్లలు. ప్రాణ భయంతో అలా రెండు ఫర్లాంగులు పరిగెత్తాం.

ఇప్పుడు కాళ్ళక్రింద ఏమీ తగలటంలేదు. ఆగి టార్చ్ వేసి చూసాను. దరిదాపులో, కనుచూపుమేరలో పాములులేవు.

"గుడ్ గాడ్, యెంత ఆపద తప్పించుకున్నాం"

గుండెపైన చేయి వేసుకుంటూ అన్నాడు కిట్టూ

"ఆ పాము పిల్లలను తలచుకుంటే ఇప్పటికీ నాకు కంపరమెత్తుతుంది" అన్నాడు అరుణ్.

"పాములంటే నాకు భయంలేదు. కాని మనవల్ల ఎన్ని పాముపిల్లలు చనిపోయాయి. మనం కొద్దిగా జాగ్రత్తగా నడవవలసింది" చివింగం నోట్లో వేసుకుంటూ అన్నాడు ఇస్మాయిల్.

"ముందు మనం చావనందుకు సంతోషించు, తరువాత తరువాత తీరిగ్గా జాలి చూపుదువుగానిని" అన్నాను విసుగ్గా.

ఇప్పుడు అందరం టార్చ్ వెలుగులో క్రింద చూసుకుంటూ నడుస్తున్నాం. అలా దాదాపు అయిదుమైళ్ళు నడిచివుంటాము, రేడియండైలు వాచ్‌లో టైం చూసాను. మధ్యాహ్నం రెండుగంటలు కావస్తోంది.

అక్కడ కాసేపు రెస్టుతీసుకోవాలని నిర్ణయించుకున్నాం. అందరం జాగ్రత్తగా చుట్టూ పరీక్షించి క్రింద కూర్చున్నాము.

మా బాగ్‌లనుండి బ్రెడ్, బటర్ బయిటకు తీసి రెండు స్లైయిజులు తిన్నాము.

"యెవరూ యెక్కువ తినకండి. ఇలాంటి ప్రయాణాలలో ఆహారం ఎంత లైట్‌గావుంటే అంత మంచిది" అన్నాను విటమిన్ టాబ్లెట్లు నోట్లోవేసుకుంటూ, ఆ టాబ్లెట్లవలన ఆకలి బాధ తగ్గి ఒంట్లో శక్తి వస్తుంది. దాహం కూడా కాదు. అందరూ టాబ్లెట్లు మింగారు.

అరగంట అక్కడ కూర్చుని తిరిగి బయలుదేరాం.

"మనం యెంతదూరం నడిచినా ఈ సొరంగం తరిగేలా లేదు" వీరసంగా లేచి నిలబడుతూ అన్నాడు అరుణ్.

"అప్పుడే అంత నిరుత్సాహపడితే ఎలా. ఇలాంటి అడ్వెంచర్లకు యెంతో ఓపికా, ఉత్సాహం అవసరం" కిట్టూ అన్నాడు సముదాయింపుగా.

"గంగన్న ఈ సొరంగంలో చాలా దారులున్నాయన్నాడుకదా. ఈ దారితప్ప వేరే దారి కనబడదేం!" కాళ్ళీడ్చుకుంటూ నడిచాడు ఇస్మాయిల్.

"ముందుముందు కనపడవచ్చు. ఇప్పుడు మనం వచ్చింది దాదాపు ఆరుమైళ్ళే కదా" అన్నాను.

"రానురాను ఆక్సిజన్ పర్సంటేజ్ గాలిలో తగ్గుతుంది" అన్నాడు కిట్టూ.

సాయంత్రం అయిదు గంటలవరకూ అలా నడుస్తూనే వున్నాం. యెంతదూరం నడిచినా సొరంగం తరగలేదు. సొరంగంలో పోనుపోను ఆక్సిజన్ తగ్గిపోసాగింది.

ముందు నడుస్తున్న కిట్టూ టక్కున ఆగిపోయాడు.

"మోహన్, సీ హియర్, యిక్కడ సొరంగం రెండుగా చీలింది" అన్నాడు.

నా టార్చ్ ఫోకస్ చేసి చూశాను. దక్షిణంవైపు ఇంకొక దారి కనిపించింది. అది సన్నగా ఒక మనిషి పట్టేంతగా వుంది.

"మనం ఇప్పుడు ఏ దారిలో వెళ్ళాలి" కొత్త దారిని చూస్తూ అన్నాడు అరుణ్.

రెండు నిమిషాలు ఏమీ నిర్ణయించుకోలేక అలాగే నిలుచున్నాం.

"మీరు ఆలోచించుకుని చెప్పండి. నా కాళ్ళు పీకుతున్నాయ్" అంటూ క్రింద సొరంగం గోడను ఆనుకుని కూర్చున్నాడు ఇస్మాయిల్.

"అమ్మా!" ఇస్మాయిల్ అరుపుతో సొరంగమంతా

దద్దరిల్లి పోయింది. కంగారుగా మగ్గునం ఇస్మాయిల్ వైపు చూశాం. క్రిందపడి పొర్లుతున్నాడు.

"పాము కరచినట్లుంది. చుట్టూ వెతకండి" అరిచాను ఇస్మాయిల్‌ను పైకి లేవదీస్తూ. ఇంకా బాధగా మూలుగుతున్నాడు. ఇస్మాయిల్‌ను కూర్చుపెట్టేందుకు వీపుపైన చెయ్యివేశాను. వెంటనే గట్టిగా అరచి చెయ్యి వెనక్కు తీసుకున్నాను.

"ఏమిటి?" అడిగాడు కిట్టూ ఆత్రతగా.

నా చేతిలో ఒకేసారి వంద సూదులు గుచ్చినంత బాధ కలిగింది. ఇస్మాయిల్ వీపుపైన టార్చివేశాను.

నా ఒళ్ళు జలదరించింది. ఇస్మాయిల్ వీపుపైన షర్టుకు తగులుకుని వందలకొద్దీ గొంగళిపురుగులున్నాయి. ఆకారం గొంగళి పురుగులా వున్నా వాటి తల మాత్రం పసుపు రంగుతో పెద్దగా వుంది. వాటి వెంట్రుకలు అంగుళం పొడవుగా సూదుల్లా వున్నాయి.

ఇస్మాయిల్ ఆనుకున్న సొరంగపు గోడకు టార్చ్ వేశాను. లక్షలకొలది గొంగళిపురుగులు గోడపైన పరుచుకొని వున్నాయి. కనుచూపుమేరకు గోడంతా దట్టంగా గొంగళిపురుగులతో నిండివుంది.

గొంగళిపురుగులంటే ముందే నాకు కంపరం. ఒకేసారి అన్నిటిని చూసేసరికి నా కళ్ళు బైర్లుకమ్మాయ్.

నా దగ్గరున్న కత్తితో ఇస్మాయిల్ షర్టు వీపు భాగం కోసి పురుగులు లేనిచోట పట్టుకుని గట్టిగా లాగాను. షర్టు వీపు భాగం మాత్రం రాలేదు, గట్టిగా కరుచుకుని వుంది. గొంగిళిపురుగుల వెంట్రుకలు షర్టు నుంచి వీపులో దిగబడి వున్నాయ్. రెండు చేతులతో షర్టు పట్టుకుని బలంగా లాగాను. షర్టు వూడి వచ్చింది.

దానికి దట్టంగా గొంగళిపురుగులున్నాయి. దూరంగా విసిరేసాను.

ఇస్మాయిల్ వీపంతా సన్నటి రంధ్రాలు పడి రక్తం కారుతుంది. బాధతో మూలుగుతున్నాడు.

"ఇలాంటి రాక్షసి గొంగళిపురుగులను ఎక్కడా చూడలేదు" వణుకుతున్న గొంతుతో అన్నాడు కిట్టూ, ఇస్మాయిల్ వీపుని చూస్తూ.

"వెంటనే మనం ఇక్కడినుండి వెళ్ళిపోవాలి, కమాన్" అంటూ ఇస్మాయిల్‌ను లేపి భుజాన వేసుకున్నాను. ఇస్మాయిల్ బాగ్ కిట్టూ తీసుకున్నాడు. నొప్పివలన షాక్‌తో ఇస్మాయిల్ స్పృహ తప్పిపోయాడు.

సొరంగం రెండుగా చీలిన చోటుకు నడిచాం. ఒక దారిలో దట్టంగా, పుట్టలు పుట్టలుగా గొంగళిపురుగులున్నాయి. ఆ దారిని విడిచి ఇరుకుగా వున్న ఇంకొక దారిలో ప్రయాణించాము.

అర మైలు నడిచేవరకూ ఎవరూ మాట్లాడలేదు. పోను పోనూ సొరంగం వెడల్పయింది. చదునుగా వున్న ప్రదేశం చూసి ఇస్మాయిల్‌ను కిందికి దించాను. అరుణ్ తన బాగ్‌లో వున్న ఫస్టుఎయిడ్ బాక్స్ తీసి ఇస్మాయిల్ వీపును శుభ్రంగా దూదితో తుడిచి పెన్సిలిన్ ఆయిన్‌ట్‌మెంట్ పూశాడు. స్మెల్లింగ్ సాల్టు వాసన చూపేసరికి ఇస్మాయిల్ కొద్దిగా కదిలాడు. నిమిషం తరువాత బాగా స్పృహ వచ్చింది. మెల్లగా లేచి కూర్చుని బెరుగ్గా చుట్టూ చూశాడు.

"మనం ఆ ప్రదేశం వదలి వచ్చాం. ఇక భయంలేదు" అన్నాడు కిట్టూ బెదురుగా చూస్తున్న ఇస్మాయిల్‌తో.

"నడవగలవా?" అడిగాను.

ఇస్మాయిల్ మెల్లగా లేచి నిలుచున్నాడు. రెండడుగులువేసి "నడవగలను, కొద్దిగా నీరసంగా వుంది, అంతే" అన్నాడు.

ఫస్టుఎయిడ్ బాక్సునుండి రెండు ఆంటీసెప్టిక్ టాబ్లెట్లు, ఒక కాంపోజ్ తీసి మింగించాను, తరువాత తన బాగ్ నుండి కొత్త షర్టుతీసి వేసుకున్నాడు.

అప్పటికే రాత్రి ఎనిమిదిగంటలయింది.

"ఈ రాత్రికి ఇక్కడ పడుకుని, ఉదయం బయలుదేరుదాం, ఇస్మాయిల్‌కు కూడా విశ్రాంతి అవసరం" అన్నాను.

అందరూ అంగీకరించారు.

బ్రెడ్‌కు జామ్, బటర్ పూసుకునీ తిని దాహం కాకుండా వాటర్ ఎవేసివ్ టాబ్లెట్లు మింగాము. బాగ్‌ల నుండి దుప్పట్లు తీసుకుని పరుచుకుని పడుకున్నాం. నా భుజానికున్న గన్ తీసి పక్కన పెట్టుకున్నాను.

అలసిన శరీరానికి వెంటనే నిద్రపట్టింది.

## 7

ఉదయం ఆరుగంటలకు అందరం లేచాము.

మేము సారంగంలోకి వచ్చి ఒక రోజయింది.

మావద్ద వున్న కొద్దిపాటి నీటితో ముఖాలు కడుక్కుని, బ్రెడ్ తిని బయలుదేరేసరికి సరిగ్గా ఏడుగంటలయింది.

"ఇలా ఇంకా ఎంతదూరం నడవాలి. ఈ సారంగానికి అంతే కనిపించటంలేదు. ఇక్కడినుండి మనం వెనక్కు తిరగటం మంచిది" నిరుత్సాహంగా అన్నాడు ఇస్మాయిల్.

"డోంట్ టాక్ రబ్బిష్, ఈ సారంగం అంతు

తెలుసుకోకుండా వెనక్కు తిరిగే ప్రశ్నలేదు" భుజానికి బాగ్ తగిలించుకుంటూ దృఢంగా అన్నాడు కిట్టూ.

కిట్టూ వైపు కోపంగా చూశాడు ఇస్మాయిల్. "నో, నేనిక ముందుకు నడవను. మీరు కావాలంటే వెళ్ళండి. నేను ఇక్కడినుండి వెనక్కు వెళ్ళిపోతాను" అన్నాడు విసురుగా వెనక్కు తిరుగుతూ.

"డోన్ట్ యాక్టు లైక్ ఎ ఫూల్ ఇస్మాయిల్, మనం నలుగురం కలిసివచ్చాం, కలిసే పోదాం. ఈ రోజు మధ్యాహ్నం వరకు ప్రయాణించి అప్పటికీ సొరంగం అంతం కాకుంటే అప్పుడు వెనక్కు తిరిగి వెళ్దాం. ఇన్ని కష్టనష్టాలకు వోర్చి ఇందదూరం వచ్చి ఇప్పుడు అర్థాంతరంగా వెనక్కు తిరగటం బాగుండదు" సముదాయింపుగా ఇస్మాయిల్‌తో అన్నాను.

ఇస్మాయిల్ ముఖం ముడుచుకుని మౌనంగా వుండిపోయాడు.

"ఓ.కె. లెటస్ స్టార్ట్!" ముందుకు నడుస్తూ అన్నాను.

రెండు గంటలసేపు ఏకాగ్రతతో నడిచాం. అంతవరకూ ఎవరూ మాట్లాడలేదు.

"ఓ మై గాడ్, ఇక్కడ సొరంగం తిరిగి రెండుగా చీలింది. సొరంగంలో ఇన్ని దారులుంటే తిరిగివచ్చేటప్పుడు దారి తప్పిపోతాం" ఆందోళనగా అన్నాడు అరుణ్.

"పరవాలేదు, మనం వచ్చేదారిలో అక్కడక్కడా చాక్‌పీస్‌తో గుర్తులు పెట్టాను" అన్నాడు కిట్టూ. బాగ్ నుండి చాక్‌పీస్ తీస్తూ.

ఏంచేయాలని రెండు నిమిషాలు ఆలోచించాను.

చివరకు ఒక ఉపాయం తట్టింది.

“కిట్టూ నీవు ఆ సొరంగం గుండా బయలుదేరు. నేను ఈ దారిలో బయలుదేరుతాను. సరిగ్గా పదినిమిషాలు వేగంగా నడిచి ఆ మార్గం ఎలా వుందో చూసి తిరిగి ఇక్కడకు రా. సొరంగం దారిలో మళ్ళీ చీలితే నీవు ఆ దారిలో వెళ్ళకుండా వెనక్కు రా. నేను కూడా అలాగే చేస్తాను” చెప్పాను కిట్టూకు.

సరేనని కిట్టూ వెంటనే బయలుదేరాడు. నేను ఇంకొక దారిలో బయలుదేరాను.

నేను వెళుతున్న దారి నాలుగడుగులు వెడల్పు ఏడు అడుగుల ఎత్తు వుంది. బాటరీలు త్వరగా అయిపోకుండా వుండేందుకు టార్చ్ అప్పుడప్పుడు వేస్తూ, ఐదు నిమిషాలు గమ్యంలేని ప్రయాణంచేశాను. ఉన్నట్టుండి టార్చి వెలుగు దారికడ్డంగా వున్న కొండరాతిపై పడింది. చుట్టూ చూశాను. ముందుకు పోయేందుకు ఎలాటి దారీ లేదు. ఆ సొరంగం అక్కడికి అంతమయింది.

వెంటనే వెనక్కు వచ్చి అరుణ్‌తో ఇస్మాయిల్‌తో ఆ విషయం చెప్పాను. మేమంతా కిట్టూ కొరకు ఆతృతగా ఎదురు చూడసాగాం.

పదిహేను నిమిషాల తరువాత కిట్టూ వెనక్కు వచ్చాడు.

“ఈ దారిలో నేను నడిచినంతవరకు ఎలాంటి అడ్డంకులూ లేవు. నీవు వెళ్ళినదారి ఎలా వుంది?” అడిగాడు నన్ను.

చెప్పాను. “సరే అయితే ఈ దారిలోనే వెడదాం” అంటూ చాక్‌పీస్‌తో అయిదారుచోట్ల గుర్తులు పెట్టాడు కిట్టూ.

మళ్ళీ మా అన్వేషణ ప్రారంభమయింది.

ఈసారి అరుణ్ ముందు బయలుదేరాడు. ఒకటార్చ్ మాత్రమే ఉపయోగిస్తూ ఒకే వేగంతో నడుస్తున్నాం.

దారిలో ఎన్నో సొరంగాలు ఎదురయ్యాయి. మా అదృష్టంకొద్దీ ఏ తప్పుదారీ ఇరవై గజాలకు మించిలేదు. ఒకవేళ తప్పు సొరంగంలో వెళ్ళినా అది కొద్దిదూరంలోనే మూసుకుపోవటంతో తిరిగి వెనక్కు వచ్చి అసలు సొరంగం దారిలో ప్రయాణించసాగాము.

అలా చాలా దూరం ప్రయాణించాం. సొరంగం అంతు చిక్కటంలేదు. వెనక్కు వెళ్ళటం గురించి మళ్ళీ ఏమీ మాట్లాడలేదు.

రాత్రి ఏడుగంటలవరకు ప్రయాణించి, చివరికి ఒకచోట కూలబడ్డాం.

"మోహన్, ఈ సొరంగానికి అసలు అంతున్నట్లు లేదు. మనం ఇప్పటికి దాదాపు ముప్పైమైళ్ళు వచ్చాం కాని దీని గురించి మనకు ఏమీ తెలియటంలేదు. మనం ఏ దిక్కుకు వెళుతున్నామో కూడా తెలియటంలేదు. ఇలా గుడ్డిగా ముందుకు వెళ్ళటంకంటే వెనక్కు తిరగటం మంచిది" బేగ్ నుండి దుప్పటితీస్తూ అన్నాడు అరుణ్.

అరుణ్ అన్న మాటలు నిజమేననిపించింది. నిజానికి పోనుపోను గాలి కూడా తక్కువవుతుంది. మేమంతా ఊపిరి భారంగా పీలుస్తున్నాము.

"కిట్టూ, ఇక ముందుకు వెళ్ళటంలో నాకు కూడా ప్రయోజనం కనిపించటంలేదు. ఈ సొరంగం కొన్ని వందలమైళ్ళు పొడుగు వుండవచ్చు. అలాంటప్పుడు మనం ఎంత దూరం వెళ్ళినా లాభంలేదు. మొండిగా ఆలోచన లేకుండా ముందుకుపోతే కోరి అపదలు తెచ్చుకుంటాం.

మనవద్ద వున్న ఆహారం టాబ్లెట్లు ఇక మూడు రోజులకు మాత్రం సరిపోతాయి. రేపు ఉదయం నిద్రలేస్తూనే వచ్చిన దారిలో వెనక్కు వెళ్ళిపోదాం, ఏమంటారు?" అందరిని టార్చ్ వెలుగులో చూస్తూ అడిగాను. మావద్ద వున్న నాలుగు టార్చ్‌లలో ఒకదానిలో సెల్సు పూర్తిగా అయిపోయాయి. రెండోది గుడ్డిగా వెలుగుతోంది.

"నాకు కూడా అంతకుమించి దారి కనబడ్డంలేదు" భారంగా నిట్టూర్పు విడిచి అన్నాడు కిట్టూ.

మరునాడు ఉదయం లేస్తూనే వెనక్కు ప్రయాణం చేయాలని నిశ్చయించుకున్నాం.

భోజనం చేసి నిద్రకుపక్రమించాం.

ఏదో సాధించాలని వచ్చిన మాకు నిరాశ ఎదురయింది. యెవరూ ఇంతవరకూ ప్రవేశించని ఈ సొరంగంలో మేము ధైర్యంగా దాదాపు ముప్పైమైళ్ళ వచ్చాం. అదే మాకు మిగిలిన తృప్తి. మెల్లగా నిద్ర నన్నావహించింది.

# 8

ఉన్నట్టుండి నాకు మెలుకువ వచ్చింది. గడియారం చూశాను. తెల్లవారు జాము నాలుగు గంటలయింది. నాకు వాతావరణంలో ఏదో తేడా కనిపించింది. యెక్కడినుండో వేడిగాలివచ్చి మమ్మల్ని తాకుతుంది.

కిట్టూ కూడా లేచాడు. "మోహన్ ఏమిటిది?" అడిగాడు.

"తెలీదు. యెక్కడినుండో అప్పుడప్పుడూ వేడిగాలి వస్తుంది. రాత్రి మనం పడుకున్నప్పుడు వాతావరణం ఇంత వేడిగా లేదు."

ఇంతలో అరుణ్, ఇస్మాయిల్ కూడా లేచారు.

మళ్ళీ ఒకసారి గాలితెర వచ్చి మమ్మల్ని తాకింది. గాలితో పాటు ఏదో శబ్దం కూడా వస్తోంది.

నా దగ్గరున్న టార్చ్ వెలిగించి, చుట్టూ చూశాను. నల్లటి సారంగం గోడలు తప్ప ఏమీ కనిపించలేదు.

"అందరూ బాగ్‌లు పాక్ చేసుకుని రెడీగావుండండి. ఇప్పటినుండీ మనం వెనక్కు ప్రయాణిస్తే రాత్రికల్లా మనం వచ్చిన దార్లో అడవిచేరి గంగన్న వాళ్ళను కలవవచ్చు" అన్నాను దుప్పటి మడతవేస్తూ.

అందరం బాగ్‌లు భుజాలకు తగిలించుకుని లేచి నిలుచున్నాం.

ఇంతలో, మేం వచ్చినదారిలో 'బుస్'మని శబ్దం వినిపించింది. శబ్దంతో పాటు వేడిగాలి వచ్చి మా ముఖాలను తాకింది.

మరలా టార్చ్ వెలిగించి శబ్దం వచ్చిన వైపు చూసాను. అప్పుడు మసగ్గా కనిపించింది. నల్లటి ఆకారంలో మనిషికన్నా లావున్న జంతువేదో ప్రాక్కుంటూ మావైపు వస్తోంది.

నా గుండె జల్లుమంది. "మై గుడ్ నెస్, ఏమిటిది?" వణికే గొంతుతో అడిగాడు ఇస్మాయిల్.

ఇప్పుడు రెండు ఆకారాలు కనిపిస్తున్నాయి.

కెవ్వున అరిచాడు అరుణ్. "అవి కొండచిలువలు. రెండు జంటగా కలిసి వస్తున్నాయి."

ఇప్పుడు వాటి ఆకారాలు బాగా కనిపిస్తున్నాయి. కొండచిలువ ఒక్కొక్కటి ఇద్దరు మనుషుల లావుతో వుంది. కనుచూపుమేరకు వాటి శరీరమే కనిపిస్తోంది. వాటి పొడవు దాదాపు నలభై అడుగులుండవచ్చు.

ముందు వస్తున్న కొండచిలువ వికృతంగా నోరు తెర

చింది. దాని నోరు మనిషిని సునాయాసంగా మింగగలిగి నంత వుంది. దాని నోటినుండి బుస్‌మని శబ్దంతోపాటు, వేడిగాలి మావైపు దూసుకొచ్చింది.

అవి మాకు ముప్పైగజాలదూరం వరకూ వచ్చాయి. మేము వచ్చిన దారిలో తిరిగి వెళ్ళాలంటే వాటిని దాటుకునే వెళ్ళాలి.

వాటిని చూస్తూనే నా శరీరం చల్లబడింది. కాళ్ళు భూమికి కరుచుకుపోయాయి. ఎలాగో నోరు పెగల్చుకుని "కమాన్, లెటస్ రన్ ఫర్ లైఫ్. ఈ స్థలాన్ని వదలి వెంటనే వెళ్ళిపోవాలి" అరిచాను.

అందరూ నాలాగే మంత్రముగ్ధుల్లా ఏమిచెయ్యాలో తెలియక నిలుచున్నారు. నా అరుపుకు అందరిలో చలనం వచ్చింది. అడవి చేరుకోవాలన్న ఆలోచన వెనక్కు నెట్టి అందరం ప్రాణాలరచేతిలో పెట్టుకుని కొండచిలువలకు దూరంగా పరిగెత్తసాగాము.

అలాదాదాపు రెండు గంటలు ఏకబిగిన ప్రాణ భయంతో పరిగెత్తాం.

నీరసంతో ఆయాసంతో ఆగకుండా రెండుగంటలు పరిగెత్తేసరికి, నా గొంతులో తడి ఆరిపోయి, కళ్ళు తిరుగుతున్నాయి. తలపోటు ప్రారంభమయింది.

"కొండచిలువలు వెనక్కుపోయుంటాయి, మనం కొద్దిసేపు ఆగుదాం" అన్నాడు కిట్టూ వొగరుస్తూ.

అందరం ఆగిపోయాం. అందరూ నోటితో గాలి పీలుస్తున్నారు.

"ఇక మనం వెనక్కు వెళ్ళాలన్న ఆలోచన వదులు కోవాలి. ముందు అనంతమయిన సారంగం, వెనుక భయం కరమైన కొండచిలువలు ఎటువెళ్ళినా మనం ప్రాణాలతో

బయటపడటం అసంభవం. చివరికి మన ఎడ్వెంచర్ ఈ విధంగా ముగిసింది" నిర్లిప్తంగా అన్నాడు అరుణ్.

"అసలు కొండచిలువలు ఈ సొరంగంలో ఎలా వున్నాయి. వాటికి ఈ సొరంగంలో ఆహారం యెక్కడి నుండి దొరుకుతుంది" కింద కూర్చుంటూ అడిగాడు కిట్టూ.

"అవి ఈ సొరంగంలో వున్న చిన్న సొరంగాల్లో యెక్కడో పడుకుని వుంటాయి. అవి ఒకసారి ఆహారం తీసుకుంటే కొన్ని రోజులపాటు మజ్జుగా పడివుంటాయి. మన అలికిడికి, వాసనకు అవి లేచి మన వెంట పడివుండ వచ్చు" అన్నాను బాగ్ కింద పెట్టి చెమట తుడుచు కుంటూ.

"ఏది ఏమైనా మనం వెనక్కు వెళ్ళలేము. ముందుకు వెళ్ళవలసిందే" తెగింపుగా అన్నాడు ఇస్మాయిల్.

బయటకు మేమెంత గంభీరంగా వున్నా, మా అందరికీ ప్రాణాలతో బయటపడగలమన్న ఆశ నశించింది.

"మీ కెవరికైనా ఆ శబ్దం వినపడిందా" హఠాత్తుగా తుపాకీ చేతికి తీసుకుంటూ అడిగాడు కిట్టూ.

"ఏమిటి?" నీరసంగా ప్రశ్నించాను.

శబ్దం చేయద్దు అన్నట్లు చేయి చాచాడు కిట్టూ. అందరం నిలుచున్నాం.

నిశ్శబ్దతను చీల్చుకుంటూ బుస్ మంటూ శబ్దం వినిపించింది. పరిచయమైన ఆ శబ్దం వింటూనే ఇస్మాయిల్ చేతిలోని టార్చ్ వెలిగింది. ఫైవ్ సెల్ టార్చ్ వెలుగులో సొరంగం దాదాపు అర ఫర్లాంగ్ దూరం కనిపిస్తుంది.

అక్కడ కనిపించిన దృశ్యం మాలో ఏదైనా చివరి ఆశంటూ మిగిలివుంటే దాన్ని కూడా ధ్వంసం చేసింది.

కొండచిలువలు రెండు వికృతంగా నోరు తెరచి మా వైపు వస్తున్నాయి.

"ఇవి మనం ఎంతదూరం వెళ్ళినా విడిచేలా లేవు. ఎంత దూరం పరిగెత్తినా కొన్ని గంటల్లో నీరసపడి పోతాం. అప్పుడయినా వీటికి ఆహారం కావాల్సిందే కాబట్టి వీటిని తుపాకీతో ఇక్కడే ఎదుర్కోవటం మంచిది" దృఢనిశ్చయంతో అన్నాను.

"అవును. తుపాకి వాటి తలకు గురిపెట్టి కాలుస్తాను. మన అదృష్టం బాగుంటే ఒకవేళ అవి చావకున్నా ఇక్కడే ఆగిపోవచ్చు" అన్నాడు కిట్టూ, ఒక కాలు వెనక్కు చాచి మోకాలిపై కూర్చుని డబల్ బారల్ గన్ గురి పెడుతూ.

నేను బాగా పవరున్న టార్చ్ తీసుకుని ముందు వస్తున్న కొండచిలువ తలపై వేశాను. వాటి చలనంతో పాటు నా టార్చ్ వెలుగు కూడా ప్రయాణిస్తోంది.

అరుణ్, ఇస్మాయిల్ డాగర్‌లు చేతపట్టుకుని నిలుచున్నారు. డాగర్‌లు కొండచిలువను ఏమీ చేయలేవని మాకు తెలుసు. కాని పోరాడకుండా ప్రాణాలు వదలాలని మాకు లేదు.

కొండచిలువను పదిగజాల దూరానికి రానిచ్చి ట్రిగర్ నొక్కాడు కిట్టూ.

కిట్టూ చేతిలో గన్ గురితప్పటం నేనింతవరకూ చూడలేదు.

'ధన్'మన్న శబ్దంతో సారంగం ప్రతిధ్వనించింది.

వికృతంగా నోరు తెరుచుకుని ముందువస్తున్న కొండచిలువ నోటినుండి రక్తం ఫౌంటెన్‌లా చిమ్మింది. గుండు సూటిగా దాని నోటిలో దూసుకుపోయింది.

అది తల విసురుగా విదిలించింది. తల సారంగం గోడకు కొట్టుకోసాగింది. దాని వేగం పూర్తిగా తగ్గిపోయింది.

టార్చ్ పట్టుకున్నా నా చేయి వణుకుతోంది. ఎంత గుండె ధైర్యమున్న మనిషికైనా భయంకరంగా మెలికలు తిరుగుతున్న కొండచిలువను అంత దగ్గరనుండి చూస్తే భయంపుడుతుంది. టార్చ్ రెండు చేతులతో పట్టుకున్నాను.

అది బుసకొట్టినప్పుడల్లా వేడిగాలి మా వైపు మాసుకొస్తోంది.

గురిచూసి మళ్ళీ ట్రిగర్ నొక్కాడు కిట్టూ. గుండు దాని ఎడమ కంటిలో దూసుకుపోయింది. దాని కన్ను రక్తం ముద్దలా తయారయింది.

కొండచిలువ శరీరమంతా బాధతో మెలికలు తిరగసాగింది. అది తలతో కొట్టినప్పుడల్లా సారంగం అదురుతోంది.

త్వరత్వరగా గన్ లోడ్ చేశాడు కిట్టూ. ఇంతలో రెండవ కొండచిలువ కనుమూపు మేరకు వచ్చేసింది.

దాన్ని గురిచూసి కాల్చబోయాడు కిట్టూ.

ఇంతలో అనుకోని అవాంతరం ఎదురయింది.

రెండవ కొండచిలువను చూస్తూనే ఇస్మాయిల్ గజగజ వణకసాగాడు.

ఇస్మాయిల్ చేతిలోని టార్చ్ జారి కిట్టూ చేతిపైన పడింది.

ట్రిగర్ నొక్కబోతున్న కిట్టూ, చేతిపైన టార్చ్ పడటంతో ఉలిక్కిపడి గన్ పైకి లేపాడు. బుల్లెట్ రిలీజయి సారంగం పైకప్పును తాకింది.

సారంగ పైకప్పునుండి సన్నని రాళ్ళు క్రిందపడసాగాయి. కొద్దిసేపటికి పెద్దపెద్ద రాళ్ళు వర్షంలా పైనుంచి పడసాగాయి. మేము ఏమి జరుగుతుందో ఆలోచించేలోపునే మేము వచ్చినవైపు సారంగం మార్గం పూర్తిగా కొండరాళ్ళతో మూసుకుపోయింది. రాళ్ళ క్రింద కొండచిలువలు సమాధి అయ్యాయి.

సారంగంనుండి బయటకు వెళ్ళడానికి మాకు తెలిసిన ఒక్క మార్గం కూడా పూర్తిగా మూసుకుపోయింది.

ఇప్పుడు మేము సారంగంలో బందీలం.

## 9

సారంగం కూలిపోవటం చూసి అందరం నిస్త్రాణంగా నిలబడిపోయాం. ఇస్మాయిల్ ముందు ఆ షాక్ నుండి తేరుకున్నాడు.

"సారీ ఫ్రండ్స్, నావల్లే ఇలా జరిగింది. నా చేతిలో టార్చ్ జారిపోకుంటే ఇలా జరిగేది కాదు, కొండచిలువలను చంపి బయటపడే వాళ్ళం. నావల్ల మనమంతా ఇక్కడ జీవసమాధి కావలసి వస్తోంది" బాధతో అన్నాడు ఇస్మాయిల్.

"నో. ఇందులో నీ తప్పేంలేదు. ఈ ప్రోగ్రాం వేసింది నేను. మన ఈ దురదృష్టానికి కారణం నేను. నేను మిమ్మలను ఈ సారంగానికి తీసుకురాకుంటే మనమంతా మన వూర్లో హాయిగా ఉద్యోగాలు చేసుకుంటూ బ్రతికే వాళ్ళం. నావల్లే మీరంతా ఈ ఊబిలో ఇరుక్కుపోయారు" ఆవేదనతో అన్నాను.

"ఎవరూ దీనికి బాధ్యులు కారు. మనమంతా సరదా పడి వచ్చాం. కాని అనుకోని అవాంతరాలు ఎదురయ్యాయి. ఇలా అవుతుందని యెవరికేం తెలుసు"

ఓదార్పుగా అన్నాడు అరుణ్.

"మనమింకా చనిపోలేదు, అప్పుడే ఎందుకలా బాధ పడతారు. శక్తి వున్నంతవరకూ ఈ సొరంగంలో ఇలాగే ప్రయాణిద్దాము. మన అదృష్టం బాగుంటే సొరంగం త్వరలోనే అంతమై మనం బయటి ప్రపంచంలో పడవచ్చు. లగేజీ తీసుకుని బయలుదేరండి" ధైర్యం చెప్తూ అన్నాడు కిట్టూ.

అందరం బ్రెడ్ తిని బయలుదేరాం. తాగటానికి నీళ్ళు లేవు.

మాలో యెవరికీ ప్రాణాలతో బయటపడగలమన్న ఆశ లేదు. అయినా మొండిగా బయలుదేరాము.

మెల్లగా ఒకరి వెనుక ఒకరం నడుస్తున్నాము. దారిలో అనేక సొరంగాలు ఎదురవుతూనే వున్నాయి. గడియారం చూసాను. ఉదయం పదకొండు గంటలయింది.

మేము సొరంగంలో ప్రవేశించి రెండు రోజులు దాటింది.

దారిలో పదిహేను నిమిషాలాగి విటమిన్ టాబ్లెట్లు, వాటర్ ఎవేసివ్ టాబ్లెట్లు వేసుకున్నాం. మేం తెచ్చుకున్న బ్రెడ్ కూడా అయిపోయింది. ఇక టాబ్లెట్లపై బ్రతకాలి.

రాను రానూ శరీరంలో అలుపు, నీరసం ఎక్కువై మగత కమ్ముతుంది. నిద్రలో నడుస్తున్నట్లు నడుస్తున్నాము.

మూడు టార్చ్‌ల్లో బాటరీలు అయిపోయాయి. ఆఖరు టార్చ్ అప్పుడప్పుడు వెలిగిస్తూ కాళ్ళీడ్చుకుంటూ నడుస్తున్నాము.

ముందు వెడుతున్న వాడినల్లా టార్చ్ వెలుగులో కనిపించిన దృశ్యం చూసి టక్కున ఆగిపోయాను.

సొరంగం గోడవైపు టార్చ్ తిప్పాను. సొరంగం గోడంతా అద్భుతమైన చిత్రాలతో నిండివుంది. మనుషులు, జంతువులు, పక్షులు, చెట్లు, ఇళ్ళు ఇలా కను చూపు మేరకు రకరకాల ప్రకృతి చిత్రాలను సొరంగం గోడలపై మలిచారు. మనోహరమైన ఆ చిత్రాలను సొరంగం గోడలపై చూసిన నాకు ఆశ్చర్యం కలిగింది.

"చిత్రాలు అద్భుతంగా వున్నాయి. వీటిని మలచిన వాడెవరో కాని మంచి శిల్పి అయివుంటాడు" చిత్రాలను చేతితో తాకుతూ ఇస్మాయిల్ అన్నాడు.

"ఈ చిత్రాలు కొన్ని వేల సంవత్సరాల కాలం నాటివి. ఆ చిత్రాలలో వున్న మనుషులను చూడండి. వాళ్ళ దుస్తులు, ఆయుధాలు మనిషి నాగరికతకు ముందు కాలాన్ని సూచిస్తున్నాయి" అరుణ్ అన్నాడు.

వాటిని చూస్తున్న నాకు ఆశ్చర్యంతో పాటు ఆనందం కలిగింది.

"ఈ చిత్రాలనిబట్టి చూస్తూంటే ఈ సొరంగం చివర చాలా దగ్గరలోనే వుందనిపిస్తోంది. ఇక్కడ గాలి కూడా స్వచ్ఛంగా వుంది" ఉత్సాహంగా అన్నాను.

మా అందరిలో తిరిగి వుత్సాహం, ఆశ కలిగాయి.

టార్చ్ వెలుగులో గోడపైనున్న చిత్రాలను పరిశీలించుకుంటూ నడుస్తున్నాము.

అలా అరఫర్లాంగు నడిచేసరికి ఇంకొక అద్భుత దృశ్యం కనిపించింది.

"ఆయుధాలు, అనాగరికుల ఆయుధాలు. లోహాన్ని కరిగించి చేసినవి" కిట్టూ వాటివైపు నడుస్తూ ఆశ్చర్యంగా

అన్నాడు.

అక్కడ దాదాపు రెండు వందల ఆయుధాలు సొరంగం గోడకు పేర్చబడి వున్నాయి. రకరకాల ఆయుధాలు, రకరకాల లోహాలతో చేయబడి వున్నాయి. ఆ ఆయుధాలకు నగిషీకాని, అలంకారాలుకాని లేవు, లోహాన్ని కరిగించి మొరటుగా చేశారు.

ఒక్కొక్క ఆయుధాన్ని పరిశీలిస్తూ నడుస్తున్నాము.

"కొన్ని శతాబ్దాల క్రితం, ఈ సొరంగం దరిదాపుల్లో అనాగరికులు నివశించి వుంటారు. వారీ సొరంగాన్ని ఆయుధశాలగా వుపయోగించుకుని వుంటారు" చిన్న కత్తిని చేతిలోకి తీసుకుని అన్నాడు అరుణ్.

"ఓ మై గాడ్, సీ హియర్, ఇక్కడున్న ఆయుధాలు బంగారంతో చేయబడివున్నాయి" ఆనందంతో అరిచాడు ఇస్మాయిల్.

అందరం ఇస్మాయిలున్న వైపు వురికాం. అక్కడున్న ఆయుధాలన్నీ టార్చి వెలుగులో పచ్చగా మెరసిపోతున్నాయి. శతాబ్దాలు గడిచినా వాటి వెలుగు తరగలేదు.

బంగారం, మేలిమి బంగారం. అంత అద్భుత దృశ్యం నా జీవితంలో చూడలేదు.

గదలాంటి ఒక ఆయుధాన్ని చేతిలోకి తీసుకున్నాను. రెండడుగులున్న దాన్ని మోయడానికి నాకు రెండు చేతులు అవసరమయ్యాయి.

ఆయుధాన్ని గోడకేసి మెల్లగా కొట్టాను. గోడ తగిలినంత మేర లోహం నొక్కుకుపోయింది.

"బంగారం, స్వచ్ఛమైన బంగారంతో ఈ ఆయుధాలు చేశారు. అందుకే ఈ ఆయుధంలో పటుత్వం

లేదు" ఆశ్చర్యానందాలతో అన్నాను.

బంగారంతో చేసిన ఆయుధాలన్నీ వేర్పరిచాము. పన్నెండున్నాయి. రెండు పెద్దవి, పది చిన్న ఆయుధాలున్నాయి.

"హా లక్కీ వుయార్, ఈ బంగారం కొన్ని లక్షల విలువ చేస్తుంది" అరుణ్ అన్నాడు ఆనందంగా.

ఆ ఆయుధాలన్నింటినీ మా వద్ద వున్న నాలుగు బాగ్ లలో సర్దాము. బంగారు ఆయుధాలు బాగుల్లో పెట్టేసరికి, దుప్పట్లకు స్థలం చాలలేదు. దుప్పట్లు భుజాలపై వేసుకున్నాము. బాగ్ లు చాలా బరువున్నాయి. అయినా వుత్సాహంగా, వేగంగా నడక సాగించాము.

మేము నడిచేకొద్దీ చల్లటి గాలి వీయసాగింది.

సొరంగం చివర దగ్గరపడే సూచనలు కనిపించేకొద్దీ, మాలో ఉత్సాహం అధికం కాసాగింది.

మధ్యాహ్నం మూడు గంటలకు మాకు దూరంగా వెలుగు కనిపించింది.

"సొరంగం చివరికొచ్చేశాం" అరుస్తూ పరుగుతీశాడు కిట్టూ.

అందరం ఆనందంగా వెలుగువైపు పరిగెత్తాం. రెండు నిమిషాల్లో వెలుగు కనిపిస్తున్న ప్రదేశం చేరుకున్నాము.

సొరంగం అక్కడితో అంతమయింది. సొరంగ బిలాన్ని దట్టమైన ముళ్ళచెట్లు మూసివేశాయి. ఆ చెట్ల సందునుండి కొద్దిగా వెలుగు లోనికొస్తోంది. బయటినుండి చూస్తే ఆ చెట్ల పొదల వెనుక వున్న సొరంగ బిలం కనిపించదు.

అందరం ఆనందంతో అరిచాము. గంతులు వేశాము.

# 10

డాగర్లతో చెట్లను నరుక్కుంటూ దాదాపు అర గంటకు సారంగం బయటకు వచ్చి పడ్డాం. సూర్యుడు పడమటివేపు వాలుతున్నాడు.

నేను మళ్ళీ సూర్యుణ్ని, భూమిని, చెట్లను చూస్తాననుకోలేదు. ప్రకృతి మమ్మల్ని మనోహరంగా ఆహ్వానించింది.

మేము ఒక చిన్న లోయలో వున్నాము. చుట్టూ చిన్న కొండలున్నాయి.

రకరకాల చెట్లు, పక్షుల కిలకిలలు, గాలికి గుసగుసలాడే చిన్న మొక్కలు, దగ్గర్లో సెలయేరు-ఆ దృశ్యం చూస్తుంటే ప్రాణం లేచివచ్చింది.

దగ్గర్లో వున్న జామచెట్టునుండి పళ్ళు కోసుకుని కడుపునిండా తిని, ఆనందంతో ఒక పెద్ద చెట్టుకింద సేద తీర్చుకున్నాము.

"ఈ మూడు గంటల్లో జరిగిందంతా కలలా వుంది. నేను తిరిగి ప్రాణాలతో బయట ప్రపంచం చూస్తాననుకోలేదు" అరుణ్ అన్నాడు. బాగ్ తలకింద పెట్టుకుని పడుకుంటూ.

"మన 'కోసారంగ్' అన్వేషణ గొప్ప అడ్వెంచర్. జీవితంలో అప్పుడప్పుడూ ఇలాటి అనుభవాలు ఎదురవ్వాలి, అప్పుడే జీవితంలోని మాధుర్యం మనకర్థమవుతుంది" చెట్టు నానుకుని ప్రకృతి నాస్వాదిస్తూ అన్నాడు కిట్టూ.

"ఈ రాత్రికి ఇక్కడే వుండి ఉదయం బయలుదేరుదాం. అందరం అలసిపోయాం. లెటస్ ఎంజాయ్ దిస్ ఈవెనింగ్" అన్నాను. నా బాగ్‌లో మిగిలివున్న

వోడ్లు టావరిన్ విస్కీ ఫుల్ బాటల్ తీస్తూ.

ఆ రాత్రి అందరం తృప్తిగా తాగి మత్తుగా పడు కున్నాం.

ఉదయం లేచి పళ్ళు తిని లోయను చుట్టుకుని వున్న కొండను ఎక్కనారంభించాము. సాయంత్రానికి కొండ ఎక్కి అవతలికి దిగాము. కనుచూపు మేరలో జనసంచారం కనిపించలేదు.

కొద్ది దూరం పోయింతరువాత జనసంచారమూ, ఒక చిన్న పల్లె కనిపించాయి.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు అ పల్లె చేరాము.

కొండలవైపునుండీ వస్తున్న మమ్మల్ని అందరూ ఆశ్చర్యంగా చూశారు.

వారికో కట్టు కథ చెప్పి, ఆ వూరి ప్రెసిడెంటు గారిని పరిచయం చేసుకుని వారింట్లో భోజనం చేశాము. నాలుగు రోజుల తరవాత తృప్తిగా భోజనం చేసాము.

భోంచేసి పిచ్చాపాటీ మాట్లాడుతూ రామప్పపాలెం ఎంత దూరమని అడిగాను. అతడు చెప్పిన సమాధానానికి అందరం ఆశ్చర్యపోయాం.

రామప్పపాలానికి మేము డెబ్భై కిలోమీటర్ల దూరంలో వున్నాము.

సారంగం ఒక చివరనుండీ ఇంకొక చివరకు దాదాపు డెబ్భైకిలోమీటర్లు.

ఊరివారికి వీడ్కోలు చెప్పి మర్నాడు ఉదయం బస్సులో బయలుదేరాము. దారిలో దగ్గరున్న చిన్న పట్నానికి వచ్చి ఇంకొక బస్సులో రామప్పపాలెం చేరే సరికి, ముస్తాన్, గంగన్నలు మమ్మల్ని చూసి చాలా సంతోషించారు.

వారు అడవిలో మా కోసం మూడు రోజులు చూసి, ఇక తిరిగిరామని నిశ్చయించుకుని, ఆవేదనగా రామప్ప పాలెం తిరిగివచ్చారు.

సారంగం గురించి గ్రామస్థులంతా ఉత్సాహంగా అడిగారు. ఆయుధాల గురించితప్ప, మిగిలిన కథంతా చెప్పాము. అందరూ భయంతో బిగుసుకుపోయారు. యువకులు మా సాహస యాత్రను అభినందించారు. వృద్ధులు ఇలాంటి అనవసర సాహసాలు చేయవద్దని మందలించారు.

ఆ రాత్రి అక్కడ గడిపి, మరునాటి ఉదయం మా పట్టణానికి బయలుదేరాం నలుగురమూ.

"జీవితంలో ఇంకెప్పుడూ సారంగాలలో ప్రవేశించను, నాకు నూరేళ్ళకు సరిపడేలా అనుభవం లభించింది" అన్నాడు ఇస్మాయిల్.

"నీవు మాతో సారంగంలో ప్రవేశించకుండా వుండి వుంటే, నీ బాగ్ లోకి ఇప్పుడు బంగారం ముందేది కాదు" నవ్వుతూ అన్నాడు అరుణ్.

"మెషిన్‌లా మనిషి పట్టణాలలో ఎంత కాలం బ్రతికినా ఏం ప్రయోజనం. జీవితాలలో హాయి తెలియాలంటే ఇలాటి అనుభవాలు అవసరం. మనిషి జీవితం ఎప్పుడూ అడ్వెంచర్‌తో గడపాలి" కిట్టూ అన్నాడు సిగరెట్ వెలిగిస్తూ.

నేనేమీ మాట్లాడలేదు. బస్సు కిటికిలోంచి దూరంగా కనిపిస్తున్న గంగన్న, మస్తాన్‌లను చూస్తుండిపోయాను.

బస్సు మా వూరికి బయలుదేరింది.

—:ఐ పో యి ం ది:—

# యాభై వజ్రాలు

## టెంపోరావ్

మిస్ సురేఖ స్నానంచేసి పడగ్గదిలోకి వచ్చింది.

బీరువా అద్దం ముందు నిలబడి తన పొడుగాటి తల వెంట్రుకలను తువ్వాల్తో తుడుచుకుంటోంది.

సమీపంలో వున్న సోఫాలో కూర్చుని అశ్వద్ధామ దినపత్రికను చూస్తున్నాడు. సిగరెట్ పొగ వదుల్తూ అతడు దినపత్రికను పక్కనున్న టీపాయిమీద పడేసి బరువుగా వూపిరి పీల్చాడు.

"డిటెక్టివ్‌లు ఎంతో కష్టపడి అపరాధులను పట్టుకుంటారు. కాని వాళ్ళు సునాయాసంగా జైళ్ళలోంచి పారిపోతారు!" అన్నాడు అశ్వద్ధామ సురేఖవైపు చూస్తూ.

వెనుదిరిగి ఆమె అతడివంక చూసింది.

"ఏం జరిగింది?" అడిగిందామె.

అశ్వద్ధామ వెంటనే జవాబివ్వలేదు. ఓ నిమిషంపాటు ఆమెకేసి చూస్తూండిపోయాడు. అప్పుడే స్నానం చేసిన

ఆమె శరీరం జంగారంలా మెరుస్తోంది. ఆమె విశాల నేత్రాలు..అజంతా బొమ్మలను జ్ఞప్తికి తెచ్చే ముక్కు... ఎర్రటి పెదిమలు — యివన్నీ చూస్తూంటే ఏ దేవతో తనతో కలిసి జీవించడానికి సురేఖలా రూపొంది వుంటుందని అతడు లోలోపల అనుకున్నాడు.

"ఏమిటలా చూస్తున్నారు? ఏం జరిగిందో చెప్పండి!" సురేఖ మళ్ళీ అడిగింది.

"ఈ పేపరు చూస్తే నీకే తెలుస్తుంది"అన్నాడతను.

టీపాయి మీదున్న దినపత్రికను తీసి ఆమె చదవ సాగింది. అంతా చదివి ఆమె అశ్వద్ధామవైపు చూసింది.

"గజదొంగ రామ్మూర్తి స్వేచ్ఛగా తిరుగుతున్నాడన్నమాట! రాజమండ్రీ జైలునుంచి అతడు ఎలా పారిపోయాడో!" అందామె.

"రాతిగోడల మధ్య వుంచినా కొంతమంది అలా పారిపోతూనే వుంటారు. నాలుగేళ్ళ క్రితం డిటెక్టివ్ వాలిగారు ఆ గజదొంగను పట్టుకుని పోలీసులకు అప్పగించారు. కాని ఏం లాభం?"

"రామ్మూర్తి మద్రాసులో ఎక్కడో దాక్కుని వుండవచ్చని పోలీసులు అంటున్నారు. ఈ వార్త చదివి మద్రాసు ప్రజలు భయపడ్తూ వుంటారు" అందామె.

అశ్వద్ధామ సోఫాలోంచి లేచి ఆమె దగ్గరగా వెళ్ళాడు. వుషారుగా ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు. మరుగుజ్జు మంజూ లోపలకొచ్చి ఆగింది.

"ఏం మంజూ?" అడిగాడతను.

"మీ కోసం యిద్దరు స్త్రీలు వచ్చారు. వాళ్ళను క్రిందనున్న డ్రాయింగ్ రూంలో కూర్చోబెట్టాను" అందామె.

"ఎవరు వాళ్ళు?" అడిగాడతను.

"తల్లీ! కూతురూ అయివుండవచ్చు సార్. పోలిక లున్నాయి."

"గుడ్, నువ్వె వెళ్ళు. కాస్సేపట్లో వస్తాను."

మంజూ వెళ్ళిపోయింది. అశ్వద్ధామ సూటు ధరించి మేడ మెట్లు దిగి డ్రాయింగ్ రూంలోకి వెళ్ళాడు. సోఫాలో కూర్చున్న ఆడవాళ్ళిద్దరూ లేచి అతడికి నమస్కరించారు.

"కూర్చోండి!" అని అతడు సోఫాలో కూర్చుని సిగరెట్ వెలిగించాడు.

"చెప్పండి!"

"నానాలాల్ గారి భార్యను నేను. పేరు సుమిత్ర. ఈమె మా అమ్మాయి. నిన్నరాత్రి ఎనిమిదింటికి షాపుకు తాళంవేసి మావారు యింటికి వస్తున్నారు. మింట్ స్ట్రీట్ సమీపంలో ఆయన్ని యెవరో హత్యచేశారు. ఈ కేసును మీకు అప్పగించాలని ఇలా వచ్చాను" అందామె ఏడుస్తూ.

"షాపునుంచి ఇంటికి వచ్చేసమయంలో ఆయనవద్ద విలువైన వస్తువులు ఏమైనా వున్నాయా?"

తల్లీ, కూతురూ కొంతసేపు ఏడుస్తూ వుండిపోయారు.

"ఆయన వద్ద పదులక్షలు విలువచేసే వజ్రాలున్నాయి. వాటిని పెట్టెలో జాగ్రత్తగా వుంచి, పెట్టెను జేబులో దాచుకుని ఆయన ఇంటికి బయల్దేరారు. హత్యానంతరం పోలీసులు ఆయన జేబులు వెతికారు. తాళంచెవులు, చిల్లర డబ్బు, కొన్ని కాగితాలు మాత్రం దొరికాయి. వజ్రాల పెట్టె లేదు."

"ఈ విషయాలన్నీ మీకెలా తెలుసు?"

"షాపునుంచి ఇంటికి బయల్దేరేముందు ఆయన రోజూ నాకు ఫోన్ చేసేవారు. నిన్న రాత్రి కూడా అలాగే చేశారు."

"అంత ఖరీదైన వజ్రాలను ఆయన కొని యెంత కాలమైంది?"

"నిన్న మధ్యాహ్నమే ఆయన కొన్నారు. బలిపింటే యీ పాటికి అమ్మేసి వుండేవారు" అందామె.

"ఎవరికి?"

"బొంబాయినుండి కోటీశ్వరులైన మోతిలాల్ సేట్ మద్రాసు వచ్చారు. ఆయన కన్నెమేరా హోటల్లో వుంటున్నారు. వజ్రాలు కొనడానికి ఆయన యీ వూరు వచ్చినట్లు మావారు తెల్సుకున్నారు. నిన్న పొద్దుట మా వారు మోతీలాల్ సేట్‌ని కల్సుకున్నారు. ఆయన ఒక వజ్రాన్ని చూపించారు. ఆయనకది బాగా నచ్చింది. అటువంటివి యాభై వజ్రాలు కావాలని ఆయన ఆర్డరిచ్చారు. రాత్రి తొమ్మిదిన్నరకి యాభై వజ్రాలు తనకు యిచ్చి డబ్బు పట్టుకెళ్ళమన్నారు. ఈ వ్యాపారం జరిగుంటే మావారికి కొన్ని లక్షలు లాభం వచ్చేది. కాని అంతా తుడుచుకుపోయింది" అందామె బాధతో.

"ఆ వజ్రాలను ఆయన ఎక్కడ కొన్నారు?"

"చైనాబజారులోని రామ్‌రామ్ సేట్ కంపెనీలో కొన్నారు."

అశ్వద్ధామ ఆలోచిస్తూ వుండిపోయాడు.

"ఫోన్ చేసినప్పుడు మీ ఆయన మరింకా ఏం చెప్పారో పూర్తిగా తెలపండి."

"మోతీలాల్ సేట్‌కి కావలసిన యాభై వజ్రాలు కొన్నాననీ, ఇంటికొచ్చి భోజనంచేసి, తొమ్మిదిన్నరకి

అవి తీసుకెళ్ళి ఆయనకిచ్చి డబ్బు తీసుకోవాలనీ ఆయన చెప్పారు."

"యింకా ఏమైనా చెప్పారేమో జ్ఞాపకం తెచ్చుకోండి" అన్నాడతను.

"షాపునుంచి ఆయన మోతీలాల్ సేట్‌కి ఫోన్ చేసి వజ్రాలు సిద్ధంగా వున్నాయని చెప్పారు. ఆయన సంతోషిస్తూ 9-30కి వచ్చి డబ్బు తీసుకెళ్ళమన్నారట."

"మీ షాపులో యెంతమంది పనిచేస్తున్నారు?"

"మా షాపులో యెక్కువమంది లేరు సార్. ఒక గుమస్తా, ఒక నౌఖరు మాత్రం వున్నారు. అన్ని పనులూ మావారే చూసుకుంటారు."

"ఈ వజ్రాలు కొన్న విషయం వాళ్ళకు తెలుసా?"

"మావారు చెప్పరు. ఇటువంటి వాటిలో ఆయన జాగ్రత్తగా వుంటారు" అందామె.

ఆలోచిస్తూ అశ్వద్థామ స్టేట్ ఎక్స్‌ప్రెస్ 555 సిగరెట్ వెలిగించాడు. గులాబీ రంగు షిఫాన్ చీర ధరించి, మెట్లు దిగి సురేఖ గదిలోకొచ్చి అతడి పక్కనే సోఫాలో కూర్చుంది. అతడు చిరునవ్వుతో పక్క కూర్చున్న సురేఖ వంక చూశాడు. మెల్లిగా అతడి చూపు సుమిత్రవైపు వెళ్ళింది.

"మీకీ హత్య విషయం రాత్రి ఎలా తెలిసింది?" అడిగాడతను.

"రాత్రి తొమ్మిది దాటాక పోలీసులు యింటికొచ్చి, యీ విషయం చెప్పి, నన్నూ అమ్మాయినీ జీప్‌లో యెక్కించి హత్యా స్థలానికి తీసుకువెళ్ళారు. రోడ్డువారగా పడున్న ఆయన శవాన్ని చూసి యిద్దరం ఏడుస్తూ వుండిపోయాం. తర్వాత పోలీసులకు నాకు

తెలిసింది చెప్పాను."

అశ్వర్ధామ సోఫాలోంచి లేచి ఫోన్ దగ్గరకు వెళ్ళాడు. రిసీవర్ యెత్తి ఒక నంబరు తిప్పాడు.

"హలో, ఇన్స్పెక్టర్ ప్రతాప్!" అంది అటువైపు కంఠం.

"అశ్వర్ధామ హియర్! నానాలాల్ శవం యెక్కడుంది?"

"గవర్నమెంట్ హాస్పిటల్లో, అక్కడికి కొస్తున్నారా?"

"వస్తున్నాను" అని రిసీవర్ పెట్టేశాడు.

మిస్ సురేఖ అతడి పక్కనే వుంది.

"రేఖా, గజదొంగ రామ్మూర్తికి ఈ హత్యతో సంబంధం వుండొచ్చు. నేను శవాన్ని చూసి వస్తాను. నువ్వు కన్నెమేరా హోటలుకి వెళ్ళి మోతీలాల్ సేట్ గురించి వివరాలు కనుక్కో!" అన్నాడతను.

## 2

కాడిలాక్ కారును హాస్పిటల్ కాంపౌండులో ఆపి అశ్వర్ధామ దిగాడు. మార్ట్యురీవైపు నడిచాడు. అతడు హాల్లో ప్రవేశించగానే ఇన్స్పెక్టర్ ప్రతాప్ ఎదురుగా కనిపించాడు.

"నమస్తే అశ్వర్ధామగారూ, మీరు వస్తున్నారనే యిలా వచ్చాను" అన్నాడు ఇన్స్పెక్టర్.

"నిన్న రాత్రి హత్యచేయబడిన నానాలాల్ శవం చూద్దామని యిలా వచ్చాను" అన్నాడు అశ్వర్ధామ.

ఇన్స్పెక్టర్ వెటకారంగా నవ్వాడు.

"అంత విలువైన వజ్రాలను జేబులో పెట్టుకుని రాత్రి సమయంలో తిరిగితే దొంగలు వూరుకుంటారా?"

"కొంతమందికి పోలీసాళ్ళమీద నమ్మకం ఎక్కువ!" అన్నాడు అశ్వద్ధామ వ్యంగ్యంగా.

ఇన్స్పెక్టర్ తల వంచుకున్నాడు.

"ప్రతాప్, గజదొంగ రామ్మూర్తి మద్రాసులో వుండొచ్చని వార్త వచ్చింది. ఇటువంటి సమయంలో పట్నం నలువైపులా పోలీసులు గస్తీ తిరుగుతూ వుండాలి" అన్నాడు అశ్వద్ధామ.

ఇద్దరూ పొడుగాటి బల్లవైపు నడిచారు. శవం పైనున్న గుడ్డను యిన్స్పెక్టర్ తీసేశాడు. అశ్వద్ధామ పరీక్షగా శవంవంక చూశాడు.

నానాలాల్ వయసు యాభై దాటి వుంటుంది. కత్తితో యెవరో అతడి గుండెల్లోకి పొడిచి వుండాలని అశ్వద్ధామ గ్రహించాడు. కొన్ని నిమిషాల్లో అతడు మరణించి వుండాలి.

ఇన్స్పెక్టర్ ప్రతాప్ గుడ్డతో మళ్ళా శవాన్ని కప్పేశాడు. ఇద్దరూ గుమ్మంవైపు కదిలారు.

"ప్రతాప్, కన్నెమేరా హోటల్లో వుంటున్న మోతీలాల్ సేట్ గురించి ఏమైనా కనుక్కున్నారా?" ప్రశ్నించాడు అశ్వద్ధామ.

"నిన్న రాత్రి అదంతా దర్యాప్తు చేశాం. రాత్రి తొమ్మిదిన్నర లోపల మోతీలాల్ సేట్ హోటలు వదిలి విమానాశ్రయానికి వెళ్ళాడని తెలిసింది" అన్నాడు ఇన్స్పెక్టర్ ప్రతాప్.

"అతనెక్కడికి వెళ్ళాడో కనుక్కున్నారా?"

"అతను బొంబాయి వెళ్ళుంటాడు. మోతీలాల్ సేట్ గురించి ఈ పట్నంలో అనేకమంది డైమండ్ వ్యాపారాలుకు తెలుసు. అతడు కోటీశ్వరుడని అందరూ

యెరుగుదురు. అతడికి యీ హత్యతో సంబంధం వుండి వుండదు."

అశ్వద్ధామ మౌనంగా తన కారువైపు నడిచాడు. సీటుమీద కూర్చుని తలుపు మూశాడు. ఇన్స్పెక్టర్ ప్రతాప్ ముందుకు వెళ్ళి అశ్వద్ధామవైపు చూశాడు.

"ఈ హత్యతో గజదొంగ రామ్మూర్తికి ఏదేనా సంబంధం వుందంటారా?" అడిగాడతను.

అశ్వద్ధామ సిగరెట్ వెలిగించాడు. పొగ వదులుతూ ప్రతాప్ వంక చూశాడు.

"యెక్కడేనా నేరం జరిగితే అసలు నేరస్థుడిని కనుక్కోలేదాకా అవకాశమున్నవాళ్ళను మనం అనుమానించాలి" అన్నాడు అతను.

"అయితే రామ్మూర్తికోసం యీ పట్నమంతా గాలిస్తాను" అన్నాడు ప్రతాప్.

"దాంతో తృప్తిపడకండి. రామ్మూర్తికి ఈ హత్యతో సంబంధం వుంటే యీ పాటికి అతను యెక్కడికో పారిపోయుంటాడు. అతడి కోసం అనేక పట్నాల్లో మీరు వెతకాలి. జైల్లోంచి అంత సులువుగా పారిపోగలిగిన రామ్మూర్తి మీకంత తేలిగ్గా దొరకడు!" అని అశ్వద్ధామ కారును ముందుకు పోనిచ్చాడు.

రామ్‌రామ్ సేట్ కంపెనీవైపు కాడిలాక్ కారు దూసుకుపోయింది.

## 3

డిసోటో కారును కన్నెమేరా హోటల్ ముందు ఆపి, మిస్ సురేఖ దిగి, వయ్యారంగా హాల్లోకి నడిచింది. అటువైపునున్న యువకుడు ఆమెను చూసి పెదిమలు చప్పరించుకున్నాడు.

"మోతీలాల్ సేట్ గారు వున్నారా, వెళ్ళి పోయారా?" అడిగిందామె.

"నిన్న రాత్రి 9-30కి ఆయన వెళ్ళిపోయారు."

"ఇల్లక్!" అందామె.

హోటల్ గుమస్తా ఆమెవైపు మౌనంగా చూశాడు.

"ఈసారి కూడా ఆయన్ని కల్సుకోలేక పోయాను!" అందామె.

"ఇంతకుముందు ఆయన కోసం మీరు యిక్కడకు వచ్చారా?" అడిగాడతను.

"మీరెందుకు ప్రశ్నిస్తున్నారు?"

"ఆయన యీ హోటల్లో దిగడం యిదే మొదటి సారి. మద్రాస్ ఎప్పుడొచ్చినా ఆయన దాశప్రకాష్ హోటల్లో దిగేవారు. మా పబ్లిక్ రిలేషన్స్ వాళ్ళు రాసిన ఉత్తరాల మూలంగా ఆయన యీసారి ఇక్కడ దిగారు."

"ఇంతకుముందు దాశప్రకాష్ హోటల్కే ఆయన కోసం నేను వెళ్ళాను. అప్పుడు కూడా ఆయన్ని చూడలేకపోయాను. పాపం, ఆయన ఆరోగ్యం ఎలా వుందో?"

"ఆయన ఆరోగ్యం బాగాలేదు. ఇక్కడున్న నాలుగు రోజులూ ఆయన గదిలోంచి బయటకు రాలేదు. ఆయనతో వుండే నౌఖరు అన్నీ లోపలకు పట్టుకెళ్ళి ఇచ్చేవాడు."

సురేఖ కాస్సేపు ఆలోచిస్తూ వుండిపోయింది.

"నిన్న రాత్రి ఆయన వెళ్ళటం మీరు చూశారా?"

"చూడలేదండి. తొమ్మిది దాటాక నౌఖరు వచ్చి, ఆయన గది ఖాళీచేస్తున్నారని చెప్పి, బిల్లు చెల్లించాడు. అటుపైన ఆయన వెళ్ళిపోయారు."

ఆమె నవ్వుతూ గుమస్తా వైపు చూసింది.

"మోతీలాల్ సేట్ గారి బొంబాయి టెలిఫోన్ నంబరు మీకు తెలుసా?"

అతడు అడుగునున్న ఒక డైరెక్టరీతీసి కౌంటరుమీద పెట్టాడు.

"ఇది బొంబాయి టెలిఫోన్ డైరెక్టరీ. పేజీలు తిప్పిచూడండి!"

పేజీలు తిప్పి మోతీలాల్ సేట్ పర్సనల్ నంబర్ని ఆమె డైరీలో రాసుకుంది.

గుమస్తాకు థాంక్స్ చెప్పి ఆమె బయటకు నడిచింది. కారును యింటివైపు వేగంగా పోనిచ్చింది. హాల్లో అడుగుపెట్టింది. అశ్వద్ధామ ఇంట్లో లేడు. మిస్ సురేఖ ఫోన్ దగ్గరకు నడిచింది. రిసీవర్ యెత్తి బొంబాయికి STD కాల్ చేసింది.

"మోతీలాల్ సేట్ హియర్!" అందో కంఠం అటువైపునుంచి.

"నమస్తే సార్. నేను రామానుజం చెట్టియార్ సెక్రటరీని" అందామె.

"ఆయన ఎవరు?"

"ఆయన పేరు పొందిన డైమండ్ మర్చంట్."

"ఏం కావాలి?"

"ఆయన దగ్గర విలువైన శ్రీలంకా డైమండ్స్ వున్నాయి. ఒకసారి వాటిని మీకు చూపించాలని ఆయన కోరిక."

"నెలపైగా జర్మనీలో వుండి నిన్న సాయంత్రం నేను బొంబాయికి తిరిగొచ్చాను. ప్రస్తుతం ఐయామ్ వెరీ బిజీ.

వచ్చే నెల మొదటివారంలో నేను మద్రాసు రావచ్చు."

"థాంక్స్, ఇక్కడికొస్తే దాశప్రకాష్ హోటల్లోనే బసచేస్తారు గా?"

"మద్రాస్ యెప్పుడొచ్చినా అక్కడే వుంటాను."

"థాంక్స్. అంతా రామానుజం చెట్టియార్ గార్కి చెప్తాను" అని ఆమె రిసీవర్ పెట్టేసింది.

అంతా విచిత్రంగా వుంది. ఆలోచిస్తూ ఆమె సోఫాలో కూర్చుంది.

## 4

కిందనున్న డైనింగ్ గదిలో అశ్వద్ధామ, మిస్ సురేఖ కుర్చీల్లో కూర్చుని భోజనం చేస్తున్నారు. మరుగుజ్జు మంజూ సమీపంలో నిలబడి వాళ్ళకు కావలసిన పదార్ధాలను కడిస్తోంది.

తను కనుక్కున్నదంతా సురేఖ అతడికి చెప్పింది.

"రేఖా, నువ్వు చెప్పినదాన్నిబట్టి ఒక విషయం మనం వూహించవచ్చు. మోతీలాల్ సేట్, నాఖురూ ఒకరే అయివుండాలి!"

"యూ ఆల్ రైట్!"

"మరో విషయం. మోతీలాల్ సేట్ జర్మనీలో వుండి, నిన్నే బొంబాయి వచ్చాడు. యెవరో వ్యక్తి అతడి పేరుతో కొన్నిమేరా హోటల్లో చేరాడని తెలుస్తోంది. గదిలోనే అతడు వుండేవాడు. బయటకు రాలేదతను. నాఖురు వేషంలో అతడు బయటకొచ్చేవాడు. హోటల్ బిల్లు నాఖురు చెల్లించాడు. మోతీలాల్ వెళ్ళటం ఎవ్వరూ చూడలేదు!"

"బాగుంది, చెప్పండి!" అందామె.

"మోతీలాల్ గా నటించినతను ఏ టాక్సీలో నో

వెళ్లుండొచ్చు. ఆ టాక్సీ డ్రయివర్ని మనం కనుక్కో-
వాలి!"

బయట బూట్ల చప్పుడైంది. మంజూ వేగంగా బయటకెళ్ళి, తిరిగివచ్చింది.

"ఇన్స్పెక్టర్ ప్రతాప్ వచ్చారు. మీతో అర్జంటుగా మాట్లాడాలిట" అందామె.

"ఆయన్ని కూర్చోమని, హాట్ కాఫీ యియ్యి. కాస్సేపట్లో వస్తాను" అన్నాడు అశ్వద్ధామ.

మంజూ బయటకు వెళ్ళింది. తిరిగొచ్చి కాఫీ కప్పులో పోసి పట్టుకెళ్ళి ఇన్స్పెక్టర్కు అందించింది.

కొంతసేపయ్యాక గదిలోకొచ్చిన అశ్వద్ధామ, సురేఖలను చూసి యిన్స్పెక్టర్ ప్రతాప్ లేచాడు. ఏదో గొప్ప విజయాన్ని సాధించినట్లు ప్రతాప్ కళ్ళు మెరుస్తున్నాయి.

అందరూ సోఫాలో కూర్చున్నారు.

"అశ్వద్ధామగారూ, మీరు వెళ్ళిపోయాక ఎన్నో విషయాలు తెలుసుకున్నాను. నిన్న రాత్రి మోతీలాల్ సేట్ యెక్కిన టాక్సీ డ్రయివర్ని కలుసుకున్నాను. అతడు ఆ టాక్సీలో తిన్నగా విమానాశ్రయానికి వెళ్ళాడు. దిగిపోతూ టాక్సీవాడిని వుండమన్నాడు. తన నౌఖర్ని సెంట్రల్ స్టేషన్లో వదిలివెళ్ళమని డ్రయివర్తో చెప్పాడు. మోతీలాల్ చిన్న బాగ్ పట్టుకుని వెళ్ళిపోయాడు. పది నిమిషాల్లో ఒక బాగ్ పట్టుకుని నౌఖరు వచ్చాడు. మోతీలాల్ సేట్ వచ్చిన టాక్సీ అదేనా అని డ్రయివర్ని అడిగాడు. డ్రయివర్ అవునని చెప్పగానే అతడు టాక్సీ యెక్కాడు. అతడిని సెంట్రల్ స్టేషన్లో విడిచిపెట్టి టాక్సీ డ్రయివర్ వెళ్ళిపోయాడు" అన్నాడు

ప్రతాప్.

"నాఖురుతో ఏదేనా సామానుందా?" అడిగాడు అశ్వద్ధామ.

"కారులో వున్న ఒక పెట్టెను డ్రయివర్ నాఖురుకు అందించాడు."

"బాగుంది. యింకా ఏం కనుక్కున్నారు?"

"స్టేషన్‌లో పనిచేసే రైల్వే కూలీతో మాట్లాడి ఆ నాఖురు ఊటీ వెళ్ళాడని తెల్సుకున్నాను" అన్నాడు ఇన్స్పెక్టర్ ప్రతాప్.

"అదెలా తెలిసింది?" అశ్వద్ధామ అడిగాడు.

"సెంట్రల్ స్టేషన్‌లో టాక్సీ ఆగగానే ఒక కూలి అటు పరుగెత్తాడు, టాక్సీలోంచి దిగిన నాఖురుని చూడగానే అతడు నిరుత్సాహ పడ్డాడు. కానీ నాఖురు సామాను తీసుకోవాలని చెప్పాడు. కూలీ పెట్టెను తీసుకున్నాడు. నాఖురు టికెట్లమ్మే చోటుకు వెళ్ళాడు. సమీపంలో కూలీ నిలబడి వున్నాడు. అతడు ఊటీకి టికెట్ కొన్నాడు. పెట్టెను కంపార్టుమెంట్‌లో పెట్టి—కూలీ వేచి వున్నాడు. అతడు కూలీకి రెండు రూపాయలు యిచ్చాడు."

"ఆ నాఖురు యెలా వుంటాడో కనుక్కున్నారా?"

"అనేకమంది ద్వారా తెల్సుకున్నాను. పొడుగ్గా, బలంగా వుంటాడు. పంచ, చొక్కా ధరించాడు. తలపాగా వుంది. సన్నటి మీసాలు" అన్నాడు ప్రతాప్.

ఆలోచిస్తూ అశ్వద్ధామ గదిలో పచార్లు చేయసాగాడు. కొంతసేపయ్యాక యిన్స్పెక్టర్ ముందు అతడు ఆగాడు.

"ప్రతాప్ మీరు కనుక్కొన్న విషయాలు మనకు చాలా వుపయోగపడ్డాయి. మనం వెంటనే ఊటీ వెళ్ళాలి. నానాలాల్ హంతకుడు మనకు దొరకొచ్చు" అన్నాడు అశ్వర్థామ.

"అశ్వర్థామగారూ, ఇది శీతాకాలం. ఊటీలోని కొన్ని హోటల్సు మాత్రం తెరిచివుంటాయి. హోటలు ఇంపీరియల్ కి చాలా పేరుంది. కూనూరులో వున్న సబిన్ స్పెక్టర్ మృత్యుంజయరావుతో ఫోన్ లో మాట్లాడాను. వెంటనే ఊటీ వెళ్ళి అక్కడ దర్యాప్తు చెయ్యమని చెప్పాను. మృత్యుంజయరావు మారు వేషాలు వేయుటంలో ఆరితేరినవాడు. హోటలు ఇంపీరియల్లో బట్లర్ గా చేరి అతడు వారంరోజులపాటు అక్కడుండి అంతా గమనించి నాకు చెప్తాడు" అన్నాడు ప్రతాప్.

"హోటలు మేనేజర్ కి తనెవరో చెప్పి అతడు బట్లర్ గా వుంటాడా?"

"అవుసరంలేదు సార్ శీతాకాలంలో అక్కడ నౌఖర్లు దొరకరు. అందువలన ఆ హోటల్లో బట్లర్ ఉద్యోగం అడగ్గానే ఎవరికేనా యిస్తారు."

క్షణకాలం గదిలో నిశ్శబ్దంగా వుంది.

"అన్ని లక్షలు విలువచేసే వజ్రాలను పట్టుకుని నౌఖరులా నటించేవాడు ఊటీ యెందుకు వెళ్ళుంటాడు?" అడిగాడు ప్రతాప్.

"అతడు ఊటీ వెళ్ళటంలో ఆశ్చర్యంలేదు. శీతాకాలంలో ఊటీకి ఎవ్వరూ వెళ్ళరు. అనేక పట్నాలలో పోలీసులు తన కోసం వెతుకుతుండగా, ఊటీలో దొంగ విశ్రాంతి తీసుకోవచ్చు. అక్కడినుంచి రెండు మూడు

నెలల తిర్వాత మరెక్కడికైనా పారిపోవచ్చు"
అన్నాడు అశ్వద్ధామ.

"అశ్వద్ధామగారూ, మీరు చెప్పింది వింటూంటే ఊటీలో మనకు కావలసిన హంతకుడు వుండొచ్చు అని పిస్తోంది. మీరు కూడా వెంటనే ఊటీ వెళ్ళటం మంచి దనిపిస్తోంది. సబిన్స్పెక్టర్ మృత్యుంజయరావు మీకు సహాయపడ్తాడు."

అశ్వద్ధామ నవ్వుతూ సురేఖవైపు చూశాడు.

"వింటర్లో ఊటీ నీకు నచ్చుతుందా?"

"వెళ్దాం పదండి!" అందామె నవ్వుతూ.

"అయితే రాత్రి ఎక్స్ప్రెస్లో బయల్దేరి ఊటీ వెళ్దాం" అన్నాడు అశ్వద్ధామ.

ఇన్స్పెక్టర్ ప్రతాప్ లేచాడు. అశ్వద్ధామ అతడి వంక సూటిగా చూశాడు.

"ప్రతాప్, గజదొంగ రామ్మూర్తి గురించి మీకు తెలిసినదంతా చెప్పండి!"

"అతడు పొడుగ్గా, బలంగా వుంటాడు. అతడు మారువేషాలు బాగా వేసూంటాడు. అందువల్లనే అతడిని పట్టుకోడానికి డిటెక్టివ్ వాలిగారు యెంతో కష్టపడ వలసి వచ్చింది" అన్నాడు ప్రతాప్.

"ఇదంతా ఉపయోగపడ్తుంది" అన్నాడు అశ్వద్ధామ.

"అశ్వద్ధామగారూ, ఏదేనా అవుసరమైతే STD కాల్ చేసి నాతో మాట్లాడండి. నేను వెళ్ళొస్తాను" అని ప్రతాప్ తన జీప్ వైపు నడిచాడు.

సురేఖ భుజంమీద చెయ్యివేసి ఆమె కళ్ళలోకి చూశాడు అశ్వద్ధామ.

"రేఖా, ఊటీ చేరుకోగానే మనిద్దరం విడిపోవాలి.

నేను ఇంపీరియల్ హోటలుకి వెళ్తాను. అదే హోటలుకి నువ్వు వేరే వచ్చి గది తీసుకో!"

"అలాగే" అందామె.

## 5

ఊటీలోని ఇంపీరియలు హోటలు ముందు హాల్లో కూర్చుని అశ్వద్ధామ నలువైపులా చూశాడు.

అతడికి ఎడంవైపున ఎవరో వ్యక్తి ఒంటరిగా కూర్చుని పుస్తకం చదువుతున్నాడు. అతడు పొడుగ్గా, లావుగా వున్నాడు. పిల్లిగడ్డం.

కుడివైపున దూరంగా మరో వ్యక్తి వున్నాడు. అతడి వయస్సు నలభై దాటివుంటుంది. నల్లటి కళ్ళద్దాలు ధరించాడు. అతడు విస్కీ సేవిస్తూ కాగితంమీద ఏదో రాస్తున్నాడు.

ఎదురుగా నలుగురు మగవాళ్ళు కూర్చుని పేకాడుకుంటున్నారు. నెగ్గిన వ్యక్తికి డబ్బుకి బదులు చిప్స్ యిస్తున్నారు.

వారికి కొంచెం దూరంలో ఒక స్త్రీ ఒంటరిగా కూర్చుని స్వెట్టర్ అల్లుతోంది. ఆమె మెడలో వజ్రాల గొలుసు మెరుస్తోంది. ఆమె ధనవంతురాలై వుండాలి!

హోటలు మేనేజరు తన గదిలో కూర్చుని పేపరు తిరగేస్తున్నాడు. ఒకే ఒక బట్లర్ హాల్లో కూర్చున్న వాళ్ళకు కావలసిన వాటిని ఆలశ్యంగా అందిస్తున్నాడు.

అశ్వద్ధామ కాఫీ తాగుతూ సిగరెట్ వెలిగించాడు. అతడు హోటలుకొచ్చి రెండుగంటలు దాటింది. తన చుట్టూవున్న వాళ్ళలో యెవరో నానాలాల్‌ని హత్యచేసి వుండాలి. అందర్నీ అతడు గమనిస్తున్నాడు.

మిస్ సురేఖ వేగంగా హాల్లోకొచ్చి ఒక సోఫాలో

కూర్చుంది. "బాయ్!" అని పిల్చింది. బట్లర్ హాల్లో లేక పోవటంవలన ఆమెకెవరూ జవాబివ్వలేదు.

అశ్వద్ధామ మేనేజర్ గదివైపు నడిచాడు.

"ఏం కావాలి సార్?" అడిగాడు మేనేజర్.

"ఒక యువతి బాయ్‌ని పిలుస్తోంది. అతడు ఏమయ్యాడో!"

"డోంట్ బాదర్ సార్. నేను పంపిస్తాను" అని మేనేజర్ లేచాడు.

"మరికొందరు బేరర్స్‌ని పెట్టుకోకూడదూ?" అశ్వద్ధామ అడిగాడు.

"శ్రీకాకాలంలో దొరకరు సార్. నిన్న పొద్దుట ఒక బట్లర్‌ని పెట్టాను. వాడు చెప్పకుండా ఎక్కడికో పోయాడు. మరో బట్లర్ సాయంత్రం దొరికాడు. అతడే అన్ని పనులూ చూసుకుంటున్నాడు" అన్నాడు మేనేజర్.

అశ్వద్ధామ వెళ్ళి తన సోఫాలో కూర్చున్నాడు. మేనేజరు పంపిన బట్లర్ సురేఖ దగ్గరకు వెళ్ళటం అతడు గమనించాడు.

పిల్లిగడ్డం వ్యక్తి పుస్తకం చదవటంలో మునిగి వున్నాడు. అశ్వద్ధామ అతడివైపు చూశాడు. ఆలోచిస్తూ అశ్వద్ధామ లైటర్‌తో సిగరెట్ వెలిగిస్తూ, లైటర్ ప్రక్కన అమర్చిన బైనాక్యులర్స్ ద్వారా పిల్లిగడ్డం మనిషిని చూశాడు.

అతడు చదువుతున్న పుస్తకం పేరు చూసి అశ్వద్ధామ తృప్తిపడ్డాడు.

"దొరకని హంతకుడు!"

ఆ నవల పేరు చూడగానే అశ్వద్ధామ సోఫాలోంచి

లేచాడు. మెల్లిగా ముందుకు వెళ్ళాడు. పిల్లిగడ్డం వ్యక్తి ప్రక్కనుంచి తన గదివైపు నడిచాడు అశ్వద్ధామ.

మిస్ సురేఖ అతడివైపు అదోలా చూసింది.

## 6

అశ్వద్ధాము అప్పుడే లేచి తన వాచ్ వైపు చూశాడు. టైము నాలుగయింది.

బాత్ రూంలోకి వెళ్ళి మొహం కడుక్కొని అతడు సోఫాలో కూర్చున్నాడు.

గది తలుపు తోసి బట్లర్ ట్రే పట్టుకుని లోపలకు వచ్చాడు. ట్రేను టీపాయిమీద పెట్టి బట్లర్ అలాగే నిలబడిపోయాడు. అశ్వద్ధామ అతడివైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

గది తలుపు తోసి బట్లర్ అశ్వద్ధామ కెదురుగా వచ్చాడు.

"క్షమించండి. మీ పేరు హోటలు బుక్కులో కృష్ణమూర్తి అని వుంది. అది మీ అసలు పేరేనా?" బట్లర్ అడిగాడు.

"నా అసలు పేరు కాదని నువ్వనుకుంటున్నావా?" అన్నాడు అశ్వద్ధామ కోపంగా.

"అవసరాన్ని బట్టి కొందరు పేర్లు మారుస్తూ వుంటారు. అందుకని అడుగుతున్నాను, సార్."

ఆలోచిస్తూ అశ్వద్ధామ బట్లర్ వంక చూశాడు. సబిన్స్పెక్టర్ మృత్యుంజయరావు ఇతనేనేమో! బట్లర్ వెళ్ళిపోయాడు.

"ఆగు. నేను అశ్వద్ధామను. నువ్వెవ్వరు?"

బట్లర్ నవ్వుతూ వచ్చి అతడికి నమస్కరించాడు.

"మిమ్మల్ని కల్సుకున్నందుకు సంతోషం. నేను

సబిన్స్పెక్టర్ మృత్యుంజయరావుని. మద్రాసులోని నానాలాల్ హంతకుని కోసం యిక్కడ దర్యాప్తు సాగిస్తున్నాను" అన్నాడతను.

"సంతోషం! ఇంతవరకూ ఏదేనా తెలిసిందా?" అడిగాడు అశ్వద్ధామ.

"ఈ హోటల్లో వున్న అందర్నీ ఓ కంటితో చూస్తున్నాను. హాల్లో కూర్చునే పిల్లిగడ్డం మనిషి ప్రవర్తన అదో విధంగా వుంది. అతడి మీద నాకు అనుమానంగా వుంది, సార్."

"అతడిని నేనూ చూశాను" అన్నాడు అశ్వద్ధామ.

"కాని మరో విషయం నన్ను పీక్కుతింటోంది. నిన్న సాయంత్రం నేనిక్కడ చేరేముందు, ఒక బట్లర్ వుండేవాడు. పొద్దుట ఉద్యోగంలో చేరినతను అంత హఠాత్తుగా ఎందుకు మాయమయ్యాడు? ఆ బట్లర్ గాభరాగా బస్సెక్కి కూనూరువైపు వెళ్ళాడని తెల్సుకున్నాను. మనకు కావలసినవాడు అతడేనేమో అని నాకు అనుమానంగా వుంది."

"కొత్తగా వచ్చిన ఒక యువతిని యివాళ ముందు హాల్లో చూశాను. ఆమె ఎవరు?" అడిగాడు అశ్వద్ధామ.

"ఆమె పొద్దుటే వచ్చింది సార్. బుక్‌లో ఆమె పేరు జానకని రాసివుంది. చాలా అందమైన యువతి. అందరూ ఆమెవైపే చూస్తున్నారు. ఈ చలికాలంలో ఆమె యిక్కడికెందుకొచ్చిందో! అదంతా యింకా నేను కనుక్కోవాలి. తెలిశాక మీకు రిపోర్టు చేస్తాను."

బట్లర్ వేషంలో వున్న మృత్యుంజయరావు గట్టివాడే. అతడు అందర్నీ గమనిస్తున్నాడు అనుకున్నాడు అశ్వద్ధామ.

"నే వెళ్తాను సార్. మీ సహాయంతో నేనొచ్చిన పని పూర్తవుతుందని నా నమ్మకం."

"పూర్తవుతుంది" అన్నాడు అశ్వద్ధామ.

బట్లర్ వెళ్ళిపోయాడు. అశ్వద్ధామ తినడం ప్రారంభించాడు.

## 7

చీకటిపడింది. తోటలో తిరిగి అశ్వద్ధామ హోటలు నడవమ్మట నడుస్తున్నాడు. నడువ లైట్లు యింకా వెలగటం లేదు.

ఏదో ఆకారం గదిలోంచి బయటకొచ్చి వేగంగా వెళ్ళిపోవటం అతను గమనించాడు. మరి కొంత దూరం వెళ్ళి ఆ గదిముందు ఆగాడు. తాళంచెవి పెట్టే చిల్లు లోంచి లోపలకు చూశాడు. లోపల లైటు వెలుగుతోంది.

ఈ పక్క గదులన్నీ తాళాలు వేసున్నాయి. గదుల్లో లైట్లు లేవు. ఈ గదిలో లైటు ఎందుకుంది? ఈ గది యెవరిది?

స్కెలిటన్ కీతో తాళం తెరిచి అశ్వద్ధామ లోపలకు వెళ్ళాడు. గదిలో లైటు డిమ్‌గా వెలుగుతోంది. గదిలో మంచం, పైన పరుపు వున్నాయి. అశ్వద్ధామ మంచాని కటువైపు వెళ్ళాడు. అతడి కళ్ళను అతడే నమ్మలేకపోయాడు.

నేలమీద ఒకతను వెల్లకిలా పడున్నాడు. కత్తితో గుండెల్లో పొడిచి అతడిని చంపారని అశ్వద్ధామ క్షణంలో గ్రహించాడు.

ఈ శవాన్ని చూస్తూంటే యింతకుముందు తను మద్రాసులో చూసిన నానాలాల్ శవం గుర్తొచ్చింది. నానాలాల్‌ని కూడా యిలాగే గుండెల్లో పొడిచి

చంపారు!

ఇదంతా చూస్తూంటే నానాలాల్ హంతకుడు యీ హోటల్లో యెక్కడో వున్నాడనిపిస్తోంది! అయితే యితడు ఎవరు? ఇతడిని ఎవరు చంపారు?

ఆలోచిస్తూ అశ్వద్ధామ గది నలువైపులా చూశాడు. ఒక పెట్టె, బాగ్ గోడవారగా వున్నాయి. తెరిచి చూద్దామని అతడు దగ్గరగా వెళ్ళాడు.

అదే క్షణంలో గదిలోని లైట్ ఆరిపోయింది. తడుముకుంటూ అశ్వద్ధామ నడవమీదకు వచ్చాడు. ఎక్కడా లైట్లు లేవు. కటిక చీకటి.

అశ్వద్ధామ కదలకుండా అలాగే వుండిపోయాడు. రెండు బలమైన చేతులు అతడిని చుట్టేశాయి. మరు క్షణంలో రుమాలు అతడి ముక్కుమీద అదిమిపెట్ట బడింది.

ఏమిటిదంతా? అశ్వద్ధామ ఆలోచించే స్థితిలో లేడు. తల తిరిగినట్లయింది. అతడు కుప్పలా కూలిపోయాడు.

# 8

ఏదో గోల విని అశ్వద్ధామ అప్పుడే మేలుకున్నాడు. కళ్ళు నులుపుకొని అతడు చూశాడు. గదిలో యిద్దరు పోలీసు సబిన్స్పెక్టర్లు వున్నారు. కానిస్టేబుల్సు పచార్లు చేస్తున్నారు. గది తలుపు బార్లా తెరిచివుంది.

ఇదంతా కలా? ఏమిటిదంతా? మిస్ సురేఖ, పక్క గదిలో వుండే వ్యక్తి గుమ్మంలో నిలబడి అతడివైపు చూస్తున్నారు!

"మనకి అట్టే టైములేదు. గదంతా సోదా చేయండి" అరిచాడు ఓ సబిన్స్పెక్టర్.

అశ్వద్ధామ ఆశ్చర్యపోయాడు. తన గదిని సోదా

చేయటమా? ఎందుకూ?

అశ్వద్ధామ లేచి ముందుకు కదిలాడు. సబిన్స్పెక్టర్ కళ్ళలోకి చూశాడు. అలా చూస్తూంటే ఏదో అతడికి జ్ఞప్తికొచ్చింది.

"ఎవరు మీరు? మీకేం కావాలి?" అర్చాడు అశ్వద్ధామ.

"నేను సబిన్స్పెక్టర్ మృత్యుంజయరావుని. ఈయన ఊటీ సబిన్స్పెక్టర్ నాయక్. నీ నాటకం మాకు పూర్తిగా అర్ధమైంది, నిన్ను అరెస్టు చేస్తున్నాం" అన్నాడతను.

అశ్వద్ధామ అలాగే నిలబడి, మౌనంగా సిగరెట్ వెలిగించాడు. సబిన్స్పెక్టర్లు యిద్దరూ గదిని సోదా చేస్తున్నారు.

హోటలు మేనేజరు కూడా వచ్చి గుమ్మం దగ్గర నిలబడ్డాడు.

సబిన్స్పెక్టర్ మృత్యుంజయరావు ఏర్ బాగ్ లోని వస్తువులను బయట పడేశాడు. చిన్న పెట్టెను చూసి అమాంతంగా "నాయక్!" అని అర్చాడు.

నాయక్ పరుగెత్తుకొచ్చాడు. తన చేతిలో వున్న పెట్టెను తెర్చాడు మృత్యుంజయరావు. యాభై వజ్రాలు మెరుస్తున్నాయి!

తెరిచి వున్న పెట్టెను సబిన్స్పెక్టరు సమీపంలో వున్న వాళ్ళకు చూపించాడు. ఆ వజ్రాలను చూసి అశ్వద్ధామ తనలో తాను నవ్వుకున్నాడు.

పెట్టెను మూసి, దాన్ని సబిన్స్పెక్టర్ నాయక్ చేతిలో పెట్టాడు మృత్యుంజయరావు.

"నాయక్ గారూ, మనకు దొంగ దొంగిలించిన వజ్రా

లతో సహా దొరికాడు. వీటికోసమే ఇతడు నానాలాల్‌ని హత్య చేశాడు. దీనితో నేనీ వూరు వచ్చిన పని పూర్తయింది. మీరు నాకు చాలా సహాయపడ్డారు. అతడికి బేడీలు వెయ్యండి!"

ఇన్స్‌పెక్టర్ నాయక్ వెంటనే అశ్వద్ధామ చేతులకు బేడీలు వేశాడు. అది చూడలేక సురేఖ కళ్ళు మూసుకుంది. కాని అశ్వద్ధామ మౌనంగా వుండిపోయాడు.

"నాయక్‌గారూ, మీరు వెంటనే మద్రాస్‌కి STD కాల్ చేసి యీ వార్త యిన్స్‌పెక్టర్ ప్రతాప్‌గారికి చెప్పండి. ఆయన చాలా సంతోషిస్తారు" అన్నాడు మృత్యుంజయరావు.

"ఆయనతో ఏం చెప్పాలి?"

"కృష్ణమూర్తి అనే పేరుతో హంతకుడు యీ హోటల్లో వున్నాడని, మీ సహాయంతో నేను అతడిని అరెస్టు చేశాననీ చెప్పండి."

సబిన్స్‌పెక్టర్ నాయక్ వేగంగా బయటకు నడిచాడు.

పదిహేను నిమిషాల్లో నాయక్ తిరిగి వచ్చాడు.

"ఇన్స్‌పెక్టర్ ప్రతాప్‌గారితో అంతా చెప్పాను. వజ్రాలు కూడా దొరికాయన్నాను. ఆయన చాలా మెచ్చుకున్నారు. మీకు అన్నివిధాలా సహాయపడమన్నారు" అన్నాడు సబిన్స్పెక్టర్ నాయక్.

"ఎన్నేళ్ళగానో పోలీసు డిపార్టుమెంటులో వున్నాను. కాని యీ కేసు చాలా తొందరగా తేలిపోయింది. మీకు నేనిచ్చిన వజ్రాల పెట్టెను సాయుధ పోలీసులతో సహా మద్రాస్ పోలీస్‌వారికి పంపండి. ఈ హంతకుడిని నేను స్వయంగా, తిన్నగా మద్రాస్ తీసుకుపోతాను. నాకు ఒక జీప్ మీరిస్తే సౌకర్యంగా వుంటుంది"

అన్నాడు మృత్యుంజయరావు.

"హోటలు బయటనున్న మా జీప్‌లో వీరు అతడిని తీసుకుపోండి" అన్నాడు నాయక్.

ఇన్స్‌పెక్టర్ మృత్యుంజయరావు బయటకు నడిచాడు. కానిస్టేబుల్సు అశ్వద్ధామను బయటకు తీసుకుపోతుండగా మిస్ సురేఖ అడ్డు పడాలనుకుంది. కాని అతడి సౌజ్ఞను గుర్తించి ఆమె వూరుకుంది.

అశ్వద్ధామ ముందు సీటులో కూర్చున్నాడు. సబ్ ఇన్స్‌పెక్టర్ మృత్యుంజయరావు స్టీరింగ్ వెనుక సర్దుకున్నాడు. అశ్వద్ధామ సమీపంలో వున్న సురేఖవైపు చూస్తూ ఏదో సందేశాన్ని పంపాడు.

జీప్ మెల్లిగా ముందుకు కదిలింది.

## 9

పోలీసు వాన్ వచ్చి ఆగింది. వజ్రాల పెట్టెను పట్టుకొని ఇన్స్‌పెక్టర్ నాయక్ వాన్ వైపు నడుస్తున్నాడు.

మిస్ సురేఖ అతడిని ఆగమని హెచ్చరించింది. "నాయక్ గారూ, మిమ్మల్ని బుట్టలో వేసి చాలా తెలివిగా ఆ సబిన్స్‌పెక్టర్ మృత్యుంజయరావు మీ పోలీసు జీప్‌తో వెళ్ళిపోయాడు. ఆలస్యం చెయ్యకుండా యిప్పుడయినా నిజం తెల్సుకోండి" అందామె గంభీరంగా.

సబిన్స్‌పెక్టర్ ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు. అందమైన యువతి. ఆమెలో ఏదో ఠీవి వుంది.

"మీరు ఎవరు?" అడిగాడు నాయక్.

"నా పేరు సురేఖ. మీరు సంకెళ్ళువేసి జీప్‌లో పంపిన వ్యక్తి డిటెక్టివ్ అశ్వద్ధామగారు. నానాలాల్ హంతకుడిని పట్టుకోటం కోసం మేమిద్దరం యిక్కడకు

వచ్చాం. మీరు తెలివితక్కువగా, దొంగ సృష్టించిన రుజువులను నమ్మి అశ్వత్థామగార్కి బేడీలువేసి హంతకుడితో మీ జీప్‌లో పంపేశారు!" అందామె.

సబిన్స్‌పెక్టర్ నాయక్ స్తంభించిపోయినట్లు వుండిపోయాడు.

"మీరు చెప్పింది నాకు బోధపడలేదు" అన్నాడు ఓ నిమిషం తర్వాత.

సురేఖ అందరివైపు చూసింది. ఆమె చూపు ఇన్స్పెక్టర్ నాయక్ మీద నిలిచింది.

"విడదీసి చెప్తాను, వినండి. సబిన్స్‌పెక్టర్ మృత్యుంజయరావులా నటించినతను అసలు హంతకుడు. అతడు ఈ హోటల్లో బట్లర్‌గా పనిచేస్తున్నాడు. ఆ బట్లర్ పోలీసు దుస్తులు ధరించి, సబిన్స్పెక్టర్ మృత్యుంజయరావు తనేనని మీతో చెప్పాడని మీ సహాయంతో మీ జీప్‌లో పారిపోయాడు. అతడిని ఆపండి!"

హోటలు మేనేజరు యీ మాటలు వినగానే తటాలున నాయక్ దగ్గరకొచ్చాడు.

"సార్, ఈమె చెప్పింది నిజమే అనుకుంటాను. పొద్దుటనుంచీ మా దగ్గర పనిచేసే బట్లర్ పత్తాలేకుండా పోయాడు" అన్నాడు హోటలు మేనేజర్.

మిస్ సురేఖ కళ్ళు విజయవంతంగా మెరిశాయి. సబిన్స్‌పెక్టర్ నాయక్ అదోలా మిస్ సురేఖవైపు చూశాడు.

"మీరు చెప్పింది నిజమైతే యీ వజ్రాల పెట్టె అతడి గదిలో మాకెలా దొరికింది?" అడిగాడు నాయక్.

మిస్ సురేఖ నవ్వుతూ తన హేండ్‌బాగ్‌లోని ఒక పెట్టెను తీసి తెరిచింది. ఆ పెట్టెలో యాభై వజ్రాలు

ధగధగ మెరుస్తున్నాయి.

"ఈ వజ్రాలు మీకెలా వచ్చాయి?"

సబిన్స్పెక్టర్ నాయక్ అర్థంచేసుకోలేక వుక్కిరి బిక్కిరి అవుతున్నాడు.

"ఇవి అసలు వజ్రాలు. మీ పెట్టెలోవి నకిలీవి. వజ్రాల వర్తకుడిని అడిగితే నిజం మీకే తెలుస్తుంది" అందామె.

ఓ నిమిషం ఆలోచించి నాయక్ వాన్లో ఎక్కి, స్టీరింగ్ వెనుక కూర్చున్నాడు.

"సమీపంలో ఒక వజ్రాల వర్తకుడు వున్నాడు. అతడికి చూపెట్టి అడుగుదాం. మీరూ మాతో రండి" అన్నాడు నాయక్.

మిస్ సురేఖ వెంటనే వాన్ ఎక్కి నాయక్ పక్కనే కూర్చుంది. కానిస్టేబుల్స్ హడావుడిగా వాన్ వెనుక భాగంలో ఎక్కారు.

ఫర్లాంగు దూరంలో వున్న సేట్ లల్లూమల్ షాపు ముందు వాన్ ఆగింది. సబిన్స్పెక్టర్ నాయక్ వాన్ లోంచి కిందకు దిగాడు.

"మీరూ వస్తారా?" అడిగాడతను.

"మీరు వెళ్ళి త్వరగా చూపించిరండి. మనం వేగంగా వెళ్ళకపోతే ఆ హంతకుడు పారిపోతాడు" అంది సురేఖ.

నాయక్ షాపులోకి వెళ్ళాడు. పది నిమిషాల్లో అతడు తిరిగొచ్చాడు. మిస్ సురేఖ డ్రయివర్ సీట్లో కూర్చుని వుంది.

అతడామెవైపు విచారంతో చూశాడు.

"నన్ను క్షమించండి. పెద్ద పొరపాటు జరిగింది. నా దగ్గరున్నవి నకిలీ వజ్రాలే. నిన్న రాత్రి వాటిని యీ షాపులోనే ఎవరో కొన్నారుట" అన్నాడతను.

సురేఖ నవ్వింది.

"జీవితంలో ఇలా పొరపాట్లు జరుగుతూనే వుంటాయి. వాటిని గురించి విచారించి లాభంలేదు. మన కర్తవ్యం మనం యిప్పుడు చెయ్యాలి. ఆ జీప్ వెళ్ళి అప్పుడే అర గంట అయింది. ఆ జీప్ యింకా ఘాట్ రోడ్డమ్మట వెళ్తూనే వుంటుంది. మనం వేగంగా వెళ్ళి ఆ జీప్‌ని ఆపాలి! మీరు పక్కనే కూర్చోండి. నేను వాన్‌ని డ్రయివ్ చేస్తాను" అందామె.

వాన్ ముందు నుంచి వచ్చి సబిన్స్‌పెక్టర్ నాయక్ ఆమె పక్క సీటులో కూర్చున్నాడు. మిస్ సురేఖ వాన్ని విమానంలా పోనివ్వసాగింది.

సబిన్స్‌పెక్టర్ నాయక్ కళ్ళు భయంతో స్పీడా మీటర్‌ని చూశాయి.

"మీ డ్రైవింగ్ భయంకరంగా వుంది!"

"ఇంతలా వెళ్తేగాని వాళ్ళు మనకు చిక్కరు! కాస్సేపు కళ్ళు మూసుకోండి! యెంత వేగంగా వెళ్ళినా ప్రమాదం రాకుండా నేను చూస్తాను" అందామె.

మలుపుల్లో టైర్లు అరుస్తున్నాయి. వాన్‌లోని వాళ్ళందరు ప్రాణాలు బిగబట్టుకుని కూర్చున్నారు. సంకెళ్ళు వేసిన అశ్వద్ధామ రూపం ఆమె మెదడులో తిరుగుతోంది.

మిస్ సురేఖ వాన్ స్పీడును యింకా హెచ్చించింది.

# 10

ఊటీనుంచి మెట్టుపాలయం పోయే ఘాట్ రోడ్డు పాములా మెలికలు తిరిగింది. ఒక నిర్జన ప్రదేశంలో జీవ్ ఆగింది.

మృత్యుంజయరావు కిందకు దిగాడు. అశ్వద్ధామవైపు క్రూరంగా చూసి పళ్ళు పటపట కొరికాడు.

"జీవ్ ఆపావెందుకు?" అశ్వద్ధామ అడిగాడు.

అశ్వద్ధామ కోటు కాలర్ను అతడు లాగి పట్టుకున్నాడు.

"ఎవరితో చెలగాటం ఆడుతున్నావో తెలుసా?"

"తెలుసు. కాని నీతో నేనాడటం లేదు. నువ్వే నాతో ఆడుతున్నావు!"

"నోరు మూయ్!"

"ప్రస్తుతం నేను నీ చేతుల్లో వున్నాను. నువ్వు నన్ను ఏదైనా చేయొచ్చు!"

యమదూతలా అతడు అశ్వద్ధామకేసి చూశాడు.

"ఇంత దూరం నీ నోరు మూయడానికి తీసుకురాలేదు. మాట్లాడించడానికి తీసుకొచ్చాను."

అశ్వద్ధామ నవ్వాడు.

"నా గదిలోంచి నువ్వు పట్టుకెళ్ళిన ఆ వజ్రాల పెట్టెను ఎక్కడుంచావు?"

ఆశ్చర్యంతో అశ్వద్ధామ ఆలోచించసాగాడు. వజ్రాల పెట్టె తను పట్టుకెళ్ళాడా?

"మాట్లాడు!" పిడుగులా అర్చాడతను.

"నా గదిని సోదాచేస్తే ఆ పెట్టె నీకే దొరికిందిగా?"

"అదికాదు. ఆ పెట్టె నీ గదిలో నేనే పదేశాను.

నా గదిలోంచి నువ్వు పట్టుకెళ్ళిన పెట్టె గురించి నే నడుగుతున్నాను. అందులో నిజమైన వజ్రాలున్నాయి”
అన్నాడతను.

“అదంతా నాకు తెలియదు.”

మృత్యుంజయరావు తన జేబులోంచి పదునైన కత్తిని పైకి తీశాడు. జీప్ లోంచి అశ్వద్ధామను కిందకు లాగాడు. అతడిని రోడ్డుపక్కకు లాక్కెళ్ళాడు. రోడ్డు వారగా రాళ్ళు పేర్చబడి వున్నాయి. అటుపైన లోయ! రాళ్ళ మీదనుంచి పడితే మనిషి ముక్కలు చెక్కలవుతాడు.

“ఇప్పుడేనా నిజం చెప్తావా? లేకపోతే పక్కనున్న లోయలోకి నిన్ను తోసేస్తాను. చెప్పు! నిజం చెపితే నిన్ను వదిలేస్తాను!” అరిచాడతను.

క్షణకాలం అశ్వద్ధామ పక్కనున్న లోయలోకి చూశాడు. ప్రకృతి సౌందర్యం అతడి హృదయాన్ని ఆనందంతో నింపింది—

“జవాబియ్యి!”

“చావబోయే వారికి సంకెళ్ళు వేయకూడదని పెద్దలంటారు. ఈ సంకెళ్ళు తీసేసి నీ యిష్టమొచ్చినట్లు చేసుకో!”

“అయితే చెప్పవన్న మాట! ఆ వజ్రాలకోసం ప్రాణాన్ని వదులుకుంటావా?”

అశ్వద్ధామ గంభీరంగా నవ్వాడు. కోపంగా అతడిని రాయిమీదకు వాల్చి పట్టుకున్నాడు మృత్యుంజయరావు.

“ఒక్కతోపు తోస్తే మెలికలు తిరుగుతూ లోయలోకి పడిపోతావు!”

అశ్వద్ధామ మళ్ళీ నవ్వాడు.

కత్తి కొనను అశ్వద్ధామ గొంతుమీద పెట్టాడతను.

"ఆఖరిసారి అడుగుతున్నాను చెప్పు!"

"చెప్తాను" అన్నాడు అశ్వద్ధామ.

కత్తి వెనక్కి జరిగింది. అశ్వద్ధామ కొంచెం ముందుకు జరిగి నిలిబడ్డాడు.

ఏదో కారు నడుస్తున్న ధ్వని వినపడింది—ధ్వని యింకా ఎక్కువైంది. మృత్యుంజయరావు వడివడిగా జీప్ దగ్గరకు పరుగెత్తాడు.

మృత్యుంజయరావు జీప్‌లో కూర్చుని వెనక్కి చూస్తున్నాడు. దగ్గరవుతున్న పోలీస్ వాన్ అతడికగుపించింది.

గాభరాగా అతడు జీప్‌ను పోనిచ్చాడు. అశ్వద్ధామ రోడ్డుమీదే నిలబడిపోయాడు. పోలీస్ వాన్ దగ్గరకొచ్చింది. డ్రయివరు సీటులో వున్న సురేఖను చూడగానే అతడి కళ్ళు ప్రకాశించాయి.

అశ్వద్ధామ పక్కనే సడన్ బ్రేకుతో వాన్ ఆగింది. ఇన్స్‌పెక్టర్ నాయక్ కిందకు దిగాడు.

"క్షమించండి, సార్" అన్నాడు నాయక్.

"అవన్నీ తర్వాత! అతడు పారిపోతున్నాడు! అతడిని పట్టుకోవాలి!" అన్నాడు అశ్వద్ధామ.

సబిన్స్‌పెక్టర్ నాయక్ అశ్వద్ధామ చేతులకున్న బేడీలను తీసేశాడు. వెనక్కి వెళ్ళి వాన్‌లో ఎక్కాడు. ముందు సీటులో కూర్చుని అశ్వద్ధామ తలుపు మూశాడు. ఆప్యాయంగా సురేఖవైపు చూశాడతను.

"రేఖా, గో ఫాస్టు! ఆ జీప్‌ని ఆపాలి!" అన్నాడతను.

వాన్ వేగంగా ముందుకు పోయింది.

వాన్ మలుపులు తిరిగి విమానంలా వెళ్తోంది. ముందు

వెళ్తూన్న జీప్ యిప్పుడు కనిపిస్తోంది. జీప్‌ను చూసి ఇన్స్‌పెక్టర్ నాయక్ వుద్రేకంతో గెంతుతున్నాడు.

మరో మలుపు తిరిగేలోపల వాన్ జీప్‌ను దాటి పోయి అమాంతంగా ఆగింది.

మృత్యుంజయరావు జీప్‌లోంచి బయటకు దూకి పారి పోబోయాడు. అశ్వద్ధామ అతడివైపు దూకాడు. రెండు నిమిషాల్లో అశ్వద్ధామ చేతుల్లో అతను యిరుక్కు పోయాడు.

ఇన్స్‌పెక్టర్ నాయక్, కాన్‌స్టేబుల్స్, సురేఖ అక్కడకు పరుగెత్తుకొచ్చారు.

"నాయక్ గారూ, యితడి చేతులకు బేడీలు వేయండి" అన్నాడు అశ్వద్ధామ.

"నన్నే మోసం చేస్తావా, రాస్కెల్!" అని అరుస్తూ సబిన్స్‌పెక్టర్ నాయక్ అతడి చేతులకు బేడీలు వేశాడు.

"ఇతడిని వాన్‌లో కూర్చోబెట్టండి" అన్నాడు నాయక్.

కాన్‌స్టేబుల్స్ అతడిని యీడ్చుకుపోయి వాన్‌లో ఎక్కించారు. ఇన్స్‌పెక్టర్ నాయక్ అశ్వద్ధామ వంక చూశాడు.

"మీరు జీప్‌లో రండి, సార్. నేను వాన్‌లో వెళ్తాను" అన్నాడతను.

వాన్ కదిలింది. సురేఖ జీప్‌ను పోనిచ్చింది. ఆమె పక్కనే కూర్చున్నాడు అశ్వద్ధామ.

జీపును పోనిస్తూ తను కనుక్కున్నదంతా ఆమె అతడికి చెప్పసాగింది. అతడు మౌనంగా వింటూ సిగరెట్ వెలి గించాడు.

ఫ్లోటలు ఇంపీరియల్ కాంపౌండులో వాన్, జీపు

ఆగాయి. సబిన్స్పెక్టర్ నాయక్ జీపు దగ్గరకు పరుగెత్తు కొచ్చాడు.

"నాయక్ గారూ, మన పని యింకా పూర్తికాలేదు. హోటల్లో కళ్యాణి అనే స్త్రీ స్వెటర్ అల్లుతూ వుంటుంది. ఆమెను అరస్టు చెయ్యండి. రూమ్ నెంబర్ 20లో సబిన్స్పెక్టర్ మృత్యుంజయరావు శవం మంచం పక్కన పడుంటుంది."

ఇన్స్పెక్టర్ నాయక్ ఆశ్చర్యంతో అశ్వద్ధామవైపు చూశాడు.

"మరో విషయం. మద్రాస్‌లోని యిన్స్పెక్టర్ ప్రతాపుకు ఫోన్ చేసి, అతడిని వెంటనే ఇక్కడకు నేను రమ్మన్నానని చెప్పండి" అన్నాడు అశ్వద్ధామ.

"అలాగే సార్" అన్నాడు నాయక్.

అశ్వద్ధామ, మిస్ సురేఖ హోటలు ముందు హాల్లోకి వెళ్ళి సోఫాలో కూర్చున్నారు.

"విస్కీ అండ్ సోడా!" అన్నాడు అశ్వద్ధామ నీరసంగా.

# 11

మర్నాడు ప్రొద్దుట మిస్ సురేఖ గది అనేకమందితో క్రిక్కిరిసివుంది. అశ్వద్ధామ, ఇన్స్పెక్టర్ ప్రతాపు, సబిన్స్పెక్టర్ నాయక్, మిస్ సురేఖ, హోటలు మేనేజరు సోఫాల్లో కూర్చున్నారు. కానిస్టేబుళ్ళు గదిలో నిలబడివున్నారు.

"కళ్యాణిని అరస్టుచేశాం. ఆమె వజ్రాల వ్యాపారం చేస్తోంది. ఆమె ఢిల్లీనుంచి యిక్కడకు వచ్చింది. ఢిల్లీ పోలీసులు నిన్న రాత్రి ఆమె షాపును సోదాచేశారు. గజదొంగ రామ్మూర్తి యింతకుముందు దొంగిలించిన

వస్తువులెన్నో ఆమె షాపులో దొరికాయని నాకు వార్త అందింది" అన్నాడు యిన్స్పెక్టర్ ప్రతాప్.

"ఆమెకు మృత్యుంజయరావు హత్యతో సంబంధం లేదు. దొంగిలించిన వస్తువులను కొనటమే ఆమెచేసిన ముఖ్య నేరం" అన్నాడు అశ్వద్ధామ.

"అశ్వద్ధామగారూ, మొదటినుంచీ జరిగినదంతా మీరు చెప్పే అందరం సంతోషంగా వింటాం" అన్నాడు సబిన్స్పెక్టర్ నాయక్.

డిటెక్టివ్ అశ్వద్ధామ నవ్వుతూ నలువైపులా చూసి యిలా చెప్పసాగాడు. "మద్రాస్‌లో నానాలాల్ హత్య జరిగింది. లక్షలు విలువైన వజ్రాలను జేబులో పెట్టుకుని యింటికి వెళ్తూండగా అతడు చంపబడ్డాడు. అతడి దగ్గర వజ్రాలు వున్నాయన్న విషయం భార్యకీ, సేట్ మోతీ లాల్‌కీ మాత్రం తెలుసు. సేట్ మోతీలాల్ మీదే మన అనుమానం వుంటుంది.

"త్వరలో నా అనుమానం బలపడింది. బొంబాయిలో కోటీశ్వరుడైన సేట్ మోతీలాల్ అసలు మద్రాసు రాలేదు. అయితే యెవరో ఆ పేరుతో వ్యవహారిస్తూ వుండాలి! 'గజదొంగ' రామ్మూర్తి మద్రాసులో ఎక్కడో వుండొచ్చని వార్తలు అప్పుడే వచ్చాయి. 'గజదొంగ' రామ్మూర్తి మారువేషాలు వేయటంలో అఖండుడు. అతడే సేట్ మోతీలాల్ పేరుతో కన్నెమేరాలో 'గది' తీసుకుని వుండొచ్చని నేను అనుమానించాను.

"నానాలాల్ హత్యచేయబడిన రాత్రే సేట్ మోతీ లాల్ విమానాశ్రయానికి వెళ్ళాడు. అదే రాత్రి అతడు నాఖరు ఊటీకి ట్రెయిన్‌లో వెళ్ళాడు. నిజం చెప్పాలంటే మోతీలాల్, అతడి నాఖరు వేరువేరు మనుషులు

కారు. ఒకే మనిషి వారిద్దరిలా నటిస్తున్నాడు! ఇదంతా చెయ్యగలిగింది గజదొంగ రామ్మూర్తే! అందుకనే నేనూ, సురేఖ ఊటీ వచ్చాం.

"మా కంటే ముందు సబిన్స్పెక్టర్ మృత్యుంజయరావు యిక్కడకు చేరుకుని యీ హోటల్లో బట్లర్‌గా చేరాడు. ఆ బట్లర్ సాయింత్రానికి మాయమయ్యాడు. మరో బట్లర్ ప్రత్యక్షమయ్యాడు. ఈ బట్లర్ మరెవ్వరో కాదు—గజదొంగ రామ్మూర్తే!" మృత్యుంజయరావు పోలీసు ఉద్యోగని తెలుసుకుని అతడిని చంపేశాడు రామ్మూర్తి. తర్వాత యిక్కడ బట్లర్‌గా చేరాడు!"

అశ్వద్ధామ ఆగాడు.

"బ్రహ్మాండంగా వుంది సార్" అన్నాడు హోటలు మేనేజర్.

"ఒక సాయంత్రం బట్లర్ నా గదికొచ్చాడు. తనే సబిన్స్పెక్టర్ మృత్యుంజయరావని నాతో చెప్పాడు. నేను నమ్మాను. మృత్యుంజయరావును యిక్కడకు పంవుతున్నట్లు ఇన్స్పెక్టర్ ప్రతాప్ నాతో చెప్పారు. అతడు మారువేషంలో వుంటాడన్నాడు. ఆ పరిస్థితుల్లో నేను నమ్మక తప్పలేదు!" అన్నాడు అశ్వద్ధామ.

ఇప్పుడు మిస్ సురేఖ చెప్పసాగింది.

"చీకటి పడింది. నడవమ్మట నడుస్తున్నాను. బట్లర్, స్వెటర్ ధరిస్తూ కనిపించే కళ్యాణి ఒక గదిలోంచి బయటకొచ్చి అటు వెళ్ళిపోయారు. ఆ గదివైపు మెల్లిగా నడిచాను. వాళ్ళు లోపల ఏం చేస్తున్నారు. ఆ గది ఎవరిది? స్కెలిటన్ కీతో తెరిచి లోపలకు వెళ్ళాను. ఒక పెట్టె కనిపించింది. తెర్చి చూశాను. బట్టలకింద ఒక అట్టపెట్టె వుంది. తెర్చి చూశాను. యాభై వజ్రాలు

ధగధగ మెరుస్తున్నాయి!

బూట్ల చప్పుడు వినపడింది. బయటకు పరుగెత్తాను. తలుపు మూసి వెళ్ళిపోయాను. వజ్రాల పెట్టె నా బాగ్‌లో వుంది" అంది సురేఖ.

"ఆ బూట్ల చప్పుడు నాదే! ఆ గది ముందునుంచి ఎవరో వెళ్ళటం చూసి అదే గదిలోకి నేను వెళ్ళాను. మంచంపక్క పడున్న శవాన్ని చూశాను. అమాంతంగా లైట్లు ఆరిపోయాయి. నడవలోకి వెళ్ళాను. బలమైన చేతులు నన్ను చుట్టేశాయి. ఎవరో క్లోరోఫాం వాసన చూపించారు. నేను కింద కూలిపోయాను.

మర్నాడు పొద్దుటే లేచేసరికి నా గదినిండా పోలీసులున్నారు!" అన్నాడు అశ్వద్ధామ.

మిస్ సురేఖ అశ్వద్ధామ వైపు చూసింది.

"సబిన్స్పెక్టర్ మృత్యుంజయరావుగా నటిస్తున్నా అతడితో మీరు ఒంటరిగా జీపులో వెళ్ళటం నాకు నచ్చలేదు" అంది సురేఖ.

"అవును, సార్. మీరు మౌనంగా వుండిపోయారు. నాతో నిజం చెప్పివుంటే మిమ్మల్ని పంపేవాడిని కాను. అతడు మిమ్మల్ని చంపుతాడేమో అని తర్వాత నేను చాలా భయపడ్డాను" అన్నాడు సబిన్స్పెక్టర్ నాయక్.

అశ్వద్ధామ గంభీరంగా నవ్వాడు.

"క్రితం రాత్రి క్లోరోఫామ్ వాసన చూపించి అతడు నన్ను మోసుకెళ్ళి నా గదిలో పడేసి తలుపుకు తాళంవేశాడు. నానాలాల్‌నీ, మృత్యుంజయరావునీ ఒక పోటుతో చంపినవాడు నడవలో చీకట్లో నన్నెందుకు చంపకుండా వదిలేశాడు? నాతో అతడికేదో పని వుండుండాలి! తన పని అయిందాకా అతడు నన్ను

చంపడు! ఆ పని ఏమిటో విళ్ళి తెల్సుకుందామని అతడితో మౌనంగా వెళ్ళాను. నా వెనుక రమ్మని రేఖకు సౌజ్ఞ చేశాను" అన్నాడు అశ్వద్ధామ.

"అశ్వద్ధామగారూ మీరు చెప్పింది చాలా లాజికల్‌గా వుంది సార్! అసలు వజ్రాలపెట్టెను మీ రెక్కడో దాచారని అతడి నమ్మకం" అన్నాడు ఇన్స్పెక్టర్ ప్రతాపు.

"ఆ పెట్టె మిస్ సురేఖ బాగ్‌లో వుందని అతడికి తెలియదు" అన్నాడు నాయక్.

"అది అప్పట్లో నాకూ తెలియదు" అన్నాడు అశ్వద్ధామ నవ్వుతూ.

"గజదొంగ రామ్మూర్తినీ, పోయిన వజ్రాలనూ మాకు అప్పగించినందుకు మీ యిద్దర్కీ మా ధన్యవాదాలు" అన్నాడు యిన్స్పెక్టర్ ప్రతాప్, తన చూపును అశ్వద్ధామ సురేఖలవైపు పోనిస్తూ.

—:ఐపోయింది:—

సీరియల్

# రక్తపుటేర్లు

వసుంధర

(గత సంచిక తరువాయి)

బొడ్లో చాకును అతడికి అందించింది. అప్పుడు లేచి నిల బడింది.

"భగవంతుడా — ఈ బాధల్ని ఓర్చుకునే శక్తి నాకు ప్రసాదించు —" అంటూ మనసులోనే దేవుణ్ణి ప్రార్థించు కుంది.

గోడవారకు వెళ్ళింది. వంటిమీద ఉన్న బట్టల్ని ఒక్కొక్కటే విప్పి ఓ పక్కగా పెట్టింది.

ఆమె సిగ్గుపడడంలేదు. ప్రతాప్ వద్ద ఆమెకు సిగ్గులేదు. సిగ్గుపడడం ప్రతాప్ హర్షించడు. ఆమె అతడి వంక చూసింది.

ప్రతాప్ కుడిచేతిలో నిమ్మకాయ వుంది. రెండో చేతిలో చాకు వుంది. అతడి కనులు మూతపడి వున్నాయి. ఏవో పదాల్ని ఉచ్చరిస్తున్నా డతను.

తను బట్టలు విప్పినపుడు బయటపడ్డ కారం పొట్లం తీసుకుంది సావిత్రి. నడుచుకుంటూ వెళ్ళి అతడి చేతిలో నిమ్మకాయ పక్కన వుంచింది. తర్వాత గదిలో మూలగా వున్న బేతాళ విగ్రహాన్ని సమీపించి అక్కడ వెల్లకితలా పడుకుని కళ్ళు మూసుకుంది.

"భగవాన్! అంతా నీదే భారం—" అనుకుం దామె.

అప్పుడు ప్రతాప్ లేచాడు. కనులువిప్పాడు. సావిత్రిని సమీపించాడు. ఆమె ముందు చతికిలపడ్డాడు. నిమ్మ కాయనూ, కారం పొట్లాన్నీ బేతాల విగ్రహం పాదాల వద్ద ఉంచాడు. ఒక చేతిలో చాకు ఉంచుకుని రెండో చేత్తో రెండుసార్లు ఆమె శరీరాన్నంతా తడిమాడు. ఉన్నట్లుండి అతడి చూపుడువేలు ఒక చోట ఆగి పోయింది.

అంతవరకూ సావిత్రి ఆ స్పర్శా సౌఖ్యాన్ని అనుభ విస్తోంది. అప్పుడామె శరీరంలో మళ్ళీ వణుకు ప్రారంభ మైంది. తన కష్టం ప్రారంభమైందని ఆమెకు తెలుసు. ఆమె పళ్ళు బిగించింది.

ప్రతాప్ తన వేలు ఆగిన చోట ఓసారి పరీక్షించి చూశాడు. చూపుడు వేలుతో రెండుసార్లు రుద్దాడక్కడ. తర్వాత నెమ్మదిగా పెదవులతో ఆ ప్రాంతాన్ని స్పృశిం చాడు.

బొడ్డుకు కాస్త పక్కగా అతడి లేత పెదవుల స్పర్శ- సావిత్రిని యేవో లోకాలకు తీసుకువెళ్ళిన మాట నిజం. కానీ ఆ లోకాల్నుంచి దభీమని క్రింద పడిపోవడానికి ఎంతో సేపు పట్టదని కూడా ఆమెకు తెలుసు.

ప్రతాప్ నిమ్మకాయను తీసుకుని చాకుతో రెండుగా కోశాడు. తర్వాత కారం పొట్లం విప్పాడు.

అప్పుడు........

సావిత్రి తన శరీరానికి స్పర్శాజ్ఞానం నశించిపోతే బాగుండునని అనుకుంది.

కొద్ది క్షణాల క్రితం అతడి పెదవులు స్పృశించిన

సలాన్ని అంతే .... మృదువుగా యిప్పుడు చాకు స్పృశించింది.

సావిత్రి పుష్టిగా ఉన్న మనిషి. ఆమెలో రక్తప్రసరణ ఎలా ఉన్నదో తెలియదు కాని చాకు తగిలినచోట రక్తం చిమ్మింది.

ప్రతాప్ మెరుస్తున్న కళ్ళతో ఆ రక్తాన్ని చూస్తూ-మాంత్రికుడి పద్ధతిలో—"జై బేతాళా!" అంటూ నిమ్మ చెక్క పిండాడు ఆ గాయంమీద. చెక్క పూర్తి అయినాక ఓ మూలగా విసిరి కారం పొట్లం తీశాడు.

పుండుమీద పులుపూ, కారం....

సావిత్రి భరించలేక పోతోంది. కానీ ఓర్చుకుంది. ఒక్క కేక కూడా పెట్టలేదు.

"నీకు ఓర్పు ఎక్కువ. చాలా మంచి అమ్మాయివి—" ప్రతాప్ ఆమెను మెచ్చుకుని మళ్ళీ ఆమె శరీరం తడమడం మొదలు పెట్టాడు.

బేతాళుడి పాదాలపద్ద యింకా మరో నిమ్మచెక్క ఉన్నది.

* * *

అతని పేరు రామకృష్ణ.

అప్పుడే ట్రెయిన్ దిగాడు. చేతిలోని అడ్రస్ ఓసారి చూసుకున్నాడు. భుజాన ఉన్న ఎయిర్ బాగ్ సరిచేసుకుని స్టేషన్ బయటకు వచ్చాడు.

రిక్షావాళ్ళతన్ని చుట్టుముట్టారు.

రామకృష్ణ ఓ రిక్షాలో ఎక్కాడు.

"బేరమాడరేం బాబూ—" అన్నాడు వాడు ఆశ్చర్యంగా.

"నువ్వు న్యాయంగా యేమడిగితే అదిస్తాను. బేర

మాడడం నా కిష్టముండదు. నే నింతవరకూ ఎప్పుడూ దేనికీ భేరమాడలేదు—"

"భేరమెక్కువ చెబితే యేం చేస్తారు?" రిక్షావాడు పెడల్ తొక్కుతూ అన్నాడు.

"నాకు న్యాయమనిపించిందే యిస్తాను—" అన్నాడు రామకృష్ణ.

"నే నొప్పుకోకపోతే?"

"ఓసారి వెనక్కి తిరుగు—" అన్నాడు రామకృష్ణ.

రిక్షావాడు అప్రయత్నంగా వెనక్కు తిరిగి ఉలిక్కిపడ్డాడు. వాడికి వళ్ళంతా చెమటలుపట్టాయి. అతడి చేతిలో రివాల్వర్ ఉంది.

"దీంతో పేల్చేస్తాను—" అన్నాడు రామకృష్ణ.

రిక్షా వేగం హెచ్చింది.

"ఇంతవరకూ నేను ఒక్కహత్య కూడా చెయ్యలేదు-" అన్నాడతను మళ్ళీ.

రిక్షా గమ్యస్థానం చేరింది.—"ఇదీ బాబూ గాంధీ బొమ్మ!"

రామకృష్ణ దిగడానికి సంసిద్ధుడయ్యాడు. "ఇప్పుడు రఘురాంగా రిల్లెక్కడో కనుక్కోవాలి—"

"తమరు దిగకండి బాబూ—యేకంగా యింటిదగ్గరే విడిచి వెడతాను—" అన్నాడు రిక్షావాడు.

మరో అయిదు నిముషాల్లో రిక్షా రఘురాం యింటి ముందు ఆగింది.

"ఎంతివ్వాలో చెప్పు!"

"తమకు తెలవదా బాబూ—"

"తెలియదు—"

"ఎంత తోస్తే అంతివ్వండి బాబూ—" అన్నాడు

రిక్షావాడు. ఇప్పుడు రామకృష్ణ చేతిలో రివాల్వర్ లేదు. కానీ రిక్షావాడికి ఇంకా కనిపిస్తూనే ఉంది. అంకె చెప్ప డానికే భయపడిపోతున్నాడు.

"భయపడకు. అసహాయులపైన చేయెత్తే బలహీనత నాకు లేదు. మామూలుగా యేమడుగుతావో అడుగు— నిన్నేం చెయ్యను—"

రిక్షావాడు అతి కష్టంమీద—"రెండున్నరిప్పించండి బాబూ—" అన్నాడు.

"రెండున్నరా....?" అన్నాడు రామకృష్ణ నమ్మ లేనట్లు.

"పోనీ రెండిప్పించండి బాబూ—" అన్నాడు రిక్షా వాడు కంగారుగా—అతనప్పుడే జేబులో చెయ్యిపెట్టి రివాల్వర్ తీసినట్లుంది వాడికి.

రామకృష్ణ ఓ అయిదు రూపాయల నోటు వాడి కిచ్చాడు—"నా అభిప్రాయంలో యిక్కడికి నాలుగైనా యివ్వాలి. ఎక్కువ అడగనందుకు రూపాయ బోనస్— పట్టుకుపో—"

రిక్షావాడు అతడి పాదాలు స్పృశించినంత పని చేశాడు.

రామకృష్ణ వారించి—"ఒక్క రూపాయకోసం సాటి మనిషి కాళ్ళు పట్టుకుంటావా? ఇలాంటి బానిస మన స్తత్వం నాకు నచ్చదు—వెళ్ళు—" అన్నాడు.

"బాబు చాలా తమాషా మనిషి—" అనుకుంటూ వెళ్ళిపోయాడు వాడు.

రామకృష్ణ కాలింగ్ బెల్ మ్రోగించి మరోసారి ఎయిర్ బాగ్ సవరించుకున్నాడు. తలుపులు తెరుచు కున్నాయి.

గుమ్మంలో జాహ్నవి కనబడింది.

రామకృష్ణ మర్యాదను కూడా మరిచిపోయి ఆమెవైపే చూస్తూండిపోయాడు. తలుపుతీయగానే అలాంటి సుందరి దర్శనమిస్తుందని అతడు అనుకోలేదు.

ఆమె పచ్చటి చీర కట్టింది. అదే రంగు బ్లవుజు వేసుకుంది. గాజులు, బొట్టు అన్నీ అదే రంగు. అన్నీ ఆమె శరీర ఛాయతో కలిసిపోయాయి.

"రఘురాంగారు లేరండీ?" ఇదీ అతను అడగాలనుకున్న ప్రశ్న.

కానీ—"వాటే స్టన్నింగ్ బ్యూటీ—" అన్న మాట అప్రయత్నంగా అతడి నోటినుంచి బయటకు వచ్చింది.

"ఎవరండీ మీరు?" అంది జాహ్నవి ఇబ్బందిగా.

"వాటే స్వీట్ వాయిస్!" అన్నాడు రామకృష్ణ మళ్ళీ. అతడింకా ఈ లోకంలోకి రాలేదు.

జాహ్నవి చటుక్కున లోపలకు వెళ్ళి తల్లికి విషయం చెప్పింది.

కృష్ణవేణమ్మ వచ్చేసరికి కూడా రామకృష్ణ గుమ్మంలో యింకా అలాగే షాక్ తిన్నవాడిలా నిలబడి ఉన్నాడు.

"ఎవరు బాబూ నువ్వు?" అంది కృష్ణవేణమ్మ.

"నా పేరు రామకృష్ణ. ఢిల్లీ నుంచి వస్తున్నాను—" అన్నాడతను అప్పటికి తేరుకుని.

"ఢిల్లీ నుంచా?" అందామె ఆరమోడ్పు కన్నుల్లో. చటుక్కున-

"మరి ఆయనేరీ?" అంది కృష్ణవేణమ్మ.

"ఆయనంటే యెవరండీ?" అన్నాడు రామకృష్ణ.

కృష్ణవేణమ్మ వయస్సు నలభై అయిదుకు దగ్గర్లో ఉంటుంది. అయినా ఆమెకు భర్త పేరు చెప్పాలంటే

సిగ్గే! ఆమె తడబడి—"ముందు లోపలకు రా బాబూ—" అని తను లోపలకు వెళ్ళిపోయింది.

పరిస్థితి అర్థంకానట్లుగా అతను వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు.

కృష్ణవేణమ్మ లోపలికి వెళ్ళి—"అతను ఢిల్లీ పెళ్ళికొడుకనుకుంటూనే? నువ్వెళ్ళి నాన్నగారి సంగతి అడిగి రా—ఆయనసలే మతిమరుపు మనిషి. ఇతన్నిలా స్టేషన్నించి యింటికి పంపి తనెక్కడకు వెళ్ళిపోయారో ఏమో—" అంది జాహ్నవితో.

"అతను ఢిల్లీ పెళ్ళికొడుకైతే నే వెళ్ళి మాట్లాడితే యేం బాగుంటుందమ్మా—నువ్వెళ్ళు—" అంది జాహ్నవి.

"ఢిల్లీ పెళ్ళికొడుకని నీకు తెలియదుగా. కాదనుకుని వెళ్ళు. అసలతనెవరో, మనింటికెందుకొచ్చాడో తెలుసుని రా-సమయానికి వాడింట్లో ఉండడు. నేనేమో ఆ కుర్రాడితో యేం మాట్లాడుతానూ—" అంది కృష్ణవేణమ్మ.

"ఏ సమయానికి అన్న యింట్లో ఉన్నాడు కనుక—నాకేం—నేను వెళ్ళి మాట్లాడడానికి యే భయమూ లేదు—నువ్వే అభ్యంతరం పెడతావని భయం—అంతే—" అంటూ జాహ్నవి ఉత్సాహంగా రామకృష్ణ దగ్గరకు వెళ్ళింది.

జాహ్నవిని చూడగానే రామకృష్ణకు మతిపోయినట్లయింది.

"తంతే బూరెల గంపలో పడ్డట్టయింది-" అని గొణుక్కున్నాడు.

జాహ్నవి అతన్ని సమీపించి ఓ కుర్చీలో కూర్చుని—

"మీరు ఎవరికోసం వచ్చారో, ఎందుకోసం వచ్చారో చెబుతారా?" అనడిగింది.

రామకృష్ణకు ఆమె పెదవుల చలనం కనబడింది. ఏదో తియ్యని స్వరం వినబడింది. ఏం మాట్లాడిందో తెలియ లేదు—"మరొక్కమారు మీ ప్రశ్న అడుగుతారా?" అన్నాడు. ఆమె అడగ్గా జాగ్రత్తగా విన్నాడు.

"నా పేరు రామకృష్ణండి. నేనిక్కడకు వస్తానని రఘురాంగారికి తెలుసు. ఇది రఘురాంగారిల్లే కదాండీ!" అన్నాడతను.

జాహ్నవి ఆశ్చర్యంగా—"ఆయ నూళ్ళో లేరండి. ఈ వేళో రేపో వస్తారనుకుంటున్నాం. మీరు ఢిల్లీ నుంచి వచ్చారటగా. ఢిల్లీలో మా నాన్నగారిని కలుసుకో లేదా?" అనడిగింది.

"ఆయన ఢిల్లీ వెళ్ళినట్టు నాకు తెలియదు. మీ ఇంట్లో వో గది అద్దెకు కావాలి నాకు—" అన్నాడు రామ కృష్ణ.

"మా యిల్లు యెవరికీ అద్దెకివ్వరే!" అంది జాహ్నవి.

"తెలుసునండి. కానీ అఫీషియల్ రికమెండేషన్ మీద వచ్చాను—" అన్నాడు రామకృష్ణ ఆమెవంక పరీక్షగా చూస్తూ.

"మీకు మా నాన్నగారు తెలుసా?" అంది జాహ్నవి.

"తెలియదండి. కానీ మా బాస్ ఆయన కుత్తరం రాశారు—"

జాహ్నవి లోపలకు వెళ్ళింది. రామకృష్ణ దిగులుగా ఆమె వెళ్ళినవైపే చూస్తున్నాడు. ఆమెతోపాటే తన చైతన్యమంతా పోతున్నట్లుంది. ఆమె పూర్తిగా కను

మరుగు కాగానే అతను జేబు తడుముకున్నాడు. రివాల్వర్ తగిలింది.

జాహ్నవి లోపలకు వెళ్ళి తల్లితో—"అమ్మా! అతను కాబోయే అల్లుడు కాడు. ఇల్లు అద్దెకు కావాలట—" అంటూ వివరాలు చెప్పింది.

ముక్కూ మొహం తెలియనివాణ్ని యింట్లో ఉంచుకుందుకు కృష్ణవేణమ్మ భయపడింది. కాసేపు తర్జనభర్జనలు జరిగేక కృష్ణవేణమ్మ రామకృష్ణ దగ్గరకు వచ్చి—"చూడు బాబూ—యిల్లద్దెకిచ్చే ఉద్దేశ్యం మాకు లేదు. కానీ ఆయన నీకు గది యిస్తానన్నారన్నట్టు చెబుతున్నావు. ఏమీ అనుకోకపోతే ఓ రెండ్రోజులాగి రాకూడదూ—" అంది రామకృష్ణతో.

"అమ్మా—మీ యిబ్బంది నాకు తెలుసు. నా సంచీ మీ యింట్లో ఉంచండి చాలు. రోజూ సాయంత్రం వచ్చి ఆయన గురించి వాకబు చేసి వెడుతూంటాను. వస్తాను-" అంటూ రామకృష్ణ అక్కణ్నించి లేచాడు.

అతనింకా నాలుగడుగులైనా వేయకుండా యింటి ముందు రిక్షా ఆగింది. రిక్షాలోంచి రఘురాం దిగాడు.

దూరంగా గుమ్మంలోంచి చూస్తున్న జాహ్నవి—"నాన్నగారొస్తున్నారు—" అంటూ ఒక్క పరుగున గుమ్మంలో చేరింది.

రఘురాం రామకృష్ణను చూసి అతడు చెప్పింది విని—"సరే—నేను సమయానికే వచ్చానన్నమాట—మీ బాస్ నాకు ఢిల్లీలో అన్నీ చెప్పాడు. నువ్వు మా ఇంట్లో ఉండొచ్చు" అన్నాడు.

అప్పటికప్పుడు రామకృష్ణకు గది ఏర్పాటయిపోయింది.

"పెళ్ళికొడుకు రాలేదా?" అనడిగింది కృష్ణవేణమ్మ.

"వచ్చాడు. కానీ డైరక్టుగా మనింటికి తీసుకురావడం నాకిష్టం లేకపోయింది. అందుకని మధ్యలో కామేశ్వర రావుగారింట్లో ఉంచి వచ్చాను. అందుకే రావడం ఆలస్య మయింది—" అన్నాడు రఘురాం.

"మరి చూపు లెప్పుడు?"

"ఈ రోజే. సాయంత్రం ఆరింటికి!" అని—"పాపం మన జాహ్నవి గార్డెన్ కెళ్ళే సమయమేమో!" అన్నాడు రఘురాం.

"లేదండీ-అది రెండ్రోజుల్నించి గార్డెన్‌కు వెళ్ళడం మానేసింది—" అంది కృష్ణవేణమ్మ.

రఘురాం ఆశ్చర్యపడి — "నిజమేనా అమ్మా!" అన్నాడు.

జాహ్నవి తండ్రివంక తమాషాగా చూసింది. ఆమె అవుననలేదు. కాదనలేదు. తండ్రి మాత్రం యింకేమీ అడగలేదు.

"సుకుమార్ యింట్లో లేడా?" అన్నాడు రఘురాం.

"ఈ వేళప్పుడు వాడింట్లో ఉంటాడా?" అంది కృష్ణ వేణమ్మ.

"ఉంటే బాగుండును. కామేశ్వరరావుగారింటికి పంపి అబ్బాయితో కాసేపు కాలక్షేపం చేయమని ఉండే వాణ్ని—" అన్నాడు రఘురాం.

"ఒకోసారి భోజనానికి కూడా సరిగ్గా రాడు ఇంటికి" అంది కృష్ణవేణమ్మ.

వీళ్ళ కబుర్లు అవుతూండగానే రామకృష్ణ తన గది లోంచి బయటకు వచ్చి—"బహుశా రాత్రికి గానీ రానేమోనండి!" అన్నాడు.

"భోంచేసి వెళ్ళకూడదా బాబూ—" అంది కృష్ణవేణమ్మ మొహమాటానికి.

"ఇలాగంటున్నానని యేమీ అనుకోకండి. పండుగయినా సరే మీ ఇంట్లో భోజనానికి నన్ను పిలవకండి-" అన్నాడు రామకృష్ణ.

జాహ్నవి, ఆమె తలిదండ్రులు కూడా ఆశ్చర్యపోయి చూస్తూండగా రామకృష్ణ చరచరా నడుచుకుంటూ అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

* * *

ఆరడుగుల ఎత్తు. సన్నటి గుండు. గుండుకు బదులు క్రాపుండి ఉంటే అందగాడనిపిస్తుంది.

అతను గదిలో అటూ యిటూ అసహనంగా పచార్లు చేస్తూ మధ్యలో టైమ్ చూసుకుంటున్నాడు. విసుగ్గా యేమో గొణుక్కుంటున్నాడు.

కాలింగ్ బెల్ మ్రోగింది.

అతను పరుగున వెళ్ళి తలుపు తీశాడు.

పోస్టుమన్!

నిరుత్సాహం అతడి ముఖంలో కొట్టొచ్చినట్లు కనబడింది. పోస్టుమన్ అతడికి ఓ మనియార్డరు రసీదు ఇచ్చి వెళ్ళిపోయాడు.

పోస్టుమన్—మనియార్డరు రసీదు—రెండూ కలిపి అతడి అసహనాన్ని యెంతగా పెంచాయో తలుపు వేసినప్పుడైన శబ్దం సూచించింది.

అతను తిరగడం మానేసి కుర్చీలో కూర్చున్నాడు. చొక్కా జేబులోంచి ఓ ఫోటో తీశాడు. "జాహ్నవీ—యూ ఆర్ రియల్లీ బ్యూటిఫుల్-" అంటూ ఆ ఫోటోను ముద్దు పెట్టుకున్నాడు. ఆ ఫోటోను జేబులో పెట్టుకుని

డేంజర్ చేత ఆ ఫోటో హత్య చేయబడ్డాక—ఆ ఫోటోలో మనిషి బ్రతకటం ఇంతవరకూ జరుగలేదు.

ఇప్పటికి డేంజర్ ఆరు ఫోటోల్ని హత్య చేశాడు. ఆ ఫోటోలకు చెందిన ఆరుగురు మనుషులూ బ్రతికిలేరని వేరే చెప్పనవసరంలేదు.

పక్కనున్న కుర్చీముందున్న బల్లపైన వున్న ఫోటో ప్రతాప్‌ది. ఆ ఫోటోపై ద్వేషాన్ని పెంచుకోవాలని డేంజర్ ఎంతకాలంగానో ప్రయత్నిస్తున్నాడు. అయితే డేంజర్ నిజంగానే జాహ్నవిని ప్రేమిస్తున్నాడు. ఆమె ప్రతాప్‌ని ప్రేమిస్తోందని తెలుసు. ప్రతాప్‌ని చంపితే ఆమె మనసు బాధపడదూ? ఈ ఒక్క బలహీనత కారణంగా అతడా ఫోటోని హత్య చేయలేకపోతున్నాడు.

డేంజర్ చొక్కాలకెప్పుడూ రెండు జేబులుంటాయి. ఒక జేబులో జాహ్నవి మరో జేబులో ప్రతాప్. ఒక జేబులో ప్రేమ. మరో జేబులో ద్వేషం. ఏదో ఒక క్షణాన తనలోని ద్వేషం పెచ్చుమీరి ఆ ఫోటోను హత్య చెయ్యనివ్వకపోతుందా అన్నది డేంజర్ ఆలోచన. అందుకే అతడి పంట్లాం జేబులో ఎప్పుడూ చాకు వుంటుంది.

ఈ రోజు అతడి ఆలోచనల్లో జాహ్నవి లేదు.

అతడు శ్రీకాంత్ కోసం ఎదురుచూస్తున్నాడు.

హోటలు స్వప్నాలో ఈ రోజు ప్రఖ్యాత కాబరే డ్యాన్సర్ మధురిమ నృత్యం కారణంగా ఆ రోజు హోటలుకు లక్షల్లో ఆదాయముంటుంది. మధురిమను అపహరించాల్సిన బాధ్యత డేంజర్‌కు అప్పగించబడింది. రెండు విధాల లాభం వున్నది అందువల్ల.

మధురిమను అపహరించినందుకు మధుసూదనరావు ఇరవై వేలు యిస్తాడు. ఆయనకు తనొక్కడూ ఉండగా గదిలో మధురిమచేత నృత్యం చేయించుకోవాలని సరదా ఉన్నది. ఎంత డబ్బిచ్చినా మధురిమ ఒంటరిగా యే మగాడి గదికీ వెళ్ళదు. అందుకని ఆయన డేంజర్‌నాశ్రయించాడు. మధురిమ నపహరిస్తే ఆమెను తిరిగి అప్పగించడానికి సులభంగా యాభై వేల నుంచి లక్ష దాకా రేటు పెట్టవచ్చు. ఆ ఏర్పాటు కూడా మధుసూదనరావు తనే చేస్తానన్నాడు. అలా వచ్చిన డబ్బులో సగం డేంజర్‌ది.

డేంజర్‌కి బలం ఉంది. కానీ బుద్ధిబలం తక్కువ.

రాజులు అర్థ బలం, అంగబలం ఉన్నప్పటికీ మంత్రులను నియమించి పరిపాలనా వ్యవహారాలకు వారి సలహాలపై ఆధారపడతారు.

డేంజర్ అన్నింటికీ శ్రీకాంత్‌పై ఆధారపడతాడు.

మధురిమను అపహరించడానికి బుద్ధిబలం, కండబలం కూడా అవసరం. ఆమెకు కంటికి రెప్పలా కాపాడే భీమసేనుడున్నాడు. అతడి పేరు భీమసేన్! భీమసేనుడనే అంతా వ్యవహరిస్తారు.

పథకం సిద్ధమయింది. శ్రీకాంత్ రాగానే తాము బయల్దేరాలి.

అన్న టైముకి శ్రీకాంత్ రాలేదు. డేంజర్‌లో అసహనం బయల్దేరింది. అలాంటప్పుడే అతడికి తను ద్వేషించే వారి మీద మరింత ద్వేషం పెరిగిపోతుంది. అందుకే అతను ప్రతాప్ ఫోటోను తీసి బల్లమీద పెట్టాడు. ద్వేషం పెరిగింది. చాకు ఎత్తాడు.

శ్రీకాంత్ వచ్చాడు.

మళ్ళీ తీశాడు. మళ్ళీ ముద్దు పెట్టుకున్నాడు. అలా ఓ పది సార్లేనా చేసివుంటాడు. అప్పుడతను మళ్ళీ ఆ ఫోటోను జేబులో పెట్టుకుని—"జాహ్నవీ—యిదే స్థానం నీకు శాశ్వతం—" అన్నాడు. ఆ ఫోటో అతడి చొక్కా ఎడమ వైపు జేబులో వున్నది.

అతను మళ్ళీ కుడిచేతివైపు చొక్కా జేబులోంచి ఇంకో ఫోటో తీశాడు. ఆ ఫోటోవంక తీవ్రంగా చూశాడు. ఫోటోను నొనుపుగా వున్న బల్లమీద పెట్టి బలంగా అరచేతిని బిగించి నాలుగు దెబ్బలు వేశాడు. ఫోటో చలించలేదు. కానీ అతడి చేయి నొప్పిపెట్టింది.

ఓసారి ఊదుకున్నాడు చేతులు. అప్పుడు పాంటు జేబులోంచి తీశాడు సన్నటి, నున్నటి, పదునైన చాకు. కసిగా దాన్ని గాలిలోకి ఎత్తాడు.

కాలింగ్ బెల్ మ్రోగింది.

ఫోటోవంక అదోలా చూసి "నీ కింకా ఆయుష్షుంది" అన్నాడు.

నెమ్మదిగా వెళ్ళి తలుపు తీశాడు.

"అరే—డేంజర్! ఆలస్యం చేశానా?" అన్నాడు లోపలకు వచ్చినతను. అతను డేంజర్‌కు పూర్తిగా విరుద్ధంగా వున్నాడు. సన్నగా, అయిదడుగుల నాలుగంగుళాల మనిషి. చక్కటి క్రాఫు. ముఖానికి బాగున్నదల్లా క్రాపు ఒక్కటే!

"లేదు శ్రీకాంత్—కానీ నాకు టైమ్ గడవటంలేదు" అన్నాడు డేంజర్ అసహనంగా.

"మన కార్యక్రమం ఈరోజు వాయిదా పడింది—" అన్నాడు శ్రీకాంత్.

"ఏం?"

"జాహ్నవికి పెళ్ళి చూపులు...."

"అయ్—" అన్నాడు డేంజర్. "నేనుండగా దాన్ని చూసుకుందుకొచ్చే మగాడెవరు?"

"రఘురాంగారు ఢిల్లీనుంచి తీసుకొచ్చాడు—"

"ఢిల్లీనుంచా? యీ ఊళ్ళో పెళ్ళికొడుకులకు కరువొచ్చిందా?"

"వచ్చినట్లే వుంది మరి!" అన్నాడు శ్రీకాంత్.

"శ్రీకాంత్—ఆ పెళ్ళికొడుకెలా వున్నాడు?" డేంజర్ అడిగాడు.

"బాగున్నాడు. సాయంత్రం ఆ రింటికి పెళ్ళి చూపులు...."

డేంజర్ రెండు చేతులూ గట్టిగా బిగించాడు. ముఖంలో అసహనం అస్పష్టంగా కనబడింది.

డేంజర్ అసలు పేరు అదికాదు. చిన్నతనం నుంచీ అతను దుడుకు మనిషి. కాలేజీలో బాగా అల్లరి చేసేవాడు. ఓసారి యేదో గొడవలో ఎవరో్న తన్నాడు. తన్నులు తిన్నవాడు హాస్పిటలు పాలయ్యాడు. ఇతను కాలేజీనుంచి డిబారయ్యాడు. ఆ రోజే చదువుకు స్వస్తి చెప్పి డేంజర్ అని పేరు పెట్టుకుని బలహీనులను బెదిరిస్తూ బ్రతకడం అలవాటు చేసుకున్నాడు. అతడికి కొందరు ఊరిపెద్దల మద్దతు వుంది.

స్వల్పకాలంలోనే డేంజర్ డబ్బు బాగా సంపాదించాడు. ఆ డబ్బు అతడిలో గర్వాన్ని పెంచింది. ఒక మిత్రుడు అతణ్ని సవాలు చేశాడు. "నువ్వు డబ్బయితే సంపాదించావు కానీ—గౌరవం సంపాదించుకో లేదు. పరువైన యే యింటి ఆడదీ నిన్ను పెళ్ళి చేసుకోదు—" ఇదీ ఆ సవాలు.

"ఫలానా ఆడదాని పేరు చెప్పు. దాన్ని పెళ్ళాడ తాను—" అన్నాడు డేంజర్. యిది అతని సవాలు.

"పెళ్ళాడలేకపోతే—"

"బోడిగుండు చేయించుకుంటాను—"

అతడి మిత్రుడు జాహ్నవి పేరు చెప్పాడు. అలా చెప్పడానికి కారణముండి. ఆ మిత్రుడు ఒకసారి జాహ్నవి వెంటబడి చెప్పుదెబ్బ తిన్నాడు. దానికి బదులు ఇలా తీర్చుకోవాలనుకున్నాడు.

డేంజర్ తిన్నగా రఘురాం ఇంటికి వెళ్ళి—"నేను మంచివాళ్ళకు మంచివాణ్ని. మోసగాళ్ళకు మోసగాణ్ని. నా పేరు డేంజర్. నేను మర్యాదస్థుణ్ని కాదనీ కాబట్టి నేనడిగితే ఏ పెద్ద మనిషీ తన కూతుర్ని నాకిచ్చి పెళ్ళి చేయడని ఒకడన్నాడు. నేను నీ కూతుర్ని నాకిచ్చి పెళ్ళి చేయమంటున్నాను. ఒప్పుకుంటావా, లేదా?" అన డిగాడు.

రఘురాంకు డేంజర్ గురించి తెలుసు. మురికికాల్వలో రాయివేస్తే మనమీదకే మురికి చిమ్ముతుంది. డేంజర్‌తో గొడవపడటం మంచిదికాదని ఆయనకు తెలుసు. మంచిగానే అతణ్ని పంపించివేయాలనే ఉద్దేశ్యంతో—"నీకు మర్యాద తెలియదని యెవరు చెప్పినా నేను నమ్మను. నా కూతుర్ని నీకివ్వడానికీ నా కభ్యంతరంలేదు. ఎటొచ్చీ ఈ రోజుల్లో ఏ ఆడపిల్లకూ మెడలు వంచి ఇష్టంలేని పెళ్ళి చేయటం మర్యాదకాదు. నా కూతురి యిష్టం తెలుసుకుని పెళ్ళి చేయటం మర్యాదైన పద్ధతి. దాన్ని పిలవనా?" అనడిగాడు.

ఇది డేంజర్‌కు నచ్చింది. అతడిలో ఆవేశమేగానీ ఆలోచనలేదు.

రఘురాం జాహ్నవిని పిలిచాడు. ఆమె వచ్చింది.

జాహ్నవికి భయమంటే తెలియదు. ఆమె ధైర్యంగానే డేంజర్‌తో మాట్లాడింది. ఆమె అతడిని పెళ్ళి చేసుకోనని చెప్పింది.

డేంజర్ జాహ్నవిని ఏమీ అనలేకపోయాడు. ఆమె చెప్పింది శాంతంగా విన్నాడు. పెళ్ళి గుండు చేయించుకున్నాడు.

మిత్రుడతణ్ని ఎగతాళి చేశాడు.

"నేను జాహ్నవిని చూశాను. చూడగానే ఆమెపైన ప్రేమ కలిగింది. ఆమె నన్ను మర్యాదస్థుడని పొగిడింది. అలాంటప్పుడు నా మర్యాద నేను నిలుపుకోవాలి. నా ప్రేమను నేను నిరూపించుకోవాలి. అందుకే ఆమె మనసు గెలుచుకునేవరకూ నేనిలా బోడిగుండులోనే వుంటాను—" అన్నాడు డేంజర్.

డేంజర్ బోడిగుండు వయసు సుమారు ఏడాది వుంటుంది. ఈ ఏడాదిలోనూ అతను జాహ్నవి గురించి తెలుసుకుంటూనే వున్నాడు. ఆమె ఎక్కువగా ప్రతాప్‌ని కలుసుకుంటుంది.

ప్రతాప్‌ని ప్రేమిస్తున్నట్లు అతడికి అర్థమయింది.

అప్పుడే అతను ప్రతాప్ ఫోటో ఒకటి సంపాదించాడు.

డేంజర్ ఎవరినైనా హత్య చేయాలనుకుంటే అతడవలంబించే పద్ధతి యిది. ముందుగా ఆ వ్యక్తి ఫోటో సంపాదిస్తాడు. ఆ ఫోటోని రోజూ చూస్తూ ఏవేవో విషయాలు గుర్తుచేసుకుని — దాన్ని ద్వేషించడానికి ప్రయత్నిస్తాడు. ఆ ద్వేషం ఎంతలా పెరిగిపోవాలంటే ఒక రోజున అతడి చాకుతో ఆ ఫోటోను హత్య చేస్తాడు.

తనకు తెలియకుండానే ప్రతాప్‌ను రక్షించాడు.

"శ్రీకాంత్! అయితే జాహ్నవి వీడిని పెళ్ళాడదా?" అంటూ డేంజర్ అతడికి ప్రతాప్ ఫోటోను చూపించాడు.

శ్రీకాంత్ నవ్వాడు. సాధారణంగా లేదు, కాదు లాంటి సమాధానాలివ్వాల్సి వచ్చినపుడు అతను నవ్వుతాడు. అదే సమాధానం!

వెంటనే డేంజర్ ఆ ఫోటోను శ్రీకాంత్‌కు ఇచ్చేసి- "నా జేబు ఖాళీ అయింది. ఢిల్లీ పెళ్ళికొడుకు ఫోటో తెచ్చావా?" అన్నాడు.

శ్రీకాంత్ నవ్వలేదు. తను కోరింది లేదంటే డేంజర్‌కు నచ్చదు. అందుకని అలాంటప్పుడు అతను నవ్వడు.

"ఈ రోజు మధురిమ సంగతి పరిలేశాంగదా—ఇంక ఈ పనిమీదే వెళ్ళొచ్చు—" అన్నాడు శ్రీకాంత్.

"అవునూ—మధురిమ సంగతి ఏమయింది?"

"ఆమె ప్రోగ్రాం కాన్సిలయింది—"

"ఏం?"

"భీమసేనుడి వంట్లో అస్వస్థతగా ఉన్నదట—"

"ఊఁ!" అన్నాడు డేంజరు.

"అదీ మన మంచికే — అవతల జాహ్నవికి పెళ్ళికొడుకొస్తే ఇవతల మనకేం నిమిత్తముంటుంది? ఈ రోజుకీ సంగతి చూసుకోవచ్చు—" అన్నాడు శ్రీకాంత్.

డేంజర్ అలమారాలోంచి కెమేరా తీసి మెడలో తగిలించుకున్నాడు. శ్రీకాంత్ వంక చూసి — "ఏం చేయాలో చెప్పు!" అన్నాడు.

"చెయ్యడానికేముంది? ముందా పెళ్ళికొడుకొక్క స్నాప్ తీద్దాం—" అన్నాడు శ్రీకాంత్. డేంజర్

హుషారుగా ఈల వేశాడు.

ఇద్దరూ ఇంట్లోంచి బయటపడ్డారు.

* * *

"రా బాబూ — సుకుమార్ — నువ్వా?" అన్నాడు కామేశ్వరరావు.

"మా బావగారేం చేస్తున్నారండీ?" అన్నాడు సుకుమార్.

"వచ్చీరాగానే భోంచేసి పడుకున్నారు. ఇంతవరకూ నిద్రలేవలేదు. మమ్మల్ని లేపమంటావా? నువ్వు నిద్ర లేపుతావా?" అన్నాడు కామేశ్వరరావు.

"మీరే లేపండి!" అన్నాడు సుకుమార్.

అప్పటికి టైము నాలుగున్నరయింది.

కామేశ్వరరావు పెళ్ళికొడుకున్న గదిలోకి వెళ్ళాడు. అప్పటికతను లేచే వున్నాడు. ఏదో కాగితం వంక తీక్షణంగా చూస్తున్నాడు.

"బాబూ — నిద్రలేచి ఎంతసేపయింది? నువ్వింకా నిద్రపోతున్నావనుకునే అనుకున్నాను—" అన్నాడు కామేశ్వరరావు.

"నా గదిలోకి ఎవరైనా వచ్చారండీ?" అన్నాడతను వినయంగా.

"ఇప్పుడు నేను రావటమే — ఇంతవరకూ ఎవ్వరూ రాలేదు—"

అతను కామేశ్వరరావు చేతికి తనచేతిలోని కాగితం చూపించాడు. కామేశ్వరరావు అది ఆత్రుతగా చదివాడు.

"పెళ్ళి చూపులకు వెళ్ళకు. ప్రాణ ప్రమాదం!"

రెండే రెండు వాక్యాలున్నాయందులో.

"ఈ కాగితమేమిటి?"

"ఏమో — ఇది లేచి మూసుకు నేసరికి నా పక్కన వుంది—"

కామేశ్వరరావు వెంటనే తన ముగ్గురు పిల్లల్నీ పిలచాడు. వాళ్ళకు చిలిపితనం అల్లరి లేకపోలేదు. కానీ ఇలాంటి పని అందులోనూ ముఖపరిచయం లేనివారివద్ద చెయ్యరు.

వాళ్ళు తమకేమీ తెలియదన్నారు.

"మధ్యాహ్నం ఎవరైనా మనింటికొచ్చారా?"

కామేశ్వరరావు కూతురు లలిత ఎవరూ రాలేదని అన్నది.

తనకూ పెళ్ళిడుకొచ్చిన ఓ కూతురుందని గుర్తుకు రాగానే కామేశ్వరరావు చాలా నొచ్చుకున్నాడు. దీని గురించి రఘురాం ఏమనుకుంటాడు? పెళ్ళి సంబంధం జాహ్నవికి చెడగొట్టి తన కూతురుకు చేసుకోవాలనుకుంటున్నాడనుకోడూ?

సుకుమార్ వెళ్ళి పెళ్ళికొడుకును పలకరించాడు.

"మీకీ ఊళ్ళో శత్రువులెవరైనా ఉన్నారా?"

పెళ్ళికొడుకు అతన్నడిగాడు.

"శత్రువులుండేటంత గొప్పవాళ్ళంకాదు–" అన్నాడు సుకుమార్ నవ్వుతూ.

పెళ్ళికొడుకు అతనికి కాగితం చూపించి జరిగింది చెప్పాడు. అది చూడగానే సుకుమార్ గంభీరంగా అయిపోయాడు.

"ఎవరో తమాషా చేశారు!" అన్నాడతను.

"తమాషా అయినా కాకపోయినా మీరేం కంగారు పడకండి. నేను మీ యింటికి వస్తాను. ఇలాంటి కాగితాలకు భయపడే రకం కాదు నేను—" అన్నాడు

పెళ్ళికొడుకు.

అయిదింటికల్లా సుకుమార్, పెళ్ళికొడుకుతో బయ లేరాడు. వాళ్ళింకా గుమ్మం దిగకుండానే డేంజర్, శ్రీకాంత్ ఎదురయ్యారు.

"ఇలాంటి పర్సనాలిటీ నేనెక్కడా చూడలేదు. ఒక్క స్నాప్ తీసుకో గురూ—" అన్నాడు శ్రీకాంత్. డేంజర్ చటుక్కున పెళ్ళికొడుక్కు ఫోటో తీసి— "థాంక్స్!" అని వెళ్ళిపోయాడు.

"ఎవరతను?" అన్నాడు పెళ్ళికొడుకు.

"డేంజర్!" అన్నాడు సుకుమార్.

"అంటే?" ఉలిక్కిపడ్డాడు.

సుకుమార్ పెళ్ళికొడుక్కు డేంజర్ గురించి చెప్పాడు.

పెళ్ళికొడుకు నవ్వి — "పేరు తమాషాగా ఉంది కదూ!" అన్నాడు. కానీ అతడు తన ఫోటో ఎందుకు తీసుకున్నాడూ అన్న ఆలోచన కలక్కపోలేదు.

"రిక్షా ఎక్కుదామా?" అన్నాడు సుకుమార్.

"ఎంతదూరముంటుంది?"

"రెండు కిలోమీటర్లు...."

"అయితే సరదాగా నడుద్దాం...." అన్నాడు పెళ్ళికొడుకు.

ఇద్దరూ నడక ప్రారంభించారు. నాలుగడుగులైనా వెయ్యకుండా—"హలో సుకుమార్ — కులాసానా? ఈయనెవరు?" అంటూ ఒకతను పలకరించాడు.

సుకుమార్ పెళ్ళికొడుకును అతనికి పరిచయంచేసి— "ఈయన పేరు సురేష్ — మాకు పరిచయస్థులు—" అన్నాడు.

"జానకికి పెళ్ళికొడుకా?" అని వంకరగా నవ్వి వెళ్ళిపోయాడు సురేష్.

"ఎలాంటి పరిచయస్థుడు మీకతను?" అనడిగాడు పెళ్ళికొడుకు.

"పెద్ద జల్సారాయుడు—" అన్నాడు సుకుమార్— "పలకరిస్తాడు కదా అని పలకటమే గానీ ఎలాంటి పరిచయస్థుడో నాకూ తెలియదు—"

పెళ్ళికొడుకు నవ్వుతున్నాడు.

ఇద్దరూ సరదాగా కబుర్లు చెప్పుకుంటూ నాలు గడుగులు వేశారు. పెళ్ళికొడుకు చుట్టుపక్కల ఉన్న వాటి గురించి అవీ ఇవీ ప్రశ్నలువేసి ఏమిటన్నది తెలుసు కుంటున్నాడు. ఇద్దరూ కాస్త దూరం నడిచేసరికి ప్రతాప్ ఎదురయ్యాడు.

సుకుమార్ తనే ప్రతాప్‌ను పలకరించి — "నువ్వో రాకూడదూ మా యింటికి?" అనడిగాడు.

ప్రతాప్ పెళ్ళికొడుకు వివరాలు తెలుసుకుని-"విష్యూ బెస్టాఫ్ లక్" అని — "సారీ సుకుమార్ — రాలేక పోతున్నందుకు ఏమీ అనుకోకు—అర్జంటు పని ఉంది—" అనేసి హడావుడిగా వెళ్ళిపోయాడు.

"ఇతనికి మా చెల్లెలంటే ఇష్టం. జాతకాలు కలవలేదని పెద్దలు ఒప్పుకోలేదు. మాకు చిన్నప్పట్నించీ తెలుసు-" అన్నాడు సుకుమార్.

మరో పది నిమిషాల్లో ఇద్దరూ ఇల్లు చేరుకున్నారు.

రఘురాం పెళ్ళికొడుకును సవినయంగా రిసీవ్ చేసుకున్నాడు.

ఏర్పాట్లు ఘనంగా జరిగాయి.

చుట్టుపక్కల మరికొందరు పెద్దలు కూడా వచ్చారు. రఘురాం పెళ్ళికొడుకు గురించి పెద్దలకు చెప్పాడు. పేరు చలపతిరావు. సెంట్రలు గవర్నమెంట్ ఆఫీసరు. తల్లి, తండ్రీ లేరు. ఉద్యోగం ఢిల్లీలో. ఆంధ్రావైపు వచ్చే అవకాశముంది.

పెద్దలు పెళ్ళికొడుక్కు రఘురాం వంశ గౌరవం గురించి చెప్పారు.

తర్వాత జాహ్నవిని చూశాడు చలపతిరావు. ఆమె అందం చూస్తే అతడికి మతిపోయినట్లయింది. అతను చటుక్కున రఘురాం వంక తిరిగి — "ఇది చాలా అన్యాయం. మీ అమ్మాయికి అసలు పెళ్ళిచూపులే అనవసరం. ఒకవేళ జరిగినా ఆమెకు నేను నచ్చానా అన్నదే తెలుసుకోవాలి. ఆమె నచ్చని వరుడుంటాడని నేననుకోను—" అన్నాడు.

ఈ మాటలు జాహ్నవి కూడా విన్నది. అప్పుడామె తల ఎత్తి ధైర్యంగా పెళ్ళికొడుకును చూసింది. అతడి మాటలు అతడి సంస్కారాన్ని తెలియజేస్తున్నాయి. ఒక్క చూపుతూనే అతడి అందాన్ని అంచనావేసి— "ఎలాగైనా, ఎవరైనా ప్రతాప్ తర్వాతనే—" అనుకుందామె.

వరుడికి తను నచ్చినట్లే ఉంది. బహుశా ఈ పెళ్ళి నిశ్చయం కావచ్చు. అప్పుడు తనేం చేయాలి? ప్రతాప్‌ను మరిచిపోవాలా? అతణ్ని తాను మరిచిపోగలదా?

ఎలాగో అలాగ ఈ పెళ్ళి తప్పిపోతే ఎంత బాగుండును?

ఆమెకు పెళ్ళికొడుకుమీద రవంత జాలి కూడా వేసింది. తన ఇష్టానికి వ్యతిరేకంగా ఈ చూపులేర్పాటు

చేయబడినట్లు అతడికి తెలియదు. తనకు నచ్చితే వివాహం జరిగిపోతుందనే అనుకుంటున్నాడు. ఈ పెళ్ళి తన కెందుకిష్టంలేదో కారణాలు ఇంట్లో చెప్పుకోలేదు. కానీ ఈ పెళ్ళి ఆగడం కోసం ఏమైనా చేయాలని ఉంది.

ఏమైనా అంటే?

ప్రతాప్‌ను తను చాలా ఎక్కువగా ప్రేమిస్తోంది. అందుకోసం ఏమైనా చేసి ఈ పెళ్ళి ఆపాలి! ఏమైనా అంటే?

జాహ్నవి మరీ ఎక్కువగా ఆలోచించదల్చుకోలేదు. ఎందుకంటే ఆలోచనలామెను భయపెడుతున్నాయి.

వచ్చిన పెద్దలందరూ వరుడి సచ్ఛీలతను, సంస్కారాన్ని అభినందించారు. అంతా రఘురాంగారి అదృష్టమన్నారు.

"నాదేముందండీ-అంతా మా జాహ్నవి అదృష్టం-" అన్నాడాయన.

కానీ జాహ్నవి అలా అనుకుంటున్నట్లులేదు. ఈ పెళ్ళి ఆపడానికి ఏమైనా చేయాలి—అని మరీ మరీ అనుకోకుండా ఉండలేకపోతున్నదామె.

* * *

"చలపతిరావుగారెలా ఉన్నార్రా?" అనడిగింది లలిత, తమ్ముడు బాబూరావును పలకరిస్తూ.

"ఆయనకేమే — సినిమా హీరోలాగున్నాడు—" అన్నాడు బాబూరావు.

"నాకూ అలాగే అనిపించాడు—" అంది లలిత.

"జాహ్నవి కూడా హీరోయిన్‌లా ఉంటుంది గదా-ఇద్దరికీ పెళ్ళయితే బాగుంటుంది—" అన్నాడు బాబూరావు.

లలిత చురుగ్గా తమ్ముడి వంక చూసి—"ఏం—నేను బాగుండనా?" అంది.

వెంటనే బాబూరావు అక్క వంక తమాషాగా చూసి-"అమ్మ దొంగా — నువ్వాయన్ను ప్రేమిస్తున్నావా?" అన్నాడు.

లలితది పదహారేళ్ళ వయస్సు. అందమైన యువకుణ్ని చూసినపుడల్లా ఆమె ఏవేవో కలల్లోకి వెళ్ళిపోతూంటుంది. తమ్ముడి మాటలు విని ఆమె సిగ్గుపడుతూ— "జాహ్నవిని చూసుకుందుకు వస్తే ఆయన్ని నేను ప్రేమించడమేంటిరా? కానీ చిన్న పొరపాటు చేశాను. నువ్వే నన్ను రక్షించాలి—" అంది.

"ఏమిటది?" అన్నాడు బాబూరావు.

"నిన్నోసారి నేను రక్షించాను. గుర్తుందా?" అంది లలిత.

ఒకసారి బాబురావు ఇంట్లోంచి పదిరూపాయలు దొంగతనం చేశాడు. ఆ దొంగతనం లలిత చూసి పట్టుకుంది. కానీ ఆమె యింట్లో ఎవ్వరికీ చెప్పలేదు.

"అదెందుకు—ఇప్పుడు?"

"పొరపాట్లన్నవి అందరికీ వస్తాయి. చలపతిరావుగారి మంచంమీద ఆ చీటీ నేనే పెట్టాను. ఏమిటో అప్పుడలా చేయాలనిపించింది ఆ చీటీ ఆయనమీద పనిచేయనూ లేదు. ఆయన పెళ్ళి చూపులకు వెళ్ళటం మాననూ లేదు. రేపాయన ఆ చీటీని ఏ పోలీసు స్టేషన్లో అయినా యిస్తే ఏ దస్తూరీ నిపుణులైనా గుర్తిస్తే లేనిపోని గొడవవుతుంది. నువ్వా చీటీని ఎలాగో అలా ఆయన దగ్గర్నుంచి సంపాదించాలి!" అంది లలిత.

(ఇంకా వుంది)

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- లు నగదు బహుమతితోపాటు 6 నెలలు "సప్లిమెంట్" కూడా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.





## "ఎందుకూ"

"మీ పేరు?"

"ఎందుకు?"

"అనుమానం వచ్చింది!"

"ఎందుకు?"

"మీమీద ఒకరు ఫిర్యాదు చేశారు!"

"ఎందుకు?"

"ప్రక్కింట్లో దొంగలు పడ్డారు."

"ఎందుకు?"

"మీ వివరాలు పూర్తిగా చెప్పండి!"

"ఎందుకూ?!"

"మిమ్మల్ని అరెస్టు చెయ్యాల్సి వస్తుంది!"

"ఎందుకూ?!"

అంతవరకూ అతను 'ఎందుకూ?' అని ఎలా దీర్ఘం తీసినా ఓపికతో — విద్యుక్త ధర్మంతో — సహనంగా ప్రశ్నించిన ఎస్సై అప్పల్రాజుకు కోపం కట్టలు త్రెంచుకుంది. అసలు యూనిఫాంలో లేకపోవడమే అప్పల్రాజు సహనానికి ముఖ్యకారణం.

"మీరు ఆ ప్రక్కింట్లో వుంటున్నారా?" శాంతం తెచ్చిపెట్టుకుంటూ అన్నాడు ఎస్సై అప్పల్రాజు.

"ఎందుకూ?!" అతను మళ్ళీ రెట్టించాడు.

"ఇందుకు!" అని ఉక్రోషం ఆపుకోలేక చాచి లెంప కాయ కొట్టాడతన్ని ఎస్సై అప్పల్రాజు.

అతను బావురుమని ఏడుస్తూ వీధిగుండా గెంతుతూ పరుగందుకున్నాడు. మరి వెనుదిరిగి చూడకుండా పరిగెత్తు తున్నాడు.

అప్పుడే అక్కడకు వచ్చిన ఆసామి అదిచూసి పగలబడి నవ్వాడు.

అసలే ఆ ఫోగరమోతు సమాధానానికి తల తిరిగి పోయిన ఎస్సై అప్పల్రాజు అది చూపి సీరియస్‌గా ఆయన్ని సమీపించి నిలదీసాడు.

"ఏం? ఎందుకూ?!"

"సారీ సార్! నేను మీకు ఫిర్యాదు చేసింది ఇతని పైన కాదు. ఇతను పిచ్చివాడు. బైటకి చూడ్డానికి పెద్దమనిషిలా కనిపిస్తున్న ఓ అభాగ్యుడు. ఇంట్లోనివాళ్ళ కలతలవల్ల అయిపోయాడు. ప్చ్!!" జాలిగా చెప్పాడతను.

"ఆఁ!" అప్రయత్నంగా ఎస్సై అప్పల్రాజు పెదవులు ఒణికాయి. —ఇందూ రమణ. సింహాచలం.

## మూడు హత్యలు?

"హత్యకు పదివేలు చొప్పున మూడు హత్యలకు ముప్పైవేలు ఇవ్వు" అడిగాడు కిరాయి హంతకుడు గంగన్న.

"అదేమిటి? నేను చేయమన్నది ఒకటే హత్యకదా!" ఆశ్చర్యపోయాడు పాపారావు.

"నువు చెప్పిన ఆ ముసలాయన్ని చంపబోతే, ఆ ఇంట్లోని ఆడమనిషి, అబ్బాయి అడ్డు వచ్చారు. తప్పని సరిగా వాళ్ళను కూడా చంపవలసి వచ్చింది. కావున ముగ్గు

రికి కలిపి ముప్పైవేలు కక్కవలసిందే—?" దబాయించ సాగాడు గంగన్న.

"ఆస్తికి కక్కుర్తిపడి నా మామని చంపమంటే, నా భార్యా బిడ్డలనుకూడా చంపేవా?"అంటూ నిలుచున్న చోటనే కుప్పలా కూలిపోయాడు అతను.

—వాయిల రమణమూర్తి, పార్వతీపురం.

## అదుగో! బార్!

ఇద్దరు మిత్రులు కారులో వెళ్తున్నారు. కారు నడుపుతున్న వ్యక్తి బాగా తాగి వున్నాడు. కారుని అడ్డదిడ్డంగా నడుపుతున్నాడు.

పక్కనే కూర్చున్న అతని మిత్రునికి ముచ్చెమటలు పోస్తున్నాయి. ప్రాణాలు అరచేతిలో పట్టుకుని కూర్చున్నాడు.

మిత్రుడ్ని కారాపమంటే ఆపడం లేదు. తనే డ్రైవ్ చేద్దామనుకున్నా అతను డ్రైవింగ్ సీటులోనుంచీ కదలటం లేదు. అతనికి ఏం చేయాలో తోచలేదు.

కారు రోడ్డును విడిచి పొలాల కడ్డంపడి పరిగెత్తసాగింది. పక్కనున్న మిత్రునికి మరణం తథ్యమనిపించింది. ఆఖరి క్షణంలో అతనికొక ఐడియా వచ్చింది.

వెంటనే "ఒరేయ్ శర్మా! ఇక్కడొక 'బార్' వుంది: కారాపు!" అనరిచాడు గట్టిగా.

అంతే! టక్కున ఆగిపోయింది కారు.

బ్రతుకు జీవుడా అని కారు దిగి పరుగు లంకించుకున్నాడు ఆ మిత్రుడు.

—ఎల్. రాజ్యలక్ష్మి, వెంకటగిరి.

